యెన్నటికిని గవివరుఁడు కానేరఁడు. పద్యరచన మిట్టిదిగాదు. దీనికిని సహజశక్తి కొంతకావలసియున్నను, పరిశీలించిచూచినయెడల, నట్టిశక్తి పెక్కుడలఁ గానవచ్చుచున్నది. పద్యము చదువునెడ, వినునెడ, ఆపద్యంపుఁబోకడ గుర్తింపఁగలుగుమాత్ర నైపుణ్యమున్న నీవిద్యకు వలయు నిసర్గశక్తి యున్నట్లే. అది మనలో బెక్కుండ్రకుఁ గలదనుట యతిశయోక్తికాదు. బొత్తిగాలేనివారు ఎవరో కొందఱుందురుగాక, ఉన్నవారు తమ్ముఁదాము తరిచి చూచుకొనమి, సిద్ధికై ప్రయత్నింపమి, ఇట్టిశక్తి తమకులేదని భావించుకొనుచున్నారు. ఇంతకును సహజశక్తి కలదో, లేదో యెట్లు తెలియవలయును? తత్పరీక్షణమునకై యేమిజతనములు సేయఁబడినవి? ఇట్టిపూనికయులేక, మేము పద్యరచనసేయ నేరమను నిశ్చయమేల? శ్రద్ధాళువై ప్రయత్నించువిద్యార్థి కొన్ని సంవత్సరములలోఁ జక్కని పద్యరచయిత కావచ్చును. కాని దీని కపారపరిశ్రమము కావలసియున్నది. [illegible] కొల్లొల్ల, ఉత్తమకవులకావ్యపఠన మత్యంతావశ్యకము. అట్టికావ్యములు చదువుచో, నందు హృదయంగమములైన పద్యముల శతసహస్రములఁ గంఠస్థము సేయుట యెంతేకన్న నావశ్యకము. కంఠస్థములైనపద్యముల యతిగణప్రాసస్ఫోరకముగా, చక్కఁగాఁ జదువఁగలిగి యుండుట యంతకన్నను నావశ్యకము. ఈమూఁడింటిచే 'సహజశక్తి' యనంతముగా వర్ధిల్లఁగలదు. అటుపై, విద్యార్థి ఛందోవ్యాకరణాదికముల పరిజ్ఞానమలవరించుకొనవలయును. ప్రకృతము వ్యాప్తిలోనున్న విద్యావిధానమునుబట్టి, పద్యలక్షణము ఆఱవ 'ఫారమున' బోధింపఁబడుచున్నది. అప్పటినుండి విద్యార్థి పద్యరచనకుఁ దొడంగినచో, ఐదు, ఆఱుసంవత్సరములలో నొకపాటిరచయిత కావచ్చును. ఇఁకఁగొన్ని సంవత్సరములలో నుత్తమసిద్ధియుఁ బడయవచ్చును. కాని, ఇందులకు సామగ్రి యెంతయేని కావలసియున్నది. పద్యరచన కుపక్రమించువానికి అనంతమైన పదజాలము ముఖస్థముగా నుండవలయును. ఒక్కపదము గణానుకూల్యము గాకుండునేని, దానిస్థానమున వేఱొక పదము వాడుటకు శబ్దకోశము స్మృతిపథేయముగా నుండవలయును. దుష్కరప్రాసమునఁ దొడంగిన పద్యమును సలక్షణముగా నిర్వహించుటకుఁ దదాకారపదములు మూఁడేని తత్క్షణము స్ఫురింపవలయును. యతిస్థానముననున్న యక్షరముతో సవర్ణతకలపదము లప్పటప్పటికిఁ జొడకట్టుచుండవలయును. ఈప్రళయము నుండి వెలువడుటకు మార్గము ఒక్కటియేకలదు: అది యమరాదికోశములఁ జిన్ననాఁటనే గ్రుడ్డిపాఠము సేసియుంచుకొనుట. నిఘంటువుల గ్రుడ్డిపాఠము చేయుటవలనఁ గొంతప్రయోజనము లభించినను — శబ్దసంగ్రహమున కీమాత్రంపుఁ బరికరము పరిపూర్తి నీయఁజాలదు. సాహిత్యపటిమఁజేసి, కోశాంతర్గతములైన శబ్దములకు వివిధాకృతు లేర్పఱచునట్టి చతురిమము వలయును. ఉదా: "నక్షత్రేశః - క్షపాకరః" అని చంద్రపర్యాయము లైన రెండు శబ్దములను — గణయతిప్రాసముల యవసరముఁబట్టి నూఱువిధముల మార్చి, యాయాయిపద్యములలో నెలకొల్పవలసియుండును. ఇవిగాక, రచయితయొక్క నిక్కంపుశక్తిని పరీక్షించునది వేఱొక్కటికలదు. అది యేపదము ప్రక్క నేపదముఁ గూర్చిన శ్రుతిప్రసాదము పొసఁగునో, యది యరయఁగలిగియుండుట. "పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ దమలోన దొరయు శబ్దములఁగూర్చి" అని యాంధ్రకవిశేఖరుఁ డభివర్ణించినది యీనేర్పునే. పాండిత్యమునకుఁ జేరువడసిన కొందఱకడ నీప్రగల్భత కొంచెపడుటయు, ఇంచించుక చదువుకొన్నవారిలోఁ గొందఱకడ నీచాతుర్య మగ్గలముగాఁ గన్పట్టుటయుఁ జూడ, ఈశక్తి పురాకృతపుణ్యపరిపాకమో యని యనుమానింపఁదగియున్నది. ఇట్టి నేర్పు నధిగమించుటకు నిరంతర సత్కావ్యపఠనమే సాధనము. బమ్మెరపోతరాజకృతభాగవతము, శ్రీనాథుని శృంగారనైషధము, మను, వసుచరిత్రాదులు విద్యార్థుల కిప్పటికి లభించుసాధనములు. ఈ సాధనసామగ్రి సేకరించుకొనుట కనేకవత్సరములు పట్టును. ఇవియెల్లఁ జేకూరినవెనుకఁ బద్యరచన కుపక్రమింతుననుకొన్నవాఁడు ఎన్నటికిఁ గార్యసిద్ధి వడయనేరఁడు; వృత్తులెల్లఁ జక్కఁబడినవెనుక బ్రహ్మవిచారము సేయ

నెంచువానివలె, ఈఁతవచ్చినపిదప నీటఁజొర నిచ్చగించు వానివలె విద్యార్థి విఫలమనోరథుఁ డగును. ఏవిద్యకైన బాల్యమే యారంభమునకు సరియైన సమయము; అవిరతాభ్యాసమే పారంగతకు మార్గము. ఈన్యాయము పద్యరచనకుమాత్ర మేల భిన్నమగును? 'చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁట' నుండి గాకున్నను, 'నూనూఁగుమీసాల నూత్నయౌవనము'న నుండియేని దీనికిఁ గడంగవలదా? ఇట్టియభ్యాసమును బ్రోత్సహించుటకు మాఱు, పెద్దలేలొకో పిన్నల నీతద్వ్యాపారమునుండి మరల్పఁ జూచుచున్నారు! మాతృభాషపట్ల బ్రకృతిచేతనే యుదాసీనులగు బాలురు ఈప్రతీపోపదేశమును పాటించి పద్యప్రవృత్తికి విముఖులగుచున్నారు. ఇది సమంజసముకాదని విన్నవించుచున్నాను. బుద్ధికి ఉచితోన్మీలనము లేనియీడు బాలురు ఈ యభ్యాసమునకుఁ బూనుకొనుటలోఁ గొన్ని ప్రాతికూల్యములు కలవనుట యథార్థమే. కాని వానిఁ జక్కఁబెట్టి, యభ్యాసమును వెలయించుటకు మాఱు, అభ్యాసమును దుడమట్టించుట యాదరానర్హము. పద్యరచనమునకుఁ బూనుకొనువారి నావేశించు దోసములలో ప్రథమము అవలేపము; ఒక్క పద్యము ఛందోబద్ధముగా వ్రాయఁగలిగినంతనే కవిశేఖరుఁడ ననుకొనుట; పెద్దలకడ దిద్దించుకొనకయే ముద్రణమునకుఁ బరుగులెత్తుట; భావయు, భావమును— ఎట్టిసంస్కారమును బొరయకమున్నె నాఁటకాద్యుద్గ్రంథరచనకుఁ దొడంగుట; — ఇట్టి గర్వము బాలురకుఁ గూడదని వేఱ చెప్పనక్కఱలేదు. బాలుర కననేల? గర్వము పెద్దలకుమాత్రము తగునా? పెద్దయేమి, పిన్నయేమి? అది, హృదయక్షేత్రమున మొలకెత్తిననాఁడు అభ్యుదయబీజములన్నియు నశింపవలసినదేకదా! పద్యరచనాభ్యాసమువలని రెండవ దోసము: — ఇతరవ్యాపారనిరోధకారిత. ఇం దెంతయేని సత్యముకలదు. పద్యరచనావాగురలలోఁ దగుల్కొన్నవాఁడు అందుండి వెల్వడుట యరిది. పదము పదమునకును, పాదము పాదమునకును ఎలయించి పద్యము పూర్తియగువఱకుఁ బ్రొద్దు తెలియకుండఁజేసి, ఇతరకర్తవ్యముల మఱచునట్లుచేసి, భోజనాదులఁగూడ విస్మరింపఁజేసి, తన్మయునిఁజేసి — ఆకళ — ఉపాసకుని వశీకరించుకొనును. ఇందుచే, బహువిద్యాప్రసక్తులగు ఈనాఁటి బాలురకుఁ గొంత యపచితి ఘటిల్లఁగలదు. ఈదోషము సకలకళాసాధారణమే. దీనికిఁగా మనము విద్యార్థుల దూఱఁజనదు; అభినందింపను జనదు. కొంత మెలంకువతో, సమయమెఱిఁగి, వారిని వారించి, ఉచితకాలమున వారి మరలఁ బద్యరచనకుఁ బ్రేరింపవలయును. పద్యరచనపై వృద్ధు లారోపించు వేఱొక దోషము— విషాక్షురపాతము. సౌమనస్యముతోఁ బద్యరచనకు దొరఁకొను నెట్టివిద్యార్థియు దీనిఁగూర్చి శంకింపనక్కఱలేదు. 'ప్యారలల్ బార్సు' మీఁద నడచునెడ హృదయము చెదరియు, 'సైన్సు ఎక్స్పెరిమెంట్లు' చేయుచోట విషవాయువులు సోఁకియు బ్రమందినవారం దందుఁ గలరు గాని, పద్యరచనాదోషమున నసువులను వీడిన విద్యార్థి యిప్పటికి గగనకుసుమము. కాఁబట్టి పద్యరచన నిషేధించువారు చూపు మూఁడు డెప్పరములలో మూఁడవది మృషాప్రాయము; రెండవది సకలకళాసాధారణము; మొదటిది పేర్కొనందగినదియు కాదు. ఇట్టి కొంచెంపుఁజెడుగులకు వెఱచి, పద్యరచననే నిషేధింపఁబూనుట అజీర్తికి వెఱచి యన్నమును వర్జించునట్టి దగును. పద్యరచనవలని దోషములమాత్రమే యింతవఱకుఁ దడవితిని. పద్యరచనవలని గుణము లొక్కించుక దెలిపెదను:

౧. ఈరచయిత ప్రాక్తనపుణ్యవిశేషమునఁ గవియే యయ్యెనా, ఈయభ్యాస మాతని కవితకు మెఱుంగుపెట్టునదియై, యాతని పద్యముల నత్యంత హృద్యములఁగావించి, యాతని కజరామరమైన కీర్తిని ఘటించును.

౨. అటుగాక, యాతఁడు కవిగాకపోయిన, ఆతనికి నిర్దిష్టమైన భాషాభిరుచిని జేకూర్చి, పదజాలము నొసఁగి, ఛందోవ్యాకరణాలంకార రసశాస్త్రములతోడి పరిచయముఁ బెనిచి, మహాకవుల గ్రంథములఁ జక్కఁగా నరయు మనీషావిశేషమును బ్రసాదించును.

ఎట్లయినను, ఈవ్యాపారము సాహిత్యవృద్ధికి సహకార మగుననుట సమీచీనము. "వాదభ్రష్టో వైద్యశ్రేష్ఠః" అనునట్లు, కవితాసిద్ధికి దూరుఁడైనను అభ్యాసకుఁడు శిల్పజ్ఞుఁడైన సహృదయుఁ డగుననుటకు సందేహము లేదు.

3. పద్యరచనాశీలునకు వేఱొకలాభముకూడ కలదు. తాను స్వయము కవీశ్వరుఁడు కాకపోయినను, పూర్వోక్త సాహిత్య సంస్కారమువలన నతఁడు అవశ్యము భాషాంతరీకరణములకుఁ బూనుకొనవచ్చును. సాంస్కృతికములవలె మనకు సజాతీయములు కాకున్నను కేవల విజాతీయములని త్రోపాడఁదగని మనోహరఫణితు లాంగ్లమున నెన్నియేని కలవు. వానిలోఁ గొన్నింటి నాధునికులు అత్యంతనిపుణముగా నీభాషలోనికిఁ గొనివచ్చుచున్నారు. "భావకవిత్వ" మని యీనాఁటఁ బేర్కొనఁబడుదానికి మూలము—అంగలము నందలి 'Lyric Poetry' యనుట యనుపపన్నము గాదు. భారతి, సాహితి, కృష్ణాపత్రిక, శారద మొదలగు పత్రికలలో యువకు లెందఱో యీమార్గమున కృతిరచన గావించుచున్నారు. వీరి కవనములలో హూణవాఙ్మయచ్ఛాయ లగ్నముగా నున్నవి. కాని వీరి రచనానైపుణ్యమునఁ జేసి, యవి విదేశీయములుగాఁ దోఁపక, ఆంధ్రవాణి ధరించు నమూల్యభూషణములుగాను, ఆమె మృదుమధురభాషణములుగాను మనకు పరితోషమును గూర్చుచున్నవి. రచనకు ప్రేరకమైన మూలఫణితి యాంగ్లమున నున్నంతమాత్రమున వీరెవరును కవులు గారనఁ జెల్లునా? పద్యరచయితకును, గవికిని గల యంతరువు కరము సూక్ష్మముగానున్నది. పద్యరచన యెక్కడ నిక్కంపుఁగవిత్వముగాఁ బరిణమించుచున్నదో, కవిత్వ మెక్కడ పద్యరచనామాత్రమై రహి తలఁగుచున్నదో, ఆసీమను గుఱుతించుట మిగులకష్టము. పూర్వులకు లేని సౌకర్యము నేఁటివారల కొకటి కలదు. అది ఆంగ్ల భాషయొక్కయు, తన్మూలమునఁ బ్రపంచ సారస్వతముల యన్నింటియొక్కయు పరిజ్ఞానము. హూణభాషావిద్యార్థులు ఆంగ్లమునందువలెనే సంస్కృతాంధ్రములయందు నిరూఢమైన పాండిత్యము నలవఱచుకొని, పద్యరచనామార్గమున భాషాంతరములలోని సారస్యముల మనభాషలోనికిఁ గొనివత్తురేని, వారు దేశమున కలఘూపకారముఁ గావించినవారగుదురు. దండ్యాచార్యులమతమున కవిత్వసిద్ధికూడ ప్రయత్నముచేత సాధ్యము. కావ్యాదర్శములోని యీ రెండుశ్లోకములును తదీయాభిప్రాయమును వ్యక్తముచేయుచున్నవి:

"నైసర్గికీ చ ప్రతిభా శ్రుతంచ బహు నిర్మలమ్;
అమంద శ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః."

"నవిద్యతే యద్యపి పూర్వవాసనా
గుణానుబంధి ప్రతిభాన మద్భుతమ్;
శ్రుతేన యత్నేన చ వా గుపాసితా
ధ్రువం కరోత్యేవ కమప్యనుగ్రహమ్."

ఇందలి 'ధ్రువ' శబ్దము పురుషకారమున కుద్దీపకమైన విజయడిండిమముగా నున్నది. కావున నేదృష్టినిఁ జూచినను పద్యరచనాప్రావీణ్య సంపాదనము కాంక్షణీయముగా నున్నది.

దినాంతమున రిక్కలవలె, ఈనాఁట లెక్కకెక్కుడై యుప్పతిల్లుచున్న నాటకసమాజములఁ జూచి పద్యరచనమునకుఁ గాకున్నను పద్యపఠనమునకేని సమ్యక్ప్రచారము గలుగునని నేను తొలుతఁ గొండంత యాసతో నిరీక్షించితిని. ఈసమాజములు భాషాభివృద్ధికిఁ బరంపరాకారణములగునని దృఢముగా విశ్వసించితిని. కాని పురాంతరాగత, మండలాంతరాగత పురస్థసమాజములఁ బరిశీలించుకొలఁది యీయూహ శిథిలమగుచున్నది. ఏసమాజమందైనను, ఒకరిరువురు నటులు తక్క తక్కినవారు సాహిత్యానురక్తి లేనివారుగా నున్నారు. పెఱపుస్తకములమాట యటుండఁగా వారు తమనాటకములలోఁ దమ కీయఁబడినభాగములోని పద్యములనైన నావర్తించుట కోపికలేనివారుగా, అర్థస్ఫోరకముగాఁ జదువుటకు వలయు నవబోధనము లేనివారుగాఁ జూపట్టుచున్నారు. విద్వజ్జను లిట్టి ప్రయోగములకు విచ్చేసి, ప్రత్యక్షమునను, పత్త్రికాముఖమునను కొఱంతల నుద్ఘాటించి, యోగ్యుల నభినందించియు, నన్యుల హెచ్చరించియు వీనిం జక్కపఱుపకున్న

నటులు వినిపతితులగుటయేగాక పౌరజానపదుల యభిరుచియు సోపానకందుకన్యాయమున క్రమముగా నపకృష్టమై యభిరూపపరిషదాదరణీయములు కావలసిన రూపకములు. 'వీథిభాగవత'ము లగుననుట కెట్టి సందేహమును లేదు. భాషాదేవతకుఁ గలుగుచున్న యీ యలజడిఁ బాపుటయు విజ్ఞులకే కర్తవ్యముగా నున్నది.

పద్యరచన సేయఁగల విద్యార్థులు, కలాశాలలలో కతిపయులే కన్పట్టుచున్నారు. చేయువారిఁ గొండాడుటకు మాఱు కొంచపఱుచుటయే ఈకొఱవునకుఁ గారణమని తలంచెద. వీరిని మనము ప్రోత్సహింపవలయును. తెనుఁగుసభల వార్షికోత్సవములలోను, ఇతర సమావేశావసరములను పద్యరచనయందు స్పర్థాపరీక్షల నేర్పఱిచి, ఉత్తమరచయితల నిండుమనస్సుతో బహూకరింపవలయును. విద్వచ్ఛిరోమణీత్యాది పరీక్షలలో వ్యాసరచనాస్థానమునఁ బద్యరచన గావింపఁ డనియు పరీక్ష్యుల నడుగవలయును. విషయము తొలుతనే తెలిపి, కాలనియతిఁ బెట్టి పద్యములు వ్రాసిపంపినవారిని నవరాత్రోత్సవాదులలో గారవింపవలయును. మండలవిద్యార్థులలో నాంధ్రభాష నైచ్ఛికశాఖగాఁ గొని, పరీక్షలయం దనూనవిజయముగాంచినవారికిఁ గలవారు పారితోషికము లొసఁగవలయును. అన్నిటికన్న ముఖ్య విద్యార్థులకు భాషాపరిపాటి చక్కఁగా నలవడుటకుఁగా, వారికి ఆంధ్రమున వక్తృత్వపరీక్షలును, ప్రబంధపఠనపరీక్షలును, ఇట్టివాని నేర్పఱుపవలయును. తొంటి విద్యావిధానమున, ఒజ్జలు కొండికలచేతఁ 'బెద్దపుస్తక'ములఁ జదివించుట యాచారమై యుండెను. అది లేక ప్రాథమికవిద్యకుఁ బరిపూర్ణత లేకయుండెను. ఇప్పుడది కథాశేషమైనకతన, ఉన్నతపాఠశాలలలోని విద్యార్థులే కాక, కళాశాలలలోనివారుగూడ కావ్యగతపద్యముల నిర్నిరోధముగా, నిర్దుష్టముగాఁ జదువనేరకున్నారు. సుప్రసిద్ధములైన పురాణగాథలనే యెఱుంగకున్నారు. ఈకొఱంతను మనము తొల్దొల్త పూరింపవలసియున్నది. ఇట్లు బహుముఖముల నుత్కర్షసిద్ధికై ప్రయత్నింతుమేని "స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యంతే, నైకృతకావ్యాని చాన్య దపహాయ" అను వాగనుశాసనుని నాఁటి యభినివేశమునకు మనదేశము మరల లక్ష్యమగును; "స్వభాషాచ స్వమాతాచ స్వర్గాదప్యతిరిచ్యతే" అను శ్లోక మన్వర్థమగును. ఇట్టి దశావిశేషము నధిగమించుటకు విద్యార్థులకు వలయు విద్యోపాసనరూపమైన శ్రద్ధయును, విద్వాంసులకు వలయు శిష్యవాత్సల్యరూపమైన మనఃప్రవృత్తియు ఆంధ్రవిష్ణువు ప్రసాదించునుగావుతమని యీ వ్యాసము నుపసంహరించుచున్నాఁడను.



# సంస్కృత లింగవచనవిభక్తులు

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి

సంస్కృతము, గ్రీకు, లాటిను మొదలగు ననేక భాషలలో విశేష్యములకును విశేషణములకును సుప్ప్రక్రియ సమానముగానుండుటచే 'ఇండో-యూరపియన్' మాతృభాషలోకూడ నిట్టిస్థితియే యుండెనని మన మూహింపవచ్చును. అంత్యవర్ణము ననుసరించి శబ్దములను అజంతములనియు, హలంతములనియు రెండువిధములుగా విభాగము చేయవచ్చును.

జన్యభాషలన్నిటియందును గనబడుటచే నామవాచకములకు పుంలింగము, స్త్రీలింగము, నపుంసకలింగము నను లింగవ్యవహారము మాతృభాషలోనే ప్రారంభమైనదని మన మంగీకరింపవలసియున్నది. సంస్కృతము, గ్రీకు, లాటిను మొదలగుభాషలలో మూడులింగములలోను హలంతశబ్దము లుండుటచే మాతృభాషలో లింగ మర్థనిష్ఠముగానుండెనుకాని శబ్దనిష్ఠముగా నుండ లేదని మన మూహింపవలసియున్నది. కాని మాతృభాషలోనె క్రమముగా నర్థనిష్ఠమగు లింగము పదనిష్ఠముగా మారిన ట్లగపడుచున్నది. ఈ మార్పు ఏరీతిగా జరిగినదో తెలిసికొనుట కవకాశములు లేవు. ఆకారాంతశబ్దము లనేకములు స్త్రీవాచకములగుటచే వాని సాదృశ్యమువలనను, దచ్ఛబ్దమునకు స్త్రీలింగరూపము ఆకారాంతముగా నుండుటచేతను (సం. సా, గ్రీ. sē గాథి. sō) ఆకారాంతశబ్దములన్నియు స్త్రీలింగముగా వ్యవహరింపబడియుండవచ్చును. ఇట్లాకారాంతశబ్దములన్నియును స్త్రీలింగములుగా స్థిరపడినపిదప నాకారము స్త్రీప్రత్యయముగా తలంపబడి యితరశబ్దములకు జేర్చి స్త్రీలింగరూపములను చేయుచువచ్చిరి. ఇట్లే యకారాంత శబ్దములలో ననేకములు పురుషవాచకములగుటచే వాని సాహచర్యమునను, తచ్ఛబ్దమునకు పుంలింగరూపము అకారాంతముగా నుండుటచేతను (సం. స, గ్రీ. so, గాథి sa) అకారాంతశబ్దములన్నియును పుంలింగములుగా వ్యవహరింపబడియుండవచ్చును. అకారాంతనపుంసకలింగశబ్దముల యుత్పత్తి ముందు వివరింపబడును. ప్రత్యేకభాషలను, పరిశీలింపగా అకారాంతాకారాంతశబ్దములలో నీలింగవ్యవస్థ మాతృభాషలోనే జరిగిన ట్లూహింపవలసియున్నది. మిగిలినశబ్దములలో నర్థనిష్ఠమగు లింగము శబ్దనిష్ఠముగా నెట్లు మారినదో యూహించుట కవకాశము లేదు. మాతృభాషలో జరిగిన లింగవ్యవస్థ జన్యభాషలలో తిరిగి మార్పులను పొంది యుండును. మరికొన్ని శబ్దములలో నర్థనిష్ఠముగానున్న లింగము శబ్దనిష్ఠముగా మారియుండును. ఇట్లు 'దారాః' అనుశబ్దము సంస్కృతమున పుంలింగముగా జేయబడి యుండవలయును.

పుంలింగస్త్రీలింగవ్యవస్థ జరిగినపిదప నపుంసకలింగశబ్దము లేర్పడినవని యూహింపవలసియున్నది. నపుంసకలింగశబ్దములకు ప్రథమాద్వితీయావిభక్తులలో రూపభేదము లేదు. ప్రప్రథమమున పుంలింగస్త్రీలింగనపుంసకలింగశబ్దములరూపములలో భేదమేమియు నుండెడిదికాదు. క్రమముగా నప్రాణివాచకములను ప్రయోగించునపుడు అవి యకారాంతములైనచో ద్వితీయావిభక్తిరూపమును, తదితరములైనచో ప్రాతిపదికరూపమును ప్రథమార్థమున వ్యవహరింప నారంభించిరి. పురుషవాచకాకారాంతశబ్దముల ద్వితీయకర్మను తెలియజేయుటచే నది యప్రాణివాచకమగుటకు తగియుండెను. అకారాంతేతరశబ్దములు పురుషవాచకములుకానివి జడద్రవ్యస్థితి క్రియావాచకములుగా నుండెను. కాబట్టి వీని ప్రాతిపదికయే గ్రహింపబడెను. అకారాంతేతరశబ్దములలో ప్రథమాద్వితీయావిభక్తులు సమానముగా నుండుటంజేసి అకారాంతములలోకూడ ద్వితీయావిభక్తిరూపమే ప్రథమాద్వితీయావిభక్తులుగా వ్యవహరింపబడినది. తరువాతను పుంలింగశబ్దముల ననుసరించి నపుంసకలింగశబ్దములకుకూడ మిగిలిన విభక్తులు వ్యవహారములోనికి వచ్చినవి. జన్యభాషలలో మరల నీశబ్దముల

లింగమునకూడ మార్పుజరిగెను. అర్థనిష్ఠమను లింగము శబ్దనిష్ఠమయ్యెను. ఇట్లు కళత్రశబ్దము సంస్కృతమున నపుంసకలింగముగా వ్యవహరింపబడెను.

జన్యభాషలలో నపుంసకలింగబహువచన మన బను రూపము పూర్వము సమూహవాచకమగు స్త్రీలింగైకవచనరూపముగా నుండెను. అకారాన్తనపుంసకలింగశబ్దముల ప్రథమా ద్వితీయావిభక్తి ప్రత్యయమగు నాకారము (వై. జ్ఞానా, ధనా, వనా) స్త్రీలింగశబ్దముల ప్రథమైకవచనమున నగపడు నాకారముతో (విద్యా, రమా) సమానముగా నున్నది. హలన్తనపుంసకలింగశబ్దముల ప్రథమాద్వితీయా బహువచనప్రత్యయమగు నికారము (ఇం. యూ. ఇ, గ్రీ. a) పైయాకారమునకు స్వరలోపము కలిగినప్పుడు సంభవించురూపము కావచ్చును. ఇకారాన్త ఉకారాన్త నపుంసకలింగశబ్దముల ప్రథమాద్వితీయాబహువచనములచివర నగపడు ఈకార, ఊకారములు (వై. వారీ, మధూ) శబ్దాన్తములగు నికారోకారములతో పై యాకారరూపాన్తరమగు ఇ చేరుటచే నేర్పడియుండవచ్చును. (i, u + ē = ī, ū). ఈకారము యాన్తశబ్దముల ప్రథమైకవచనమున నగపడు ఈకారము (దేవీ, బృహతీ) కూడ కావచ్చును. మాతృభాషలో నీసమూహవాచకములగు స్త్రీలింగైకవచన రూపములు నపుంసకలింగ బహువచనమున ప్రథమా ద్వితీయావిభక్తులలో నుపయోగింపబడినవి. అందువల్లనే వైదికభాషయందును, గ్రీకుభాషయందును నేకవచనక్రియాన్వయముగల నపుంసకలింగ బహువచన రూపము లగపడుచున్నవి. ఉ. ధృష్ణవే ధీయతే ధనా; సర్వాతా......అస్తు. తరువాతను మిగిలినవిభక్తు లేకవచనమునందువలెనే పుంలింగము ననుసరించి వ్యవహారములోనికి వచ్చినవి.

ఏకవచనము, ద్వివచనము, బహువచనము నని నామవాచకములకు మొదటినుండియు మూడువచనములు వ్యవహారములో నుండినవి. ఏకవచన బహువచనములు ప్రత్యేకభాషలయందువలెనే మాతృభాషలోకూడ వ్యవహరింపబడుచుండినవి. ద్వివచన ప్రయోగమున మాత్రము మార్పుజరిగినది. ఇది రూపమున నేకవచనమై నైసర్గికముగా జంటలగు పదార్థములను బోధించుచుండెను (అక్షీ, బాహూ, హస్తౌ, పాదౌ). తరువాత నిది తరచుగా కూడియుండు రెండుపదార్థములను బోధించుట కుపయోగింపబడ నారంభించెను (అశ్వౌ, గావౌ). ఇట్టిపదార్థములు రెండును భిన్నములైనచో మొదటిదానినామమే ద్వివచనమున రెంటిని బోధించుట కుపయోగింపబడెను (ఉషాసా, అహనీ, ద్యావా, పితరౌ).

'ఇండో - యూరపియన్' మాతృభాషలో ఉభౌ (గ్రీ. ampho, లా. ambo), ద్వౌ (గ్రీ. duō, లా. duo) అను పదములు ద్విత్వవాచకములతోకూడ ప్రయోగింపబడుచుండెను. పదార్థములు రెండైనపుడు మొదటిపదమును, అనేకములైనపుడు రెండవది యును గ్రహింపబడుచుండెను. వీనివలన ద్విత్వబోధ కలుగుటచే క్రమముగా నామవాచకము బహువచనమున బ్రయోగింపబడ నారంభించెను. ఈయలవాటే జన్యభాషలలో ద్వివచనము లోపించుటకు బీజమైనది. వేదమునను గ్రీకుభాషయందును, నైసర్గికముగా జంటలు కాని పదార్థములను బోధించుపదములు ద్వివచనమున ద్వౌపదవిరహితముగా, నతివిరళముగా బ్రయోగింపబడి యున్నవి.

ద్వివచనము ఆర్యన్ - గ్రీక్ - బాల్టో- స్లావొనిక్ భాషలలోను ప్రాచీనమగు ఐరిష్‌భాషలోను మాత్రము కనబడుచున్నది. మిగిలినభాషలలో నశించినది. ఆభాషలనుబట్టి చూచిన మాతృభాషలో ఏకవచన బహువచనముల కుండినట్లు ద్వివచనమునకు రూపబాహుళ్య ముండినట్లు తోచదు. ప్రథమాసంబోధన ప్రథమా ద్వితీయా విభక్తులలో పుంలింగ స్త్రీలింగములలో నొకరూపమును, నపుంసకలింగమున మరియొకరూపమును, తృతీయాచతుర్థీపంచమీవిభక్తులలో నన్ని లింగములలోను నింకొకరూపమును, షష్ఠీసప్తములలో వేరియొకరూపమును నని ద్వివచనమున నయిదురూపములే యుండినట్లు తెలియుచున్నది.

ప్రత్యేకభాషలలో దేనియందును ఎనిమిది విభక్తులకంటె నధికముగ లేనందున మాతృభాషలో

నెనిమిది విభక్తులే యుండినవని మన మూహింపవచ్చును. వీనిలో సంబోధనముకూడ నొకవిభక్తిగ లెక్కింపబడినది. కాని యది వాక్యమునందలి మిగిలినపదములతో సంబంధించియుండనందున దానిని విభక్తులలో లెక్కించుట న్యాయముకాదు. మిగిలినయేడును క్రమముగా ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి యనునామముల వ్యవహరింపబడుచున్నవి. ఈ విభక్తులన్నియు సంస్కృతమున కనబడుచున్నవి. బాల్టిక్-స్లెవోనిక్ భాషలలో పంచమి లోపించినది. లాటిన్ భాషలో తృతీయ సప్తములు లోపించినవి. గ్రీక్, గాథిక్ భాషలలో పంచమికూడ లోపించినది. అధునాతనాంగ్లేయభాషలో చతుర్థికూడ లోపించినది. విభక్త్యర్థవిచారము మన కిచ్చట ప్రసక్తముకాదు.

మాతృభాషలోకూడ ఒక విభక్తిరూపమునకు అనేకవిభక్తులయర్థములు సంబంధించియుండెను. ఇట్లనేకవిధములగు శబ్దములకు పంచమ్యేకవచనమునను, షష్ఠ్యేకవచనమునను నైకరూప్య ముండెను (సం. నావః, గ్రీ. nēos) మరియు నన్నిశబ్దములకును చతుర్థీ పంచమీ బహువచనములలో నొక్కరూపమే వ్యవహరింపబడుచుండెను (సం. నాభ్యః, లా. nāv-ib s). ఇట్టిరూపసాంకర్య మస్మద్యుష్మచ్ఛబ్దములలో విశేషముగా గలదు. (మే, నః; తే, వః). ఇట్టి రూపసామ్యము 'సింక్రెటిసమ్' (Syncretism) వలన కలుగునని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. విభిన్నార్థకములగు ననేకవిభక్తిరూపములస్థానమున వానియర్థములనన్నిటిని గ్రహించిన యొకవిభక్తిరూపము వ్యవహారములోనికివచ్చుట పైనామమున వ్యవహరింపబడుచున్నది. ప్రథమమున ననేకవిభక్తులలో నొక్కొకటియును అన్నిటి యర్థములను గ్రహించి అన్నియును కొంత కాలము వ్యవహారములో నుండును. క్రమముగా సమానార్థకములగువానిలో నేదోయొకరూపము నిలిచి, మిగిలినవి లోపించును. నిలిచినరూప మన్నిశబ్దములలోను సమానముగా నుండకపోవచ్చును. ఇట్లు ప్రాకృతభాషలలో షష్ఠి యనబడు విభక్తి షష్ఠ్యర్థమునేకాక చతుర్థ్యర్థమునుకూడ గ్రహించినది. గ్రీకు భాషయందు చతుర్థి యనబడు విభక్తి చతుర్థ్యర్థమునేకాక తృతీయార్థమును, సప్తమ్యర్థమునుకూడ గ్రహించినది. లాటిన్ భాషలో పంచమియనబడు విభక్తి పంచమ్యర్థమునేకాక తృతీయార్థమును, సప్తమ్యర్థమును కూడ గ్రహించినది. కాని గ్రీకుభాషలో చతుర్థీరూపములనబడువానిలో ప్రాచీనచతుర్థీతృతీయాసప్తమీరూపములు కలిసియున్నవి. ఇట్లే లాటినుభాషలో పంచమీరూపములనబడువానిలో ప్రాచీన పంచమీ తృతీయాసప్తమీ రూపములు చేరియున్నవి.

'ఇండో-యూరపియన్' కుటుంబములో చేరినదగుటచే సంస్కృతభాష యస్పష్టప్రత్యయభాష యగుచున్నది. కాబట్టి యందు ప్రకృతిప్రత్యయవిభాగము దుష్కరముగా నుండును. సుప్ప్రత్యయములలో నజాది ప్రత్యయములు హలంతశబ్దములలోను, హలాదిప్రత్యయములు అజంతశబ్దములలోను కొంతవరకు స్పష్టముగా కనబడును. హలాదిప్రత్యయములకంటె నజాదిప్రత్యయము లధికమగుటచే ప్రత్యయస్వరూపనిరూపణమున హలంతశబ్దము లధికసహాయ మొనరించును. సంస్కృతప్రత్యయములును, వానిప్రక్కను కుండలములలో తెలిపినంతవరకు వాని ప్రాచీనరూపములును నీక్రింద జూపబడినవి:—

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమ | స్ (s) | ఔ (ōu, ō) | అస్ (es) |
| సం. ప్రథమ | ... | ఔ (ōu, ō) | అస్ (es) |
| ద్వితీయ | అమ్ (m, m̥) | ఔ (ōu, ō) | అస్ (ns) n̥s) |
| తృతీయ | ఆ (a) | భ్యామ్ (bh–) | భిస్ (bhis) |
| చతుర్థి | ఏ (ai) | భ్యామ్ (bh–) | భ్యస్ (bh–) |
| పంచమి | అస్ (es) | భ్యామ్ (bh–) | భ్యస్ (bh–) |
| షష్ఠి | అస్ (es) | ఓస్ (ous) | ఆమ్ (ōm) |
| సప్తమి | ఇ (i) | ఓస్ (ous) | సు (su) |

పైపట్టికనుచూడగా నన్నివిభక్తులకు నన్నివచనములలోను విభిన్నరూపములు లేనట్లు తెలియుచున్నది. పంచమియందు అకారాంతశబ్దములకే యేకవచనమునందైనను ప్రత్యేకరూపము కలదుకాని మిగిలినశబ్ద

ములకు కానరాదు. ఏకవచనమున షష్ఠీవిభక్తితోడను, ద్వివచనబహువచనముల చతుర్థీ విభక్తితోడను పంచమి సమానముగా నున్నది. ద్వివచనమున విభిన్నప్రత్యయములు మూడుమాత్ర మగపడుచున్నవి. ప్రథమా ద్వితీయావిభక్తులలో నొకటియును, తృతీయాచతుర్థీ పంచములలో మరియొకటియును, షష్ఠీసప్తములలో నింకొకటియును కలదు.

పై ప్రత్యయములుచేర్చుటచే శబ్దములకు విభక్తులేర్పడును. కొన్ని శబ్దములలో ప్రథమైకవచనమునగాని, సప్తమ్యేకవచనమునగాని ప్రాతిపదికయే విభక్తిరూపముగా నున్నది. ఉ. బాలా, పితా, నామ, పురు, దుర్మనః, వ్యోమన్. ఇట్టివ్యవహారము భాషాన్తరములలోగూడ కలదు. ఉ. గ్రీ. **khora**, లా. **filia**; గ్రీ. **onoma**, లా. **nomen**; గ్రీ. **patēr**.

పై విభక్తిప్రత్యయముల యుత్పత్తిని గురించి తెలిసికొనుటకు మనకేమియును నాధారములు లేవు. ప్రథమమున నివి స్వతంత్రశబ్దములుగా నుండినవనియు, తరువాత నవి తత్సంబద్ధశబ్దములతో కలిసి సమాసములలో నుత్తరపదములైనవనియు, క్రమముగా వర్ణలోపములను పొంది ప్రత్యయరూపముగా పరిణమించినవనియు మన మూహింపవచ్చును. ఆధునికభాషలలో పైవిధమున శబ్దములు ప్రత్యయములలోనికి మారుట మన కనుభవసిద్ధముగా నున్నది. కాని యీప్రత్యయములకు మూలభూతములగు శబ్దముల స్వరూపమునుగాని, యర్థమునుగాని నిర్ణయించుటకు మన కాధారములు లేవు.

కొన్ని నామవాచకములకు సుప్ప్రత్యయములు చేరుసందర్భమున ప్రాతిపదికలో వర్ణవిపరిణామములు సంభవించుచుండును. ఇవి స్వరవిపరిణామభేదములుగా నుండును. ఉ. పితౄ; పితృభిః, పితరః, పితా, గ్రీ. **patros**, **patera**, **patēr**, పదా, పాత్; లా. **pedem**, **pēs**; ధీమతా, ధీమన్తః, ధీమాన్. ఈమార్పుల ననుసరించి విభక్తులను దృఢమైనవనియు (**Strong**), అల్పమైనవనియు (**Weak**) పాశ్చాత్యులు విభాగము చేసియున్నారు. దృఢమైన విభక్తులనే మనవారు సర్వనామస్థానమని వ్యవహరించియున్నారు. పుంలింగ స్త్రీలింగ శబ్దములలో ప్రథమాద్వితీయల యేకవచన ద్వివచనములును, ప్రథమాబహువచనమును సర్వనామస్థాన మనబడును. నపుంసకలింగమున ప్రథమాద్వితీయల బహువచనము మాత్రమే సర్వనామస్థాన మనబడును. పాశ్చాత్యులు సప్తమ్యేకవచనముకూడ దృఢవిభక్తియని చెప్పెదరు. ఈ విభాగము సంస్కృతభాషయందే సరిగా నిలిచియున్నది. మిగిలినభాషలలో విశేషముగా సాంకర్యమును పొందినది. ఈభేదము ఇకారాన్త-ఉకారాన్త-ఏజన్త-హలంతశబ్దములలో కనబడుచుండును. సంస్కృతమున నసర్వనామస్థానమునందలి హలాదివిభక్తులకు పదసంజ్ఞ కలదు. వీనిని పాశ్చాత్యులు మధ్యమము (**Middle**) లని వ్యవహరించెదరు.

జన్యభాషలలో అవ్యయరూపములను నీక్రింది శబ్దములు సుబన్తరూపములచివరను చేరి ప్రత్యయభాగముగా వ్యవహరింపబడుచున్నవి. (1) ఎ (e). ఉ. వృకాయ (వృక + ఎ + అ), లిథు. **rankoje**, **rankose**, ప్రా. స్లై. **kamene**. ఇది సంస్కృతమునందలి ఆ (ఆఙ్) యను నవ్యయమును సంబంధించియుండవచ్చును. (2) ఇ, ఉ: సప్తమీవిభక్తియందు కనబడుచున్నవి. ఉ. వృకేషు, గ్రీ. **lukoisi**. (3) అమ్, మ్ (**em, om, m**). ఉ. అశ్వానామ్ (అశ్వ + అ + అమ్), ప్రా. స్లై. **rankam**, గ్రీ. **theophin**, వృకాభ్యామ్, అహమ్, వయమ్, మామ్, ప్రా. స్లై. **mem**. ఇది సర్వనామములలో విశేషముగా కనబడుచుండును. అకారాన్తనపుంసకలింగశబ్దముల ప్రథమాద్వితీయైకవచనముల చివరను కనబడు మకారము దీనిని సంబంధించియుండవచ్చును. ఉ. యుగమ్. లా. **jugum**.

మాతృభాషలలో నామవాచకముల విభక్తులకును, సర్వనామముల విభక్తులకును కొంచెము భేదముండెను. ఉ. తద్, తస్య, గ్రీ. **to**, **toio** కాని నవమ్, లా. **novom**; శరదః. ఈరెండువిధములగు విభక్తులకు మాతృభాషలలోను, ప్రత్యేకభాషలలోను వినిమయము కలుగుచుండెను. ఉ. వృకస్య, గ్రీ. **lukoio**. సర్వనామ

శబ్దములలో ప్రాతిపదికకును ప్రత్యయమునకును మధ్యను శబ్దాన్తరములు చేరుటకూడ కలదు. ఉ. అస్మభ్యమ్, మహ్యమ్, తస్మాత్, తస్యామ్. మరియు నామవాచకములలో నన్ని విభక్తులలోను అనుగతమగు ప్రాతిపదికయుండును. సర్వనామశబ్దములలో ప్రాతిపదికభేదముకూడ నుండును. ఉ. సః, తస్య; అహమ్, వయమ్; త్వమ్, యూయమ్; ఇదమ్, అనేన. ఇట్లు ప్రాతిపదికభేదం చుటచే నేకవచనమునను, బహువచనమునను ప్రత్యయము సమానముగాగూడ నుండును. నామవాచకములలో నేకవచన బహువచనప్రత్యయములకు భేదముండును. ఉ. మహ్యం, అస్మభ్యమ్; త్వత్, యుష్మత్. కొన్ని విభక్తులలో ప్రత్యయమున్నట్లే తోచదు. ఉ. మమ, తవ; మా, త్వా; మే, తే; అమూ, అమీ.

---

## ప్రైవేటు ట్యూషను




క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యం.

# ఉపాయనము

పెనుమర్తి కామేశ్వరరావు
(సారస్వత కుటీరము)

భారతీదేవికి పదకొండోయేడు
నిండిపోయె; యశమ్ము నిండిపోయినది
రోదసీపర్యంతలోకమ్ము నందు.

*

'సరిలేనియిల్లాలు సారస్వతమున
కన్నాకు తెలుఁగులోనున్న పత్రికల'
ననుచు వేనోళ్లతో నార్యులు వొగడ.

ప్రకృతి రహస్యాల బయటికిఁ దెచ్చి
పన్నిటి సెలయేళ్లఁ బ్రవహింపఁజేసి
పూఁదేనెవర్షమ్ముఁ బాలబాలఁగురిసి
ఆంధ్రులమన్నన లందినతల్లి!
ఆంధ్రభాషాదేవి యనుఁగుకూఁతునకు
పుట్టినపండుగ-పున్నెపుదినము
కానుకగా నేమిచ్చి గౌరవించెదరు?

*

తెలుఁగుకోయిలలార! తీసుకరండు
పంచమస్వరములోఁ బాడెడు గీతి
తెలుఁగుపికములార! తీసుకరండు
ప్రమోదులఁ జిగిరించు మురిపెంపుపాట!

*

ఆంధ్రభాషాదేవి అనుఁగు కూఁతునకు
పుట్టిన పండుగ-పున్నెపుదినము,
ఎలదేటులార! మీ రెల్లరుఁగూడి
పుష్పకన్యలనుండి పూఁదేనె నెల్ల
భారతీదేవికి పట్టుకరండు!

*

ఆంధ్రభాషాదేవి అనుఁగుకూఁతునకు
పుట్టినపండుగ-పున్నెపుదినము,
ఆమ్రవృక్షములార! ప్రేమతో మీరు
పరిణతఫలములఁ బట్టుకరండు
భారతీదేవి కుపాయన మివ్వ!

*

ఆంధ్రభాషాదేవి అనుఁగుకూఁతునకు
పుట్టినపండుగ-పున్నెపుదినము!

---



తిరుమలనాయకసౌధద్వారము-మధుర

K. P. S.



తిరుమలనాయకుని సౌధాంతర్భాగము-ఉత్తరవైపు-మధుర



తిరుమలనాయకుని సౌధాంతర్భాగమునందలి క్రీడాసరోవరము-మధుర K. P. S.



అరుణాచలేశ్వర దేవాలయము-తిరువణ్ణామలై M. P. S.

# *భోజరాజీయము శైలి

అవసరాల వెంకటనరసు

కావ్యమునకు శైలి ప్రాణమువంటిది. చైతన్యములేని పోతవిగ్రహమందు సర్వాంగసౌందర్య ముండిననేమి, లేకున్ననేమి? అట్లే చక్కని రసపోషకమగు శైలిలేని కావ్యమున కథాప్రాశస్త్యాద్యుత్తమలక్షణము లున్నను తత్కావ్యము రసికజనాహ్లాద మొనగూర్పదు. కావ్యప్రాశస్త్యనిర్ణయమందు శైలికి ముఖ్యస్థాన మాంధ్రవాఙ్మయముననే కాక ఇతర భాషావాఙ్మయములందుకూడ నీయబడుచున్నది. చరిత్రరచనయందు కార్లైలు శైలియు, వ్యాసరచనయందు గోల్డ్‌స్మిత్ శైలియు కావ్యదృష్టితో పరిశీలించినచో, కావ్యరసోన్మీలనమునకును, శైలికిని గల సన్నిహితసంబంధము సువ్యక్తము కాగలదు. బ్రహ్మవిద్యయైన భగవద్గీతలోని శైలి శాస్త్రోచితమై యెంతటి సూక్ష్మభావములనైనను విశదీకరించుటకు సహకారియైయున్నది.

ఉత్తమశైలికి పట్టవలసిన శుభలక్షణము లన్నియు భోజరాజీయముశైలికి పట్టినవి. పద్యములలో చక్కని ధారాశుద్ధి యున్నది. పదలాలిత్యమందును, అర్థసౌలభ్యమునను ఈ కావ్యమునకు సాటివచ్చు కావ్యములు తెనుగు భాషలో నరుదుగా నున్నవి. పద్యము లొకదానివెంబడి నింకొకటి పరువెత్తుచు హారమందలి పుష్పములవలె విరాజిల్లుచున్నవి. శైలియం దొకనూత్నశోభ (grace)యున్నది. వివిధఘట్టములందు రసోచితమైన గమనసౌందర్య మున్నది. ఉత్తమకవుల రచనలందెల్ల నంతర్వాహినియై రసజ్ఞుల కమితానంద మొనగూర్చు గానమాధుర్య(Poetic melody)మీ కావ్యమందెల్లెడల నైట్‌క్వీన్ కుసుమగుచ్ఛముల సౌరభమువలె వెల్లివిరిసి ప్రవహించుచున్నది. 'వాణీప్రసాదలబ్ధవాగ్వైభవుడ' నని కవి వ్రాసుకొనుటలో లేశమైనను అతిశయోక్తిలేదని పాఠకులెల్ల నంగీకరింతురు. కంఠమందు లేశమైనను జీరలేక శ్రోతల నానందపరవశులజేయు గాయకశిఖామణివలె యీ కవిపుంగవుడు అమృతోపమమగు తన శైలి మాధుర్యముచే రసికజనహృదయముల కరగించి యానందాంబుధి నోలలాడించుచున్నాడు.

ఉత్తమ శైలి ప్రధానలక్షణములలో నొకటి అర్థసౌలభ్యము. ఒక్క తెనుగుభాషయందేకాక యితరభాషలందుకూడ ఈ లక్షణమునకు విశేషగౌరవ మీయబడుచున్నది. వాల్మీకిరామాయణ మత్యాదరణీయగ్రంథ

* భోజరాజీయము అనంతామాత్యరచిత పద్యకావ్యము. ఈకవి భారతకవుల తరువాతివాడును, ప్రబంధకవులముందువాడును నైనట్లు కాన్పించును.

మగుటకు కారణములలో నొకటి అందలి మృదుమధురశైలి. షేక్స్పియర్ రచనలకు గలిగిన యాధిక్యమునకు అందలి సులభశైలి హేతుభూత మగుచున్నది. గోల్డ్‌స్మిత్ వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు చదివినవారు అందలి ఉత్తమభావములను, చక్కనికథను అధికముగ స్తుతింపవలెనో, మల్లికాకుసుమసౌరభమునుబోలు తత్కావ్యములోని శైలిని విశేషముగ కొనియాడవలెనో నిర్ధారణచేయలేకున్నారు. భాషయందుగాని, భావములందుగాని క్లిష్టత యున్న కావ్యము చదువరుల నాకర్షింపదు. ఆముక్తమాల్యదలోని ప్రతిపద్యమునందును యెంతటి యుత్తమభావము లున్నను, ప్రతిపదమునకును నిఘంటువును చూచి అర్థము తెలుసుకొని ఆయర్థమును రెండుమూడుసార్లన్వయించుకొని, ఒకపావుగంట శ్రమపడిననేకాని అందలి భావములు వెల్లడికావు. ఇంతటిశ్రమపడుటకు పరీక్షాగ్రంథముగ పఠించు విద్యార్థులే కాని సామాన్యులు పూనుకొనరు. భావములు పాఠకులకు సుగ్రాహ్యము లొనర్చుటయందేకాక వాని నొండొంటితో నన్వయించునప్పుడు లేశమైనను చిందరవందర కలుగకుండ వ్రాయుట మహాకవుల లక్షణము. కవిబ్రహ్మయని పేరువడసిన తిక్కనసోమయాజిపద్యములందుసహితము అక్కడక్కడ అన్వయకాఠిన్య మున్నదని కొందరి యభిప్రాయము. అనేకభావముల నొకేసందర్భమున ప్రదర్శించునప్పు డాభావములు తలవెండ్రుకచిక్కువలె చూపక, యేభావమున కాభావమునకు వ్యక్తిత్వ మిచ్చి, సృష్టికర్త కలువపూరేకుల నొండొంటితో జతపర్చినట్లు వానిని కూర్చి ప్రదర్శించుట ఉత్తమ కవులకు స్వాభావికము.

అనంతామాత్యుని ప్రతిపద్యములోని భావములును అనటిపం డొలిచి చేతపెట్టినంత సులభముగ చదువరుల కందుబాటై యుండును. ఈతని శైలి పంజాబుద్రాక్షాపాకమని వ్రాయవలసియున్నది. మామూలు ద్రాక్షపండు భుజించువారు గింజ నావల ఉమ్మివేయవలసియుండును గాని, పంజాబు ద్రాక్షపండులో మొదటినుండి చివరవరకును మాధుర్యమే కాని విసర్జింపవలసిన దేమియు నుండదు. అట్లే యీతని పద్యములును పరిపూర్ణభోగ్యములై యున్నవి. ఈతని పద్యములందలి అర్థసౌలభ్య ముదాహరించుట క్రిందిపద్యములు పొందుపరుచుచున్నాను:

నాకుఁగా నీతఁ డిట మరణంబు నొందె
నేని నా కెంతపాపమో, యిప్పు డితని
కోర్కి దీర్చితినేని నాకులములోన
నెంతహీనత వచ్చునో యేమిసేతు?

పొమ్మనంగఁజాలఁ, బోకని మాన్పంగఁ
జాల, నీకు నెట్లు పోలు నట్లు
చేయుమనిన, నతఁడు చిఱునవ్వునవ్వుచు
మాత యడుగులకు నమస్కరించి.

కులము వెలయింపఁబుట్టిన కొడుకు కొడుకు
గాక కులనాశనుఁడు కొడుకా తలంప
వసుధ నేకల్మషములేని వంశమునకుఁ
గల్మషముఁ బొందఁజేయ యుక్తంబె నాకు?

ఆడి తిరిగినఁ జండాలుఁ డంత్రుగాని
కులముచండాలుఁడైనను గొఱతలేగు;
బొంకకున్నఁ జండాలుఁడె పో ధరిత్రిఁ
బూజ్యుఁడనుమాట వినవయ్య, పులుల రాజ.
కన్నకడుపుగానఁ, గడుఁబిన్నగాన, నే
నతనిఁ బాసి దూర మరుగనట్టి
వేళగాన, వాని వీక్షించిరాకున్న
వగపుమాన దనిన వదలనైతి.

ఆంధ్రపద్యరచనయందున్న నియమములు మరియేయితరభాషలోని పద్యరచనయందును లేవు. గీతమునకు, సీసమునకు, ఆటవెలదికితప్ప తక్కినపద్యము లన్నింటికిని గణ యతి ప్రాసలను మూడునియమములను పాటింపవలసియున్నది. పద్యరచన సులభమైనయెడల భావప్రకటనమును సులభమగును. భావముల పద్యములందిముడ్చు కొనుటకు కవి విశేషశ్రమ పడనక్కరలేకయే పద్యములందవి సహజముగా నిమిడిపోయి చదువరులకు హృదయాహ్లాద మొనగూర్చును. షేక్స్పియర్ కవిరచనలలో నెక్కువ భాగము బ్లాంక్వర్సు (Blank verse) లో వ్రాయబడియున్నవి. ఈ బ్లాంకువర్సునకు గణ (Metre) నియమము తప్ప యితరనియమములు పాటింపవలసిన అవసరము లేదు. అట్లని తెలుగులో సులభముగా నల్లుటకు వీలిచ్చు గీతమునకాని, ద్విపదలోకాని కావ్యమంతయు రచించిన దంపుళ్లపాటవలె చదువుటకు విసుగుపుట్టించును. పై నుదాహరించిన మూడు నియమములను పాటించుచు, కావ్యరసమున కేమాత్రమును కొఱతరాకుండ ఆంధ్రమున పద్యరచనకు గడంగుట విశేష కష్టసాధ్యము. మహాకవిప్రతిభ యెట్టిదో కాని ఈతని పద్యములలోని యతిప్రాసలు తద్భావానువర్తినులై నేటిస్థానమునం దవి వచ్చి సర్దుకొనిన ట్లమరియుండును. ఈ పద్యములలో చక్కనిజిగి యున్నది. ఎచ్చటనోకాని నిరర్థక పదప్రయోగము లేదు. కవిచేతిలో చిన్న ఆటవెలదిమొదలు శార్దూలమత్తేభాదివృత్తములవఱకును అన్నియు ఒక్కటాకీని నడుచును. ఈతని కందపద్యములు చదివినప్పుడు తిక్కనసోమయాజికందముల నడక స్ఫురణకువచ్చును. ఈక్రిందిపద్యములందలి యతి ప్రాసల సహజగతి చూడుడు:

మమకారంబు నహంకా
రము సంసారానుబంధరజ్జువులని చి
త్తముల వివర్జింతురు సం
యము, లీవును నసుపుమా తదాచారంబున్.

ఎన్నఁడును రోగ మాతని
యెఱ్ఱురను లేదు, వానియొడ లొప్పుఁ బదా
ర్థప్నెపసిఁడిచందమ్మునఁ,
గన్నులు నెలిదమ్మివిరులగతిఁ జెలువొందున్.

ఇవ్విధమునఁ బలవింపఁగ
నవ్వాక నవ్వినటు లాననద్యుతులు గడున్
నివ్వటిల, రత్నమండనుఁ
డవ్వసుధాధిపునితోడ నలరుచుఁ బల్కెన్.

ఆపదలు గాఁపులుండవు,
చూపులకుఁ గులాద్రియట్లు చుట్టుకొనుఁ, గుడిన్
రూపేది విరిసిపోవు మ
హోపవనాహతపయోధరావలిభంగిన్.

కనకశలాకవోని తను
కాంతియుఁ, బున్నమచంద్రుఁబోలు నా

ననవిభవంబుఁ, బన్మముల
నవ్వు పరిస్ఫుటనేత్రరోచులున్,
దన కమరంగ, భావభవ
తంత్రములందుఁ బ్రవీణుఁడైన వాఁ
డనయము భర్తగావలయు
నం చొకభామిని కోరె వేడుకన్.

ఈ క్రిందిపద్యములలోని ధారాశుద్ధి చూడుడు :

వేలుపుటేటి ఫేనములు,
వెన్నుని పొక్కిటి తమ్మిరేకు, లా
శాలలనాదుహాల మృదు
సంవృత సంచలసంచయంబు, ది
క్పాలకబాలకేళి పరి
కల్పితశుభ్రమరుత్పతాకికా
జాలము నాఁగ నొప్పె విల
సద్ఘనశారద నీరదావలుల్.

కనుఁగొని యప్పుడా గృహిణి
కౌతుకమందుచు వచ్చి తద్ఘన
స్తనముల చాయఁ జేతి కల
శం బటు సాఁచిన దానినిండెఁ బొ
మ్మని కొనియాడె నర్ష్మమను
నట్లుగ నుబ్బును దాయిలేక స
య్యనఁ బితికెన్ సుధాసమ స
మంచితసార పయఃప్రపూరముల్.

ఈతని సమాసములు లలితపదములతో కూడియుండి నన్నయభట్టుసమాసమాధుర్యమును స్ఫురణకు తెచ్చును. మచ్చునకీక్రింది పద్యములలోని సమాసముల జూడుడు:

మానితభర్మనిర్మిత వి
మానముపై బహుమాన మొప్ప న
మ్మానివరేణ్యుఁ డుల్లసిత
మానవతీకర చామరోత్థమం
దానిలలీల మెచ్చుచు వి
యచ్చరు లచ్చరపిండుతోఁ బ్రస
న్నాననులై యెదుర్కొనఁగ
నబ్జభవాదులు సంస్తుతింపఁగన్.

విమలపయోనిధి వీచీ
సముదితయగు లక్ష్మిపోలె సౌందర్యాద్యు
త్తమలక్షణ లక్షితయై
కుమారి యుదయించె రాచకోమలి కెలమిన్.

రసపోషణకును శైలికిని అవినాభావసంబంధ మున్నది. సామాన్యుల జీవనములందుకూడ వివిధభావప్రదర్శనమున వాడుభాషయు, అందందు విరుపులును, భాషయొక్క గమనమును తత్తద్రసోచితమై మారుచుండును. ఆగ్రహమువచ్చినప్పుడును, అనుగ్రహము వచ్చినప్పుడును మనము వాడుభాషయం దెంత తారతమ్య మున్నదో ఊహింపుడు. మానవప్రకృతికి దర్పణములైన కావ్యములందు శైలి రసోచితముగ మార్పుచెందకుండిన కావ్యరసమునకు భంగము వాటిల్లును. అనంతామాత్యుని శైలి రసపోషణమున నెట్లు సమయోచితమై యొప్పారుచున్నదో ఈక్రింద నుదాహరించెదను :

మదనరేఖ చరిత్రయం దామెను గురుపుత్రుడు బలాత్కరింపరాగా ఆమె మొదట వానిని మంచిమాటలతో నివారింప యత్నించును. ఆత డామెగురువుగారి కుమారుడు; బ్రాహ్మణుడు. అదియునుగాక ఆమె మానవతి. ఎదిరియందు దోషలేశ మారసి వీథిపెట్టుస్వభావ మామెకు లేదు.

అందుచే నామె మెల్లగా, "నీ కిది తగునా, నీవు విప్రుడవు, సుగుణవంతుడవు కదా, మా తండ్రి వినిన ఏమనును? నాకన్యాత్వభంగము చేయుట నీకు పాడియా? కన్యాత్వముపోయిన వనిత ఆపై నెవ్వరి కక్కఱకువచ్చును?" అని బోధించి మాన్పజూచును:

ఇటు తగునయ్య, విప్రుఁడ, వ
హీనగుణాఢ్యుఁడ వీవు, నీకు నే
మిటి కిటువంటి దౌష్ట్యము, శ
మించునె మజ్జనకుండు విన్న, త
క్కటిజను లేమి యండ్రు, మది
కాంక్షయె గల్గిన నగ్నిసాక్షిగాఁ
జిటికెనబట్టికాక వృథ
సేయుట ధర్మమె కన్యకాత్వముఁ జ్.

పడఁతికి కన్యాధర్మం
బెడలిన కొఱయునునె వెండి యెవ్వరికైనన్,
గడిపోయిన పువ్వులు మరి
ముడుచునె రసికుఁడగువాఁ డమోఘవివేకా.

చంపకమాలలో ఎన్ని విరుపు లున్నవో చూడుడు. పద్యములు మందముగా, సావకాశముగా నడుచుచున్నవి. కఠినపదములు గాని, కఠినసమాసములుకాని వీనిలో కాన్పించవు. తండ్రి కుమారునకును, గురువు శిష్యునకును నీతిబోధచేయునప్పు డెట్లు మృదుభాషల ననునయించునో అట్లే ఈనారీరత్నము కూడ దౌష్ట్యమునకు బ్రాహ్మణయువకుని సన్మార్గమునకు మరల్పజూచును.

ఈపైసన్నివేశముతో షష్ఠాశ్వాసములోని వేరొకసన్నివేశము పోల్చిచూడుడు. తపోనియమశీలుడైన బ్రాహ్మణోత్తము డొకడు తన దుర్దినములమహిమచేకానోపు, జగదేకసుందరియనజాలు చెంచుకామినినొకతెను చూచి ఆమెను కదిసి పైబడజూచును. అప్పు డామె ఆగ్రహాపూరితయై మానభంగమున కోర్వక యిట్లు పల్కుచున్నది:

అమితక్రోధులు నాదుబంధుజను, లు
ద్యద్బాణ బాణాసనా
ది మహాస్త్రనిరూఢు, లూర్జితమదో
ద్రిక్తాంగు, లీకానన
ద్రుమవల్లీనిచయప్రదేశముల నెం
దుం దార యున్నారు, వి
ప్ర మది న్నీదగు నాగడం బెరిగినం
బ్రాణంబు పోఁజేయరే.

పైపద్యమునం దన్నియు గంభీరసమాసములే. లేడిపై ఉసిగొల్పిన భయంకరమగు వేటకుక్కవలె పద్య మతిత్వరితముగ పరుగెత్తుచున్నది. ఈపద్యము వినినంతనే బ్రాహ్మణుడు ప్రాణములునిల్చిన చాలురాయని పలాయనోన్ముఖుని జేయునట్లున్నది. అవ్వనితయుద్దేశముకూడ ఆబ్రాహ్మణుని హడలగొట్టి ఆత్మమానరక్షణము చేసికొనుటయే. అందుల కామె యెంతనిష్ఠురముగ, ఎంత భీతావహముగ మాట్లాడిన అంతమేలు. అందుచే నామె స్త్రీయైనను కవి ఆమెచే నిట్టికఠోరభాష లాడించినాడు.

మొదట గురుపుత్రుని మంచిమాటలతో మందలించిన మదనరేఖయే అతడామెను విడువక కొంగుపట్టుకొని లాగగా వానిని రోషభాషల దూలనాడును. "నీవు

మంచివాఁడవు, గురుకుమారుఁడ వని నెమ్మదిగా చెప్పగా నీపెంకెతనము హెచ్చుచున్నది. జాగ్రత్త. మావారలతో జెప్పి నిన్ను శిక్షింప జేసెదను. కొంగు విడచిపెట్టుము. ఇంటిలో నుండి నిన్ను గెంటివేయించెదను" అని చెప్పుచున్నది.

తలతల మంచివాఁడవుగ
దా గురుపుత్రుఁడ వంచు నిన్ను నో
బలుకకయున్న నీగతిని
పాడితొలంగెదు, చాలుచాలు మా
టలపని యేల వేఱప
డంబనిలే దబులుంప, యింటివా
రల కెఱిఁగించి నీచెనటి
రంతులు సర్వము చక్కజేసెదన్.

* * * *

కొంగేటికి విడువుము మను,
ముంగలి వెడలంగనడుతు ముగ్ధుఁడ, నీ కీ
పెంగలితన మెట్లొదవె, న
నంగవికృతిఁ జూప నర్హమా నాయెదురన్.

చంపకమాల 'తలతల' యని మొదలుపెట్టుటతోడనే ఆమెమనస్సు ఆగ్రహాపూరితమైనట్లు స్ఫురించును. 'పాడితొలంగెదు' అనుమాటవఱకును పద్యము విరుపులేక యేకధారగ నడచినది. పద్యమును వేగవంతమై యున్నది. 'ఇటు తగునయ్య' అను పద్యమును, 'తలతల' అనుపద్యమును రెండును చంపకమాలలే యైనను రెంటి నడకయందును విశేషతారతమ్య మున్నది. 'కొంగేటికి విడువుము' అనుపద్యమందలి ప్రాసరసపోషణకు విశేషసహాయకారియైయున్నది.

మొదటిపద్యముకంటె రెండవది తీవ్రముగ నున్నది. జ్వరతీవ్రతను Thermometerతో కొలుచునట్లు ఈపద్యముల నడకనుబట్టియే మనము మదనరేఖమనస్సునం దుప్పొంగు రోషావేశమును గ్రహింపవచ్చును.

పావకరోముఁడు దానవకాంతహృదయము నాటునట్లు బాణమువేసి, మఱియు నామెను పౌరుషపుమాటలాడి నొప్పింపఁగా ఆమె కసలి వానికి శాపమిచ్చును. ఈక్రింది పద్యము చూడుడు :

కర్ణరంధ్రముల నీకరణి నసహ్యవా
గింధనములు నింప నిపుడుఁ జేసి
యంతరంగంబున నంతటఁగలయఁ బ్ర
వృద్ధమై మీఁదికి వెడలునట్టి
కోపాగ్నిశిఖలు పెక్కువగాఁగఁ దీక్ష్ణంపుఁ
జూపులు నిగుడ, నసురవధూటి
విస్ఫులింగంబులవిధమునఁ జారచురఁ
దాకు బింకంపుటవల్పు లెసఁగ,
నోరి పాపాత్మ నన్ను నీవూర కిట్లు
పొరిగొనుటజేసి కరములుఁ జరణములును
నవికఁబడియుండు పొమ్ము, నీకఱకులెల్ల
జక్కనగు నంతఁ దానని శాపమిచ్చె.

పైపద్యమునందు రోషవశాత్మక యైన దానవకాంతహృదయము చక్కగా ప్రదర్శింపబడినది. స్త్రీయను మాటలేక తన్ను బాణముతో నొవ్వనేయుటయే కాక పావకరోము డామెను శూలములవంటి మాటలచే నొప్పించినాడు. పద్యమునందర్థము పాదముల మధ్యమధ్య నాగుచున్నది (Irregular breaks). మొదటిపాదమునం దాగ్రహకారణ

ము తెలుపబడినది. ఆ కారణము తిన్నగా ఆమె మనస్సునందు క్షణమాత్రములో నాటినది. మొదటిపాదము కొంచెము వేగముగ నడచుచున్నది. రెండుమూడు పాదములందు రోష వృద్ధి చూపబడినది. బాహ్యాలక్షణములు పేర్కొనబడినవి. ఆగ్రహము క్రమముగ వృద్ధినొందుటచే నీ పాదములు మొదటి దానికంటె కొంచెముమందముగా నడుచుచున్నవి. ఇందు విరుపులుకూడ కానవచ్చుచున్నవి. నాలుగవ పాదమునకు వచ్చుసరికి ఆగ్రహము హెచ్చుస్థాయికి వచ్చినది. ఆ కారణముచే నాపాదము విశేషతీవ్రతతోనడుచుచున్నది.

పావకరోము డామె కభివందనముచేసి ఆమె కోపోపశాంతి కావింపగా ఆమెకు స్త్రీ జనసహజమగు జాలి పుట్టినది. ఆతని పశ్చాత్తాపము చూచి ఆమెమనస్సు కరగినది. వెండియు ఆమెమరణమునకు పావకరోముడు నిమిత్తమాత్రుడనియు, తన భర్తకు మున్ను కలిగిన శాపమే కారణమనియు ఆమెస్ఫురణకు వచ్చినది. తా నెట్లును చావవలసియుండగా పావకరోముని కాళ్లు చేతులు నరుకబడియుండుమని శాపమిచ్చితినిగదా, వీ డెంతటిబాధల పడునో, వీనికి శాపనివృత్తి యగు నుపాయ మెఱిగింత మని యామెకు తోచినది. కారుణ్యరసోదయమున నామె ఆడు మాటల నవలోకింపుడు :

దనుజసతి యతని కిట్లను
బొనరంగ భువి సేసుదెంచి పుష్పాపచయం
బొనరించు గిరిజయడుగులు
నిను సోకిననాఁడు శాపనివృత్తి కలుగున్.

*    *    *    *

నీ వేమిసేయు, దిని
దేవాహితుఁడైన మత్పతికి వానరనా
రీవధపాపనిమిత్తం
బై వచ్చిన తీవ్రశాప, మది వృథయగునే.

ఈ రెండుకందపద్యములును పైసీసపద్యముతో పోల్చిచూచిన శైలిలో గలిగిన మార్పు స్పష్టముగా దెలియుచున్నది. దైత్యకాంతమనస్సు శాంతిపొందినప్పుడు సీసములుగాని, వృత్తములుగాని వాడక చిన్నకంద పద్యములలో నామెభావముల్ప్రకటించుట కవి కళాకౌశలమును చాటుచున్నది. ఈ కంద పద్యములలో రసప్రవాహమున కరికట్టుమాట లేమియు లేవు. ఒకేవ్యక్తి రెండుసందర్భములం దాడుమాటలలో తారతమ్యము జూపి కవి తనవైదగ్ధ్యమును జూపుచున్నాడు.

కరుణరసప్రకటన మితరరస ప్రకటనముకంటె కష్టసాధ్యము. ఈరసపోషణమున కవిచేతిలోని కలము మిక్కిలి నేర్పుతోను, నాజూకుదనముతోను పనిచేయవలసియున్నది. హెచ్చుస్థాయిని ఫిడేలువాద్యము చేయుట కందరును సమర్థులేకాని మంద్ర స్థాయిని (Lowest Pitch) వాద్యమొనర్చి వీనులకు విందొనగూర్చుకౌశలము ద్వారము వెంకటస్వామినాయడుగారి కొక్కరికే యున్నది. నాయడుగారి ఫిడేలువలె అనంతామాత్య కవి కరుణరసప్రకటనమునకు పూనినప్పు

డాతని శైలియు తదాజ్ఞాబద్ధమై నడుచుకొనును. ఈ ఘట్టములలోని పద్యములందు లేశమైనను కాఠిన్య ముండదు. వీనిని చదివినప్పుడు కర్కశ హృదయుల మనస్సు సైతము మెత్తబడితీరును. నాలుగైదునాళ్ల క్రితము కుమారుని కని, పులి తన్ను మ్రింగుటకు సిద్ధపడినప్పుడు గోవు పుత్రుని తలంచుకొని యెట్లు దుఃఖించు చున్నదో చూడుడు :

రేపు చనుఁగుడిపి వచ్చితి,
నేపున నందంద పరువులిడి యంతటిలో
నాఁపుడిసెఁడు తఱిగినఁ గొడు
కేపాటులఁ బడునొ, వాని కెయ్యది గతియో.

ఏ నట్టు నాఁకుచుండఁగఁ,
దా నను నంటఁగొని చెవులు దాలవయిచుచున్
మే నెఱుఁగక యుండెడు నా
సూనకు నెవ్వారు దిక్కొకో యిటమీఁదన్.

పులియనుమతిపైన కుమారునకు పాలిచ్చుటకు వచ్చి, తాను పులివాత బడుటకు తిరిగిపోవలయునని యెఱుంగక బాలక్రీడల మునిగియున్న కొడుకుం జూచి గో వీరీతిగా వగచుచున్నది :

* * * *

ఇట్లు శైశవక్రీడల నెసఁగుచున్న
కొడుకు దెసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ,
గటకటా యిట్టి నెత్తురుఁగందు నిచట
నైచిపోవంగవలసెనే నీచగతికి.

తల్లు లరుగు దేరఁ దనయీడు కోడెలు
సదమలానురక్తి నెదురు వాఱఁ
దాను గూడి పాఱె, తన మాతృహీనతఁ
దెలిసి బిడ్డఁ డంతఁ దలఁగకున్నె.

దూడ తల్లి ఆసన్నమరణవార్త విని ఇట్లు సంతాపించుచున్నది:

పిదుఁ గడచిన క్రియ, నీటిం
బొడిచినగతి గుండె పగిలి భూస్థలిమీఁదన్
బడి పొరలుఁ, దన్నుకొను, ను
గ్గడువుగఁ గన్నీరు నించు, గడగడ వడఁకున్.
చేయనుఁ, దల్లీ నీ వెట
పోయెద వను, నన్ను డించి పులివాతఁ బడన్
బోయెదవే యనుఁ, జెల్లం
బోయను, నింకేటి బ్రతుకుపో నాకు ననున్.

పుండరీకాధిపతికుమారుడైన రత్నమండనుడు బ్రహ్మరాక్షసునకు భక్షణముగా పోవుటకుముందు తండ్రి సెలవడుగుటకు రాగా ఆతడు పుత్రప్రేమమున ఇట్లు పలవించుచున్నాడు :

అని తనుఁ దాన దూఱుకొను,
నాత్మజుఁ గౌఁగిటఁ జేర్చు, బాష్పముల్
నినుచుఁ, దనూజ నీవయిన
నిద్దపుమేనికి నెట్టి పాట్లొకో
యనుఁ, దలయూఁచు, బాపు విధి
యీయను, నింతకుఁ దెచ్చితే యనున్,
వనరుహసంభవుండు మును
వ్రాసిన వ్రాఁతలు దప్పునే యనున్.

.......................

నిన్నుఁ బనుపఁజాల, నీవు నాయొద్దనె
యుండ వన్న యను, నితండు లేని
పిదప నాకు నేటిబ్రతుకనుఁ బుత్రశో
కంబ పొమ్మ మిగులఁ గడిఁదియనును.

పైపద్యములం దెన్ని విరుపు లున్నవో చూడుడు. ఆనృపాలుని సంతాపాతిశయము ప్రదర్శించుటకై కవి నూతని మనస్సులో




# పారిస్ ముత్యాల సరాలు

అసలు మంచి ముత్యాలలాగునె చాలాకాలం
చెడిపోకుండావుండేకే, ప్రకాశం, గట్టితనం
కలిగినవి నెం. 1, 2, 3 నెంబర్ల సైజులలో
నూలుతో అమర్చిన సరం 1-కి

**రూ. 1-0-0.**

వెండి తీగలలో అమర్చినది

**రూ. 2-8-0.**

ముత్యాలు చిన్నవి మొదలు పెద్దవి వరకు
కే సైజులో కావలిస్తే ఆ సైజులో
సప్లయి చేయబడును.

ప్యాకింగ్, తపాలుచార్జీలు ప్రత్యేకం.

## పి. గోపాలస్వామి నాయుడు అండు సన్సు.

కర్మాగారము:
పరంగిమలై పోస్టు,
మదరాసు.

బ్రాంచి ఆఫీసు:
234, గోవిందప్ప నాయకన్ వీధి,
మదరాసు.

గల్గిన వివిధభావములను, ఆతడు చేసిన వేరు వేరుపనులను మనకు చూపును. ఒకసారి ఏడ్చును. ఇంకొకసారి కుమారుని కౌగలించుకొనును. కొంచెమునే వుండి తలయూపును. లేకున్న బ్రహ్మను దూషించును. హా కుమారా, నీమనోహరమగు శరీరమున కెట్టిపాట్లు వచ్చెరాయని గోలపెట్టి యఱచును. మనస్సు సమాధానపఱచుకొనుటకు ప్రయత్నించును. ఏమిచేసినను అతనికి దుఃఖోపశమనము గలుగలేదు. ఏకపుత్రమరణసమయమున తండ్రిమనోభావములు ఫోటోతీసిన ట్లింతచక్కగా చూపబడినవి! శైలి ఎంత స్వాభావికమైయున్నది! విచారాయత్తమానసుని నోటినుండి అలంకారములతో కూడిన మాటలు రావు. కడుపులో మండుచున్న విషాదవహ్నియొక్క పొగలును, మంటలును పైకి కాన్పించుచునే యుండును. కడుపులో భావము లెట్లు పుట్టునో అట్లే అవి పైకి వెడలి వచ్చును. ఈకావ్యములో విషాదఘట్టములు చదువునప్పుడు చదువరుల మనస్సు దేవగాంధారీరాగములో 'క్షీర సాగరశయనా' యనుకృతి వినినవారి మనస్సువలె కరుణారస పూరిత మగును.

ఈ కావ్యమున గానమాధుర్యము (Poetic melody) వెల్లివెరిసియున్న దని మొదట వ్రాసియుంటిమి. రాగల యబద్ధము, గానికవిత్వములో గానమాధుర్య మేమని కొందర డుగవచ్చును. భావముల పొందికమైన గానిందు, శబ్దజాలముల పొందికమైన గానిందు, కావ్యములోని వ్యంగ్యచమత్కృతి (Suggestivity)మైన గానిందు, కవిత్వము నం దున్న మరి ఏ యితర ప్రాశస్త్యమైన గానిందు, ఈలక్షణము మహాకవుల రచనలం దెల్ల కాన్పించుచునే యున్నది. ఈ గాన మాధుర్యములేని కవిత్వము కవిత్వము గాదు. ఈమాధుర్య మిదమిత్థమని వ్రాక్రుచ్చుటకు వీలులేదు. జాతిరత్నముకాంతి యెట్టిదనికాని, గులాబిపుష్పవాసన యెట్టిదని కాని ఆయాలక్షణముల నెఱుగనివారు ప్రశ్నించినయెడల వర్ణనా మూలకముగ నాయాగుణముల నెట్లు తెలుపలేమో, అట్లే ఈగానమాధుర్యముస్వభావముగూడ అనిర్వాచ్యమైనది. ఘ్రాణేంద్రియ మున్న ప్రతివారును గులాబిపుష్పపరిమళము గ్రహించి యానందించునట్లు ఈ లక్షణము రసికజనానుభవైకగోచరమై యున్నది. ఈమాధుర్యముచే చదువరుల ముగ్ధులజేయుపద్యము లీకావ్యమున ననేకము లున్నవి. మచ్చునకు క్రిందిపద్యముల పొందుపఱచుచున్నాము:

బాలకి పాముమ్మ నావుడుఁ ద
　　పస్విపదాబ్జయుగంబుమీఁద నీ
లాలకజాలము న్నెరయ
　　నాయలికుంతల సాఁగిమ్రొక్కి, క్రొ
వ్వాలిన కన్నెఱుంగుల ని
　　వాళియొనర్చి రతీశమత్తవుం
డాలమునోజ బింకపు న
　　డల్ బెడఁగొందఁగ నేఁగి భక్తితోన్.

పొమ్మ నృపాలపుత్ర తల
పువ్వులు వాడకయుండ నెమ్మదిన్
రమ్మను పువ్వుగంధి వచ
నమ్ములకుం దరహాసభాసురా
స్య మ్ములరంగ నాతఁడు వె
సం జనుచుండఁగఁ, బౌరకాంత లో
యమ్మగొ చూచితే యతని
యాలికి నారయ నెట్టిసుందరో.

పొరిఁబొరి నీమహానదులఁ
బుట్టెడు బుద్బుదఫేనపుంజవి
స్ఫురితతరంగమాలికలు
చూడఁగఁ గన్నులపండువయ్యె, శ్రీ
ధరవిభవంబుచూడఁ బ్రమ
దంబున వచ్చిన యప్సరోంగనల్
కరకుశలత్వము ల్మెఱపఁ
గైకొని పెట్టిన ముగ్గులో యనన్.

అనిమిషకన్యయో, దితి సు
తాన్వయకన్యయొ, పీడుచూడవ
చ్చిన వనకన్యయో యనఁగఁ
జెన్నెసలారుచు నిండి సాంద్రమై
ఘనమగు చీఁకటిం గుసుమ
గంధినిజాభరణప్రభావలుల్
దన కటు త్రోవచూపఁగ ము
దంబున నొంటియె యేఁగుచుండఁగన్.

అంతఁ బురోహితానుమతి
నక్షతపాత్రలు సేరఁదేర న
క్కాంతయుఁ గాంతుఁడున్ ముఖ వి
కాసములొప్పఁగ దోయిలించి య
త్యంతపుఁబ్రీతి నొండొరుల
యాదలలం దలఁబ్రాలు వోసి, రం
తంతకు మేనులందు బుల
కాంకురజాలము లుల్లసిల్లఁగన్.

ఈకావ్యము కింబర్లేరత్నముల గనివంటిది. ఇందు తఱచినకొలఁదియు అనేకజాతి రత్నములు లభించుచునే యుండును. వీనిని గ్రహించి శిరోభూషణములుగ నలంకరించుకొని ఆంధ్రమహాజనులు తమ జాతిగౌరవమును ఇనుమడించుకొందురుగాక!

---

# కొందఱుకవులు : వారికాలము

నేలటూరి వెంకటరమణయ్య

౧. గణపనారాధ్యుఁడు :—ఈ కవి ఆంధ్రుల కపరిచితుఁడు. ఇతఁడు స్వరశాస్త్ర మను చిన్న ద్విపదకావ్యమును రచించెను.

ఇటీవల నేను హంపీయాత్రకుఁ బోయినపుడు, అచట ఆంధ్రగ్రంథము లేవేనియు దొరుకునా యని పలువురనడిగితిని. కాని యెచ్చటను లభింపవయ్యెను. అట్లే యానెగొందియందును విచారింపఁగా రెండుమూఁడు సంవత్సరములపూర్వము అచ్చట నున్న తాళపత్రగ్రంథముల నన్నిటెని తుంగభద్రలో వైచితిమని యచ్చటివారు చెప్పఁగా విని చింతించితిని. అయినను నాతోడ వచ్చిన మిత్రులు టి. వి. రంగాచార్యులుగారు నావలె హతాశులుగాక కంటికగపడినవారినందఱిని తాళపత్రగ్రంథము లేవేని తమకడఁ గలవాయని విచారించుచుండిరి. ఒకనాఁటి యుదయము మేము ఆనెగొందిలో నొకభాగమగు చింతామణి వీక్షింపం బోయినపుడు అచటనున్న యొక శైవమఠమును జొచ్చితిమి. ఆమఠాధిపతియగు శ్రీ సుందరానంద స్వాములవారు మా కామఠమును జూపునపుడు, మిత్రులు రంగాచార్యులు యథావిధి 'తమకడ తాళపత్రగ్రంథము లేవియేనియుఁ గలవా' యని యడిగిరి. వారు తమదగ్గర రెండుగ్రంథములు గలవని వానిని దెచ్చి మాముందు వైచిరి. అం దొకటి గ్రంథాక్షరముల భగవద్గీత. రెండవది స్వరశాస్త్రము. స్వరశాస్త్రము మిక్కిలి పురాతన గ్రంథమగుటచేతను, అపరిచిత మగుటచేతను దానిని మాకిండని స్వాములవారిని వేఁడితిమి. వారు వెంటనే మా కాగ్రంథము నొసఁగిరి. వారియెడ కృతజ్ఞుఁడను.

ఈగ్రంథకర్త కౌండిన్య గోత్రజుఁడు. ఇతని తండ్రి గణ్యయామాత్యుఁడు; తల్లి దేవమాంబ; అన్న రామరాజు; చెల్లెలు అన్నమాంబ; ఉనికిపట్టు ఓరుగల్లో, తత్ప్రాంతదేశమో. తన వంశాదికములను కవి యిట్లు వర్ణించుకొనియున్నాఁడు:

"ఆదిమబ్రహ్మకు నాత్మసంభవుఁడు
ఆతనికి గౌండిన్యుఁ డతని గోత్రమున
గంణ్యాయమాత్యుఁ డగణ్యవిక్రముఁడు
సత్యసదాచార సన్మార్గవర్తి
చంద్రశేఖరపాద సద్భక్తివరుఁడు
భూమండలమున జంబూద్వీపమందు
భారతవర్షమున భరతఖండమున
హిమసేతుపర్యంతమెల్లను వెలసె
ఆదేశములకెల్ల నధిపతియైన
వీరప్రతాపుఁడై వెలయు రుద్రుండు
ఆరుద్రభూపతి కాలయంబైన
*సాంపారు నర్థీశ్వర యోరుగంటి

* యతిభంగము.

మంత్రిశేఖరవృత్తి మహిమీద వెలసి
దేవమాంబికతోడ తెరగొప్ప గూడి
కులమందు చంద్రుల కొడుకుల గాంచి
కొడుకులలో పెద్ద గుణవంతుడైన
రామరాజన భూమిరమణితో వెలసి
రాజవిక్రమవృత్తి రాజపూజితుడు
పరసతిసోదరిభావంబు బిరుదు
బ్రహ్మణ్యపరమూర్తి పరమార్థవేది
ఆగమవేదసదాచారయుతుడు
బంధుచింతామణి పరవుపకారి (?)
సురరాజభోగభాసురరక్షకుండు
దానధర్మైకతాత్పర్యచిత్తుండు
మహానియ్యవృత్తిని మహిమీద నడిపి
ఏకపత్నీవ్రతం బింపార నడిపి
కొడుకుల గూతుల కొమరొప్ప గాంచి
సుఖలీల విభవంబు సొంపార నుండి
కాకతిరాజ్యంబు కడుచన్నమీద
నొగి సురత్రాణుని నుద్దండరాజ్య
మహిమతో జెన్నారు మన్ననమీద
నిజభుజవిక్రమనీతినిపుణుడు
శ్రీలొసగి పురాణశ్రీకాంతు డగుచు
అశ్వసామంతుల నాందోళములును
వీణాదివాద్యముల వేదఘోషముల
మంగళపాఠకమహితకీర్తనల
మండలేశ్వరులీల మాన్యగా నేలె

* * * *

మంత్రిశేఖరుడైన మంత్రికనజుండు
మానితగుణి యన్నమాంబ కగ్రజుడు
సంసారమధ్యస్థసాధకోత్తముడు
గణపనారాధ్యుండు కమనీయమూర్తి."

ఈగణపనారాధ్యుడు యోగశాస్త్ర వేత్త కావున యోగశాస్త్రముల నన్నిటిని బరిశోధించి యీ స్వరశాస్త్రమును విరచించెను.

"సంసారజితులకు సహజయోగమున
స్వరశాస్త్రయోగంబు సరిగాగ దలచి
హరిమతశాస్త్రంబు హరశాస్త్రమతము.
హఠయోగశాస్త్రంబు నధ్యాత్మ మతము
వాసిష్ఠమతమును వల్క్యయోగంబు
నానామతైకంబు నవనాథమతము
మహితమై యొప్పెడు మార్తాండమతము
కొమరొప్పు చున్నట్టి గోరక్షమతము
కడునొప్పుచున్నట్టి కామాక్షిమతము
మొదలుగా మహిమీద ముఖ్యమైయున్న
యోగశాస్త్రములెల్ల యోచించిచూచి
జీవహితంబుగా జీవుని బట్టి
తెరగొప్ప జనులెల్ల దెలియునట్లుగను
స్వరశాస్త్రమంజరి వర్ణింతు ప్రీతి."

కవికాలము:—గణపనారాధ్యుని కాలమును నిర్ణయించుట సులభము. ఏలన, అతని తండ్రి 'గంన్నాయమాత్యుడు' ఓరుగంటిప్రతాపరుద్రమహారాజునకు మంత్రి. అన్నయగు రామరాజు కాకతిరాజ్యము గతించినపిమ్మట సురత్రాణునిచే మన్ననలను బొంది మండలేశ్వరులీల మాన్యుడై యేలినవాడు. వీర ప్రతాపరుద్రనరపతి కాకతీయరాజులలో కడ

పటివాఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౨౯౬ మొదలు ౧౩౨౩ వఱకును రాజ్యపాలనము జేసెను. గణ్యాయమాత్యుఁడుగూడ అప్పటివాఁడే యగును. ఇఁక రామరాజును మన్నించిన సురత్రాణుఁడు ఢిల్లీప్రభువగు మహమ్మదు తుఘలాఖ్షా. ఇతఁడు క్రీ. శ. ౧౩౨౩ నం దోరుగంటిపై దండయాత్రజేసి, ప్రతాపరుద్రుని బందిని జేసి, కాకతిరాజ్యము ను విధ్వంస మొనర్చి, మహమ్మదీయసామ్రాజ్యము నాంధ్రదేశమునందు నెలకొల్పెను. ఈతని యధికార మాంధ్రదేశమున క్రీ. శ. ౧౩౪౫ వఱకు సాగెను. ఆసంవత్సరమున మఘునూరి కాపయనాయకుఁడు ఆంధ్రస్వాతంత్ర్యస్థాపనార్థము నడుముకట్టుకొని, యనేకాంధ్రనాయకులు సాయముచేత, మహమ్మదీయులను తెలింగాణమునుండి వెడలనడచెను. కావున సురత్రాణునిచే మన్ననవడసిన రామరాజు క్రీ.శ. ౧౩౨౩,౧౩౪౫ ల మధ్యకాలమున వెలసినాఁడనుట స్పష్టము. గణపనారాధ్యుఁడు తన గ్రంథమును అప్పుడే రచియించియుండవలయును.

---

# పోలి స్వర్గం

Attili Suryanarayana Murti.
అత్తిలి సూర్యనారాయణమూర్తి
[రవీంద్ర సారస్వతసమాజం]

(కార్తీక అమావాస్యకు, కుండలో దీపంపెట్టుకొనే చాకలిపోలి స్వర్గానికి వెళ్లిందని పూర్వ గాథ.)

బాపనోరంతాను
　　పళ్లట్టు కెడుతుంద్రు
చిమ్మచీకటిగుంది
చెయ్యట్టుకుంటాను
　　లెగవే పోలమ్మా
　　　　సొరగానికి
　　పదవే పోలమ్మా.

గజగజలాడించే
గాలిలో దీపాలు
వణుకుతు ముట్టిస్తూ
వందలున్నారాడ
　　నేయెళ్లనా? వస్తవా?
　　[illegible] యిక్కడే
　　జాగుసేస్తూవుంటవా ?

ఇదేంటె ఓలమ్మ
అందరు ములిగారు
పట్టుబట్టలుకట్టి
బార్లుతీర్చారేంటి?
　　ఆకాశ మంటిపోరా?
　　　　మడిలేక
　　నాకు సొరగము యివ్వరా?

పదుగుర్లోకీవచ్చి
పార్దించిపార్దించి
నీళ్లలో దీపాలు
యెల్లితే సొరగాలు
　　మన పోలి సొర్గమెల్లే
　　　　గొప్పోర్ల
　　మనసులో మెలుగునోలే.

---

# మేఘదూత-శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

తుమ్మల వేంకటరత్నం

మేఘదూత గీర్వాణభాషయందు కావ్యకళ లంకురించిన కాలముననె ఉద్భవించినది. ఉద్భవించినదాదిగ తద్వికాసము వాఙ్మయప్రపంచమున నెల్లయెడల వ్యాపించినది. నాటినుండి నేటివరకును దీనికి భావకావ్య పీఠమున నగ్రపూజలే జరుగుచున్నవి. హంససందేశాద్యనేకకావ్యముల కిది త్రోవజూపినది. కేవలము సంస్కృతవాఙ్మయముననెకాక తదితరవాఙ్మయములందును తత్ప్రతిబింబము లనేకము లేర్పడినవి, ఇంకను యేర్పడుచున్నవి. రసపిపాసుల కిందు తనివితీరకున్నది. అగాధములగు నందలి భావములు—భావముల లోగొన్న రసప్రవాహము రసికుల హృదయముల దేల్చుచున్నవి. కావ్యనాటకాద్యనేక గ్రంథనిర్మాణ కుశలుడగు కాళిదాసకవిచంద్రుని యశశ్చంద్రిక లింగు మూలమున భూతభవిష్యద్వర్తమానములందును నవనవోన్మేషముతో విలసిల్లుచున్నవి.

కాళిదాసు ప్రకృతితన్మయుడు. రసికుల హృదయములను చూఱగొనునట్లు కావ్యనిర్మాణమం దాతని కపారమైన ప్రతిభావిశేషము కలదు. మేఘదూతయం దితడు శృంగారమునకు హద్దిడినాడు. భావశిల్పముల కూర్పునం దితడు చేయితిరిగిన శిల్పి; వస్తునిర్మితిని విధాత. రామాయణమందు రాముడు జానకినిమిత్తము హనుమంతుని దూతగా బంపు వృత్తి మిక్కిలి హృదయమున నాటినది. తద్వృత్తిగా నొక నవ్యకావ్యనిర్మాణమున కుపక్రమించినాడు విప్రలంభశృంగారముతో; వర్షాగమాది సాధనసామగ్రిని కూర్చుకొన్నాడు. ఇతివృత్తము లేదు. చిత్రకూటమం దొకయక్షుడు,—అలకాపట్టణమందు యక్షకాంత, యక్షప్రణయసందేశహారి మేఘుడు పాత్రలుగా కాళిదాసు నూహాప్రపంచమున లభించినారు. వీరిలో యక్షుడు యక్షకాంత వియోగానలములో మ్రగ్గుచున్నారు. కారణము: ప్రభువైన కుబేరుడేదియో స్వల్పమైన దోషమును సైచలేక ఒకయేడాదిపాటు పరస్పరము వియోగము కలుగుగాకని శపించినాడట. పాపము! నిర్భరమైన ప్రణయరసానందమున నోలలాడు జక్కవకవకు ప్రళయాంధకారము దాపురించినది. అట్లాయక్షుడు రామగిర్యాశ్రమములలో క్షణ మొకయుగముగా గడుపుచున్నాడు. చూడుడు: పాషాణహృదయముల ద్రవింపజేయజాలు దీనాతిదీనత ననుభవించుచున్నాడు. విరహకార్శ్యముచేత "కనకవలయభ్రంశరిక్త ప్రకోష్ఠ" మైన దాతని కాంతాకంఠాశ్లేషప్రశస్తమైన హస్తము. ధాతురాగార్పితమైన ప్రణయినీచిత్రము జలజలరాలు వేడికన్నీటి దొంతరలచే చెఱిగిపోగా "క్రూరస్తస్మిన్నపి నసహతే సంగమం నౌ కృతాంతః" అనివగచివాడు. ఆతని స్థితి జూచి వనదేవతలుసైతము కన్నీరు గార్చుచున్నవి. ఇకనాతని సతినిగూర్చి వేరుగ చెప్ప నక్కరలేదు. పాపము! "యువతివిషయే సృష్టి రాద్యేవ ధాతుః" అన్నట్లున్న యబల "శిశిర మథితా పద్మినీ" వలెనున్నది. "ప్రబలరుదితోచ్ఛూన నేత్ర" యైనది. మేఘ మడ్డుపడిన చంద్రరేఖవలె ఖిన్నురాలైనది. ఇంతటి ఘోరవిపత్తు సంభవించినను ప్రాణముల బిగియబట్టి జీవించియేయున్నారు. "ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశః ......సద్యఃపాతి ప్రణయిహృదయం విప్రయోగే రుణద్ధి" అనునది సత్యమేకదా. ఇట్లున్న వీరికి వార్తావహుడుగా మేఘుడు లభించినాడు. వాడు "ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాత" మే కాని పటుకరణప్రాణి కాడు. అయినను "కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనాచేతనేషు" కాబట్టి ప్రకృతినంతటను గాఢాంధకారమయము గాడలచుచున్న యక్షుడు సందేశమిచ్చుట యుక్తముగానే యున్నది. పరికించుడు కాళిదాసు ప్రజ్ఞావిశేషము: ప్రకృతితత్త్వ రహస్య మెరిగినవాడు కనుకనే స్వయముగా అనుభవించినట్లు వర్ణించినాడు. మేఘునికి త్రోవజెప్పుచు ప్రకృతిరామణీయకము

మూర్తీభవించినట్లు నగ నగర నదీ నద వనాదులను కూర్చి నాడు. ఇందు ప్రకృతి కన్నులకు పాడకట్టుచున్నది. రసభావముల కనుకూలమగునట్లు మృదుమధుర పదరచన యీకవీంద్రునికి స్వభావసిద్ధమైనదే. లోకోత్తరములగు నీతని యలంకారములు కవితాసుందరికి పెట్టని సొమ్ములు.

ఇంతటి మహత్తరమైన ప్రతిభా భాసురమైనది కనుకనే మేఘదూత పలువురు ప్రాచ్యపాశ్చాత్య విద్వత్ప్రకాండులచే నిరంతరము వేనోళ్ల గీర్తింపబడుచున్నది. వివిధ ప్రాచ్యపాశ్చాత్య వాఙ్మయములందు ననువదింపబడినది. ఆంధ్రవాఙ్మయమునందును పలువురు కవివరేణ్యులచే ప్రతిబింబీకరింపబడినది. ఒకరికంటె నొకరిచే మించు తేటపరుపబడ్డది. ప్రస్తుతము శ్రీయుత దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి ఆంధ్రీకరణ మాంధ్రవాఙ్మయమున మిక్కిలి ప్రచారమున నున్నది.

అనువాదమునందు రెండుమార్గములు గలవు. మూలమందలి పదమునకు ప్రతిపదము నుడిగూర్చుట యొకటి. ఇందు కవియొక్క బుద్ధి స్వతంత్రముగ ప్రసరించుట కవకాశములేదు కావున సహృదయుల మెప్పించుట కడుంగడు దుస్సాధ్యము. రెండవది మూలమందలి పదములను, పాదములను విడనాడి రసభావములను మాత్రము పోనీయక యితివృత్తమును స్వతంత్రరచనలో నిముడ్చుట. తిక్కన శ్రీనాథాదులతెరు విదియే. మూలమునందలి యనౌచిత్యముల బాపుట కిందవకాశము కలదు. స్వాతంత్ర్యమునందు రచనానైపుణ్యముగల యెడల రసికుల రంజించుట సుకరము. శ్రీయుత దీపాల పిచ్చయ్యశాస్త్రిగా రీద్వితీయవిధానము ననుసరించి మేఘదూత నాంధ్రీకరించియున్నారు.

భావకావ్యములే ప్రధానములుగ నెంచబడు నీకాలమున శ్రీశాస్త్రిగారు మేఘదూతను స్వతంత్ర రచనాకౌశలముతో గూర్చి ఆంధ్రవాఙ్మయమునకు మిక్కిలి వన్నె దెచ్చిపెట్టిరి. ఏతత్కావ్యరచనమున శ్రీ శాస్త్రిగారి ప్రతిభావిశేషము చూపబడినది. వారు మూలమునకు భంగమురాకుండ భావములను విస్తరించినారు. కొన్నియెడల సొంతభావములు చేర్చబడినవి. సూక్ష్మభావముల నేకరించుటలోను, మూలభావముల విస్తరించుటలోను కాళిదాసున కున్న ఉపజ్ఞ కొంత వీరియెడ గాననగుచున్నది. ఇందు వీరి స్వాతంత్ర్యనైపుణ్యములు మిక్కిలి ప్రశంసనీయములు. మూలమునకు మక్కీరచనగా లేక కావ్యము స్వతంత్రగ్రంథమువలె రమ్యముగ నున్నది. భావముల విస్తరించుటచేత గ్రంథముకూడ పెద్దదైనది. మూలమునందలి ౧౨౧ శ్లోకములకు ౧౭౬ పద్యములైనవి. మూలమందలి ప్రారంభశ్లోకపు టుత్తరార్థముతో నీకావ్య మారంభింపబడ్డది. అటుపై కొంత స్వతంత్రరచన కూర్చబడినది. అందు విరహాతురుని ప్రకృతిని శ్రీ శాస్త్రిగారు కన్నులకు గట్టుచున్నట్లు చిత్రించినారు. ఒకచో నున్మత్తునివలెను, వేరొకచో ప్రకృతిసౌందర్యమును గ్రోలి తన్మయుడై విహరించు కవికుమారునివలెను పోల్చినారు. కాముకుని పూర్వానుభూత వస్తుస్మరణ పరవశతను కవికుమారునియొక్క పుష్పలతా తరంగాది ప్రకృతివస్తు సౌందర్యపరవశతను బోలె నిరూపించుచు మనోహరమైన వర్ణనను జేర్చి కావ్యమునకు నవ్యశోభ నాపాదించిరను టతిశయోక్తి కానేరదు.

"మేఘదర్శనము సంయోగులనే ఉద్దీపింప జేయుచుండ వియోగులగతి జెప్పనదేమి—కామార్తులు చేతనాచేతనముల గమనించజాలరు గనుక యక్షుడు జడమైన మేఘమును యాచించినాడు" అనెడి భావముల ననువాదకారులు గ్రంథాంతమునకు గొంపోవుటలోని యౌచిత్యము విచారణీయము.

"వీచీక్షోభ స్తనితవిహగ శ్రేణికాంచీగుణాయాః" అనుచో కాళిదాసు నిర్వింధ్యానదిని స్త్రీపరముగ వర్ణించుటలో నొక్క కాంచీగుణమునుమాత్రమె చూపినాడు. అనువాదకారులు కాంచీగుణమునకు తోడుగ చుక్కల చీర, కలపము, ముత్తెపుసరములను జేర్చి నిర్వింధ్యకు సమగ్రమైన స్త్రీత్వ మారోపించినారు. ఇందు స్త్రీ సాక్షాత్కరించినట్లున్నది.



ఐదవ ప్రాకారము-తిరువణ్ణామలై M. P. S.



అంతఃప్రాకారము-అరుణాచలేశ్వరాలయము, తిరువణ్ణామలై

కుడిప్రక్కపు వేయికాళ్ళమంటపము, ఎడమప్రక్కపు తిరుమంజన గోపురము M. P. S.



ముందువైపు-సుబ్రహ్మణ్యాలయము
(తిరుప్పరంకున్రం-మధుర జిల్లా.) S. S. S.



పాంబర్ జలపాతము S. S. S.

భ్రమరపాళీయుక్త పంకజనిచయంబుఁ
జుక్కలచీరగాఁ జక్కఁదాల్చి
అలలతాకున మ్రోయు నండజంబులచాలు
కమనీయమేఖలగా ధరించి
స్ఫటికాబ్జములనుండి చిటిలిన పుప్పొడిఁ
గమ్మని కలపంబుగా నలంది
లలితంబులగు మృణాలంబుల ముత్తెంపు
సరములు జోకగా సవదరించి
వచ్చు నిర్వింధ్య దర్శితావర్తనాభి
స్ఖలిత సుభగయు నగుచు మార్గమున, దాని
గలసి సరసత నెఱపు మింతులకుఁ బ్రియుల
పట్ల విభ్రమమే తొలి ప్రణయసూక్తి.

ఈదిగువపట్టు శ్రీశాస్త్రిగారి స్వతంత్రభావ కల్పనము—

ప్రీతిరణభూమి కసువు లర్పించినట్టి
భరతపుత్రుల రక్తప్రవాహతతులు
పాఱి పాయలుగట్టిన పట్టులచటఁ
గన్పడును నేటికిని మేను గగురుపొడువ.

వరుస నచ్చటఁ బొడకట్టు భారతీయ
కదన వీరకపాల కంకాళసమితిఁ
గన్నులారఁగ నొకపరి కన్నఁజాలుఁ
బందకైన మగంటిమి పరిఢవిల్లు.

ఇట కురుక్షేత్రనామస్మరణమాత్రమున భారతీయుల పూర్వప్రతిభావిశేషము, నూత్నములైన భావోద్రేకములును పొడసూపినవి. దుర్భరదాస్యమున మ్రగ్గుచున్న భారతీయుల వ్యర్థవీర్యమునకు నూత్నశక్తి నుద్దీపింపజేయుచున్నవి. ఇట పాఠకుని హృదయము ద్రిక్తమై భావపరంపరలకు లోనగుచున్నది. ఇందు గ్రంథకర్తృనుత్సాహ మభినందనీయము.

"కైలాసస్య త్రిదశవనితాదర్పణస్యాతిథిః స్యాః" అని కాళిదాసు మిక్కిలి సంకుచితముగ జూపిన భావము ఇందత్యంతవిస్తృతమై, మనోజ్ఞమైన భావాంతరమును బొంది యొప్పుచున్నది.

తన్నగంబను పెద్దయద్దంబునందుఁ
బ్రతిఫలించెడు నాత్మబింబములఁ గనుచు
దేవతాద్వంద్వములు సరిదిద్దికొంద్రు
చేరి తమతమభూషావిశేషములను.

రమ్యతరమైన యామురమ్మునందు
భావముప్పొంగ నీవు నీప్రణయినియును
చూచుకొనరయ్య, మీమేని సోయగములు
దొరకు నవకాశమును గడఁద్రోయఁజనదు.

మూలమున త్రిదశవనితలకుమాత్రము దర్పణక్రియ నాపాదించుటయే చూపబడినది. ఇందు శ్రీశాస్త్రిగారి యూహాపోహలు కొనలుసాగి దర్పణత్వమును సార్థకపరచినవి. దర్పణము కామినీకాముకులకు విలాససాధనము. ఇట మేఘవిద్యుత్తులు ప్రణయినీప్రణయులు. సాధనసాధకులుండగా సాధింపకుండుట నిరర్థకమని యెంచి మూలమును మించిన భావాంతరముతో "చూచుకొనరయ్య మీ మేనిసోయగములు" అని చెప్పించుటచే గ్రంథకర్తగారి ఔచిత్యపరిజ్ఞానము, సరళభావప్రకటనాపాండితియు ప్రస్ఫుటము లగుచున్నవి.

ఉత్తరమేఘమందలి,

"ఆనందోత్థం నయనసలిలం యత్ర నాన్యైర్నిమిత్తైః
నాన్యస్తాపః కుసుమశరజా దిష్టసంయోగసాధ్యాత్;
నాప్యన్యస్మాత్ప్రణయకలహాద్విప్రయోగోపపత్తిః
విత్తేశానాం నచఖలు వయో యౌవనాదన్యదస్తి."

"వామశ్చాస్యాః కరరుహపదైర్ముచ్యమానో మదీయైః
ముక్తాజాలం చిరపరిచితం త్యాజితో దైవగత్యా;
సంభోగాన్తే మమ సముచితో హస్తసంవాహనానాం
యాస్యత్యూరుః సరసకదళీస్తమ్భగౌరశ్చలత్వమ్."

అను నీరెండుశ్లోకములను మాత్రము శ్రీశాస్త్రిగారనువదింపక విడిచిరి. అందు వారియుద్దేశమేమో?

"అని పలుకుచునుండగ న,
ధ్వనదము వినువీథి కెగసె వాయువశమునఁ
మనమున నాతండయ్యెద
తనకొటికై తరలెనని ముదంబునఁ బొదలన్."

ఇట్లు మేఘ నిష్క్రమణమును వాచ్యముగ జూపుట యొక కల్పనము. అటుపై నొకచో శాపాంతమును జెప్పి కావ్యాంతము గావింపబడ్డది. ఇట్లు స్థాలీపులాకన్యాయముగ ననువాదమందలి కొన్ని విశేషములనుమాత్రము జూపినాడను. పరిశీలించినకొలది శ్రీశాస్త్రిగారి యనువాద విశేషములు మిక్కిలి కనవట్టగలవు. విస్తరభీతి నిటవివరింపబడ లేదు.

భావమునకు దగిన భాషాసారళ్య మీకావ్యము నాంధ్రవాఙ్మయమం దున్నతస్థాన మధిరోహింప జేయుచున్నది. తేటతెనుగుమాటల కూర్పు పండిత పామరుల హృదయంగమమై ఆకర్షణీయముగ నున్నది. అచ్చటచ్చట పొడగూపు నాతిదీర్ఘ సమాసములు రసానుగుణములై మనోజ్ఞత నాపాదించుచున్నవి. ఇట్లు సర్వగుణసమ్మేళనము నొందిన యీకావ్యము నవీనకావ్య ప్రపంచమున నగ్రగణ్యమై యున్నదను టతిశయము కాదు. ఇందుమూలముగ శ్రీశాస్త్రిగారు రసభావములను తేటతెనుగుమాటల పొందికతో సరళశైలిని గూర్చి నవీనాంధ్రవాఙ్మయమున కెంతయు దోహదము గావించినారని చెప్పకతప్పదు.

ఇట్టి యీయుత్తమకావ్యములకు కృతిపతులు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు. నాడు కాళిదాసగ్రథితమై విక్రమనరపాలచంద్రుని లాలన బడసిన మేఘదూత జగద్విఖ్యాతమైనట్లే, నేడిద్దాని పుత్రిక, ఆంధ్రమేఘదూత శ్రీదీపాలపిచ్చయ్యశాస్త్రిగారి కృతియై యీవిక్రమనరపాలచంద్రుని కేల్పట్టి ఆంధ్రవాఙ్మయమున కంతటికి వన్నెచిన్నెలు గావించుచున్నది. ఇట్టి యీకావ్యకర్త లాంధ్రులకృతజ్ఞత కెంతయు బాత్రులైయున్నారు. ఈకావ్యమును మదరాసు విశ్వవిద్యాలయమువారు విద్వాన్ (బి) ప్రిలిమినరీకక్ష్యకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట విద్యార్థుల అదృష్టము. శ్రీశాస్త్రులవారి కృషి యింకను ఆంధ్రభాషాసేవారూపముగ బరిణమించుటకును, శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజుల బోలు విద్వత్ప్రభువుల సన్మానము నాంధ్రవాణి పొందుటకును పరమేశ్వరు డనుగ్రహించుగాక !

---

# ఆంధ్రవాఙ్మయసూచిక

## (ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలు)

ఈపుస్తకమున ౧౯౨౮-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకములపట్టిక ఒకటి, ఆపుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆయా విభాగములక్రింద వచ్చిన పుస్తకముల పట్టికలు, ఇంకా కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురమున ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగు పుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమయిన ప్రకాశకుల పీఠిక ౧౧౮ పుటల పరిమితిగలది యీ పుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలో పుట్టిన పుస్తకములను, వానిలో, ఈపుస్తకము ముగియునప్పటికి అచ్చయినవానినీ, కానివానినీ తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజు పుస్తకము, పుటలు ౬౨౦, మంచికాగితములు వెల రు. ౧-౪-౦ మాత్రమే.

తపాలా ఖర్చు ప్రత్యేకము.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టి వీధి, మద్రాసు.

# స్వర్గమా, నరకమా?

కొల్లూరు ధర్మారావు

చిన్నప్పుడు మా అమ్మ పురాణంచదివి అర్థం చెపుతూండేది దగ్గరవున్న అమ్మలక్కలకు. పుణ్యం చేసుకున్న వాళ్లకి ఉత్తర జన్మలేకుండా స్వర్గం వొస్తుందనీ, పాపకర్మ ఆచరించినవాళ్లు నరకంలో ప్రవాసం అనుభవిస్తారనీ, వ్యాఖ్యానాలు చేసేది. కొంత కాలం దాకా నాకూ స్వర్గమంటే ఆశా, నరకమంటే భయమూ వుండేవి. అయితే నా ప్రస్తుతపరిస్థితులలో, ఆ రెండూ కలగలుపై ఇక్కడే అనుభవమౌతాయనీ, సంఘం యొక్క ఆగ్రహానుగ్రహాలకే శాస్త్రాల్లో ఆ పేర్లు పెట్టేరనీ యిప్పుడు తోస్తూంది. నేను పూర్తిగా పాపమని నమ్మిన కృత్యాన్ని లోకమంతా హర్షించి, దానిమీద పుణ్యమని చెలామణీముద్ర వేసింది. నేను కాశీవెళ్లినంత పుణ్యమని తలపెట్టిన కార్యం సంఘమునకు రాక్షసంగా తోచి యిప్పుడు నే నున్న స్థితికి నన్ను తెచ్చింది.

* * * *

మా తల్లిదండ్రులకు నే నొక్కర్తెనే కూతుర్ని ; మాఅన్నయ్య ఒక్కడే కొడుకు. మాయిద్దరికి మూడేళ్లు వయస్సులో వ్యత్యాసం వున్నా, నేను చిన్నప్పటినుంచీ కొంచెం ఒత్తరిమనిషిని కావడాన్ని, కొత్తగా చూచిన వాళ్లు మమ్మల్ని కవలనుకునేవారు. కొంచెం ఉపాధిగల బ్రాహ్మణ కుటుంబాల రీతిగానే, మాయింట్లోకూడా మాఅమ్మమ్మ ముచ్చట తీరడానికని మాఅన్నయ్య ఉపనయనంతోటే నాకు పెళ్లికూడా కోలాహలంగా చేసేరు. అప్పటికి నాకు ఆరోయేడు. నాకు జ్ఞప్తివున్న విషయమల్లా, మా అన్నయ్యకి జడ కందేటంత జుట్టు తీసేసి సిరామరకల్లాగ పంచసిగలుంచడం, అది చూసి అందరితోపాటు నేనూ నవ్వడం. తెల్లారుజామున — ఇంకా మూడోగంట అయిందో లేదో — మా అమ్మ నన్ను లేపేసింది. నేను బద్ధకిస్తూ లేచేను కాని, మంగళస్నానానికి అనేసరికి నాకు చికాకేసింది ఆ అర్ధరాత్రప్పుడు. "బానతో నువ్వూ పోసుకోవా" లని మా అమ్మ తొందరపెట్టింది ... ... ...... కాని అప్పట్లో మా పార్వతీశంబావ మా యింటికేనా వచ్చినట్టు నాకు జ్ఞాపకం లేదు. ఎందుకొస్తాడూ ? మాయిద్దరిమధ్యనీ యిలాంటి విషాదజ్వాల పుట్టించి సంఘం గంతులెయ్యగలుగునా అప్పుడు వాడొస్తే? * * * ఏమయితేనేం ? అప్పుడు నాకేం తెలీలేదు. అది మాఅన్నయ్యవడుగనేకాని నాపెళ్లి అన్న విషయమే నా కర్థంకాలేదు. నాకేమిటి, మా నాన్నకే తెలీదూ; అంతా అప్పటికప్పుడు కుదిర్చేరుట, మా అమ్మమ్మతొందర చేత.

* * * ఏణ్ణాళ్లకి వెళ్లేముటగాని, నా కది యేమీ జ్ఞప్తిలేదు.

ఆసంవత్సరం శ్రావణంలో నోముకోసం నన్ను తీసుకెళ్లాలని పిలుపునిమిత్తం మాఅమ్మ ఎదురుచూసింది. అయితే విధివశంకొద్దీ, మా కామేశ్వరత్తకి చాలాజబ్బుగావుందని శెలి గ్రాం రాగానే, మాఅమ్మమ్మని యింట్లోపెట్టి మేమందరం నౌపడా వెళిపోయేం. మాఅత్తకి పార్వతీశం ఒక్కడే కొడుకు. మరి పిల్లలు లేరు. ఆవిడపెనిమిటికి ఉప్పుగల్లీలమీద ఉద్యోగం. రెండుచేతులా ఆర్జించే డబ్బంతా చిల్లిగవ్వలా ఖర్చుపెట్టే మనిషి. అతని కిరు వంకలా మేముతప్ప, నాఅనేవా రెవరూ లేరు. అతనికీ మాఅత్తకీకూడా నేను పుట్టినప్పట్నించీ నన్ను పార్వతీశానికి చేసుకుందామని వుం డేది. అయితేనేం? మాలో మేనరికా లప్పటి కెవరూ చెయ్యలేదుట; అంచేత "యెలా యిన్వనూ?" అంది మాఅమ్మమ్మ. మా అమ్మమ్మ అంటే కేవలం మాటనేర్చిన శాస్త్ర స్వరూపం, నడకయెరిగిన వృద్ధాచారం. ఆవిడ చెప్పే వావులూ వరసలూ, వాట్లో నిషిద్ధాలూ ద్వితీయపక్షాలూ సంఘానికి వేద వాక్కులు. నాపాలిట దాపరించిన సజీవనిర్ణయసింధువు ఆమె. * * * మేం వెళ్లేసరికి మాఅత్తస్థితి బాగులేదు. జ్వరతీవ్రంలో చెరుపూ మరుపూగా ఉంది. "కామేశ్వరీ, చూడూ, మీఅన్నయ్యా పిల్లలూ వొచ్చేరు పలకరించు" అని మామయ్యా అనేసరికి మాఅత్త అరమూసిన కళ్లు విప్పి యెట్ట యెదట నన్నుచూసి "కూచోవే కోడలా" అంది. మా అమ్మని పలకరించలేదు. మా నాన్నవంక చూడలేదు. నా కష్టం దర్థమైంది నా పెళ్లికి మా అత్తావాళ్లు యెందుకు రాలేదో. మాబావ రాకుండా నాకొక్కర్తెకే పెళ్లి చేసేసేరు మావాళ్లు! తప్పుకాదూ?

* * *

నా జీవితంలో సుఖదుఃఖాలు క్షీర నీరంగా కలిసి నాకు తలకుతగని అనుభవాలు సంభవించడం నా యేడవయేట ఆరంభం. మాపార్వతీశంబావ మాయింట్లోనే మాతో బుట్టులాగున్నా డప్పట్నించీ. మాఅన్నయ్యా వాడూ అన్నందగ్గిర కూర్చున్నప్పుడు వాళ్లిద్దరిమధ్యా నాకంచం ఉండాలని దెబ్బలాడే దాన్ని. మాబావకి పెందరాళే ఆకలేస్తే నేనుకూడా ఆకలి లేకపోయినా వాడితో పంక్తికి సిద్ధపడేదాన్ని. మాఅమ్మమ్మ నన్ను చూసి "ఒసే, అమ్మో, ఆడపిల్లవి, ఇంత దండుతన మేమిటే?" అని కోపగించేది. * *

మాఅత్త ఆకాశమంటిన ఆరునెల్లకే నామీద — నామీదయేమిటి? నాకు చీమ కుట్టినట్టైనా లేదూ; మావాళ్లమీద — ఉఱుమని పిడుగు పడ్డాది. కలరా వచ్చి ఆయన..."ఆయన" అనాలని లోకం మప్పిన మాట కాని, నాతో నాలుగుపూటలు హోమ ధూమంలో కళ్లుమండిపోతూ పీటలమీద కూర్చోపెట్టిన కుర్రాణ్ణి, అదివరకు కాని, ఆపిమ్మటకాని నే నెన్నడూ చూడని అబ్బాయిని, నేను 'ఆయన' అనడానికే నాకు

సిగ్గేస్తూంది. మాయింకాకుండా ఉంటే, ఆ అబ్బాయిని నేను మర్యాదగా చూడడం నేర్చుకొనేసరికి యెన్నిసంవత్సరాలు పట్టేదో? ... టెలిగ్రాం చూసి మానాన్న బిక్కచచ్చి పోయేసరికి, మా అమ్మమ్మ శకునపక్షిలాగ యెట్లాపోల్చేసిందో "నాయనా, అమ్మికొంప మునిగిందా ?" అని భోరున నామీద విరిగి పడ్డాది. మా అమ్మకూడా నన్ను పట్టుకుని యేడు పారంభించింది. నాకేమో కారణం తెలియలేదు. మాపొరుగింటి రంగనాయకమ్మ గారిపిల్లతో వంతులాటకని సమస్తం సన్నద్ధం చేసి, నావంతు అటుకులూ బెల్లం అడగటానికని నే నింట్లోకి వచ్చేసరికి, మా వాళ్లు చేసినగాభరాతో నాకుమతిపోయింది. నే నంతవరకు చూసినది మాఅత్తమృత్యువొక్కటే; కాని నా మట్టుకునేను బ్రతికి వున్నట్టు ధైర్యముందికదా, వీళ్లంతా నా మీదపడి యేడవడ మేమిటి?... ... వారం పదిరోజులు దాటగానే బోధపడ్డాది మాఅమ్మ నన్ను ఆడుకుండకి పొద్దుకే విడిచేది కాదు. నాకు జడవేస్తూ కళ్లొత్తుకోడం; బావతో పాటు నాకు అన్నం పెట్టకపోవడం; ఎక్కడికీ కూడా నన్ను పేరంటానికి పంపకపోవడం; మాఅమ్మమ్మదగ్గర పడుకోమనడం —ఈ చర్యలన్నీ కొత్తగా అర్థంలేని విషయాల్లాగ కనిపించి, చివరకు నాతో యేవ్యక్తీ మొగం యెదుట చెప్పకుండానే, నే నొక దౌర్భాగ్య వితంతువు నని లోకమంతా నన్ను ఒప్పించేరు.

నాపదోయేట, విశాఖపట్నంలో ముట్ట మొదట మాయింటిమీద వాలింది ప్లేగు వ్యాధి. రాయి విసరేసరికి పిట్టవెనకనే పిట్ట తుర్రుమని పారిపోయినట్టు మా తల్లిదండ్రులు గతించేరు, వారం రోజుల్లో. మా అమ్మమ్మ నన్నూ, మాఅన్నయ్యనీ,మాబావనీ తోడ్చుకుని రైలుస్టేషను కొచ్చింది, వాళ్ల చెల్లెలు గారి గ్రామం తీసుకుపోదామని. కాని, మాకు టిక్కట్టు యివ్వనికారణంచేత మళ్లీ యింటికే చేరేం. రెండునెలలపాటు జైల్లో వున్నట్టు కాలక్షేపం చేసేం. మా యింటికి యెవరూ రాలేదు, మేం యెక్కడికీ వెళ్లలేదు. ఆ తర్వాత మా మామయ్య తన కొడుక్కి వుత్తరం రాసేడు వెంటనే రమ్మని. అతడు చేసుకున్న రెండో భార్య యెదిగి వచ్చాక, యీకొడు కెందుకో తనకి? అయితే మానాన్నపోవడాన్ని రాసివుంటాడు. పార్వతీశంబావ అప్పట్లో నన్ను విడిచి వెళ్లిపోతే నాబ్రతు కెట్లా వుండేదో? నేను చెప్పకుండానే మాఅన్నయ్య జబాబుగా ఓకార్డురాసి పడేసేడు, బావ తనతో చదూకుంటున్నాడనీ, పరీక్షలైనాక వొస్తాడనీ. అప్పుడువాళ్లు చదూతూన్నది నాలుగోఫారం. మళ్లీ ఇంటరు క్లాసులో చదూతూన్నదాకా, మా బావ యేడాదకొక్కమాటే వెళ్లి వాళ్ల నాన్నవద్ద పదిరోజు లుండి తిరిగి వచ్చేసేవాడు. * * *

మాఅన్నయ్య ఓనాడు గదిలో పుస్తకాలు సర్దుతున్నాడు. బావని తోటికుర్రా

డింటికి సైకిలుమీద పంపించే జేవోనోట్సు తెమ్మని. నేను మాఅమ్మతాలూకు వచన భారతం చదూతూ, దానిలో యేదోగళ్ల కాగితం వుంటే తెచ్చి మాఅన్నయ్య కిచ్చేను. అది పరికించిచూచి "చెల్లీ, నీజాతకం యిది" అన్నాడు. అంటూ యేదోమహాపచారం చేసినట్టు తొందరగా ఆకాగితం చింపేసి, "వెళ్లిచదూకో"అన్నాడు. నా కిప్పుడది తల్చుకుంటే అర్థమౌతూంది; అందులో నాభావిజీవితచర్య వ్రాసివుందికాబోలు! లోకమంతా వితంతువుముద్రవేసిన నాజాతకంలో ఆరోజునే మాఅన్నయ్యకంట పడ్డాదేమో, యీనజీవపరిణామం!... ... ...

ఆనాడు నామీదపడి యింటిల్లిపాదీ యేడ్చినంతయేడ్పు, మళ్లీ నాపన్నెండోయేట మాఅమ్మమ్మ వక్కర్తే ఒకనాడేడ్చింది— నేను స్త్రీజన్మ దాల్చే నప్పుడు! నాశరీరమందు నాకే ఒకవిధమగు వ్యామోహం, ఉత్తేజం జన్మించేయి. వుయ్యాల ఊగేటప్పుడు బారుగా మీదికి గాలిలో తేలిపోయి తిరిగీ క్రిందకు వస్తూన్నప్పుడు వుయ్యాల నంటీఅంటనట్లుండి, శరీరము పుష్పంలాగు జల్లున వికసిస్తుండే, ఆలాగు నా కాపాదమస్తకం ఆవయస్సులో తోచింది. సృష్టిఅంతటా ఒక అవ్యాజమైన ఉత్సాహం కనిపించింది. పంచభూతాలూ నాఆనందంకోసమే వున్నట్టు అర్థమైంది. నాకీస్వర్గసందేశంలో అడుగడుగునా మా అమ్మమ్మరోదనధ్వని భయంకరంగా వినిపించేది. పండువెన్నెట్లో విహరించే పైరుగాలి మన్య గుడ్లగూబయొక్క వికృతస్వర మది!

* * *

ఒకనాడు మాఅన్నయ్యగదిలో యెవళ్లూ లేనిసమయంలో నిలువుటద్దంవద్ద చేరి క్రాపింగ్లుపన్నెత్తో జుట్టుసరిజేసుకుంటూ నిల్చున్నాను. మాఅమ్మమ్మ పెరట్లో యేదో మడిపని చేసుకుంటూంది. ఆమె నాచేతిలో అద్దం లాక్కుని ముక్కలుచేసి మూడేళ్లయింది. ఆనాడు నాజీవితచ్ఛాయ వెయ్యితునకలై మంటిలో కలిసింది. నాకు నేనే దూరమైపోయేను. నూతిమీద వంగినా మా అమ్మమ్మ చూస్తే వొప్పేదికాదు; నూతిలో పడిపోతానేమో అని భయంట. ఆమె చేజేతులా నన్ను ముంచిన నదీసముద్రంకన్న యీనూతులు లోతా? నా కపకారంచిక్కినప్పుడల్లా నా ఒంటరితనం మాన్పుకుందికి నిలువుటద్దమే శరణం. ఈపాడులోకంలో నన్నాదరించి తల్లిలాగు కడుపులో పెట్టుకున్నదది ఒక్కటే. ఎన్నిసార్లు అద్దంలో చూచుకున్నా నాలోనా కేదోకొరత కనిపిస్తూవుండేది. అది ఊహించలేక తంటాలుపడేదాన్ని. నాకనురెప్ప లిలాగ అరవాల్చినా, తేరిపారి చూచినా, నాఛాయలో ఒక శిలావిగ్రహపు నిశ్చైతన్యం ద్యోతక మయ్యేది. *** ఎదురుగా గూటిలోవున్న సీసా తీసి అగరుచుక్క పెట్టుకున్నా; ఏనాడో మాసిపోయిన కళంకం తెచ్చిపెట్టుకున్నా; ఏనాడో మాసిపోయిన కళంకం తెచ్చిపెట్టుకున్నా! ఓరవేసిన గది

తలుపు కిర్రు మని చప్పుడైంది! అమ్మోయ్, మాఅమ్మమ్మ కౌజోలు. అరచేత్తో నుదురు తుడిచేసుకుని చూతునూ, మా పార్వతీశం బావ!

"అదేమిటి పూర్ణా, నుదురేమిా ?"

అద్దంవైపు తిరిగిచూసేసరికి నుదుట గాయంపడ్డట్టు ఎర్రగా తోకచుక్కలాంటి తుడుపుంది. అరిచెయ్యి కత్తికోతపడ్డట్టు రక్త వర్ణిత మైంది. నే నేదోహత్య చేసినట్టు ఆపాదమస్తకం కంపించేను!

"ఏం పూర్ణా, మొందుకంత కంగారు?" అని మా బావ నాబుజంమిాద చెయ్యివేసేడు. నాపాలిటి ఇంద్రజాలికు డతడు; సూర్యరశ్మి మెరగని మొరడు చిగిర్చింది ఒక్కసారిగా! పువ్వుత్రుంచినప్పటి తుల్లెపొదలాగు నాశరీర మంతా జల్లుమంది! కినుకొలుకులలోంచి నిలువుటద్దంవైపు చూసేసరికి, అదివరకు యేదో అనుకున్న కొరత మాయమైంది. మాబావవక్షముపై ఓరజేసిన నాశిరస్సునకు తల్లియొడిజేరిన శిశువులాటి శాంతి, ఆనందం లభించేయి. ఆనిలువుటద్దంలో ఒకదానిమిాద ఒకటి హత్తుకొనిపోయిన మాప్రతిబింబాల మిాద ఆనాడు దివిజసంఘములో వున్న మా అత్త ఆశిషాక్షతలు జల్లింది. కరకులోకమంతా మాత్రం కళ్లుకుట్టుకుని, ఆనిమిషమందు మా అమ్మమ్మగొంతులో ప్రవేశించి, కంచుగీసిన గాత్రంతో "అమ్మో"అని ఒక కేకవేసింది!

* * *

నేనుచేసిన దౌర్జన్యమేమో, సంఘం నన్నింతపైరీలా గుంచి కోటికళ్లతో కనిపెట్ట డానికి? పెనిమిటికావాలని నే నడగందే, వేడుకతీర్చుకుందికి, జరిపిన వివాహానికి దైవ ఘటనచేత విచ్ఛేదంవస్తే, ఆవైధవ్యం నా దెలాగవుతుంది? కావలిస్తే మా అమ్మమ్మని పాలించమనండి; ఆవైధవ్యం దానిదే! పొత్తిళ్లలోనే మాఅత్త నియోజించిన మాబావని, నైసర్గికంగా నీరు సముద్రానికి పోర్లినట్టు నాహృదయం చిన్ననాటినుంచీ స్రవించి చేరుకున్న మాబావని, కాదనిచెప్పి యేదోవ్యక్తికతో గట్టుకట్టడానికి ఛాందసలోకం ప్రయత్నించినప్పుడు, ఆగట్టు తెగిపోతే నాదా నష్టం?.......... అయితేనేం? లోకం తన నెత్తిమిాద నాపూచీఅంతా అవ్యాజంగా పెట్టుకుని నన్నుద్ధరించడానికి కంకణంకట్టుకుంది! ఆవలిస్తే పేగులులెక్కించే మా అమ్మమ్మపిలుపుతో రెక్కలుకట్టు కామె యెదుట యెలారాలనూ? ఈనుదురూ నేనూను?—గబగబ సబ్బుతో తోమేసుకుని మాబావ చేరుమాలుతో తుడిచేసుకు బయట పడ్డాను. మాఅమ్మమ్మ వరండామిాద యెదురై "జెట్టా, యిప్పు డాపాడుమొహం సింగారించుకోకపోతే, యెండలో పిడక లెత్తిపెట్టరాదూ ఓమాటు"అని ఒకఉరుమురిమి అట కెక్కిపోయింది. ఆచలిపిడుగుతాకున నిశ్చేష్టనై నిలబడిపోయేను!

* * *

జీవితం దుర్భరమైపోతూంది. భరింపరాని దుఃఖమూ, అంతకన్న సహింపజాలని స్వర్గ సౌఖ్యమూ కలిసి నాప్రతినిమిషములోనూ పడుగుపేకగా అల్లుకున్నాయి. చేతి కందు బాటులో వున్న మధుకలశం త్రాచుపాముల ఉట్టిలో వుంది! ఇరుగుపొరుగుఅమ్మలక్కలు ఒకొక్క కావ్యం సృష్టించి గాలిలో ప్రచు రిస్తున్నారు నాగురించి. గుసగుసలూ, చీర చాటు యిగిలింతలూ లావయేయి. మహా రాజునుచూసి సామాన్యమానవు డెవ ఓర్వ గలడూ? లోకమంతా సృజించిన దేవుడు, న న్నొకర్తెనీ అందులో యెంపుడుచేసి కంటక పర్చడమే కార్యంగా పెట్టుగున్నాడా? లేదు. దేవుడికి నామీద దయే, నేనేం నేరంచెయ్య లేదుగనక. అందుచేత మాయిద్దరిహృదయా లకీ సమావేశపర్చి, మూఢలోకాన్ని దేవుడే తిరస్కరించాడు.

* * *

ఎన్ని ముల్లు ఆవరించివున్నా గులాబీ పుష్పించడం దైవఘటన. తాను చచ్చి పోయినా అరటిచెట్టు గెలవిడవడం నైసర్గిక పరిణామం. నాలో నా కొక నూతన జీవకళ గోచరించడంమాత్రం విధికృత్యం కాదూ? నాకళ్లు, నీటిలో చంద్రబింబంలాంటి లేత నీలిమ దాల్చి, నల్లని గోటిగీటులాగ చుట్టూ పరివేషం కట్టేయి. చెక్కిళ్లలో అలసట చూపించే అందమైన వాడుదనంవచ్చింది.... నిశీథగర్భంలో, తారకకన్నైనా సోకని అజ్ఞాతప్రదేశంలో, ఎన్ని జీవరాసులు పున ర్జన్మ కళ్లారా చూచుకోలేదూ? దిశలు మారుమ్రోగించే కెరటాల కల్లోలందాటి ప్రశాంతమైన నడిసముద్రం ప్రవేశించినట్టు, స్త్రీత్వం దాటి మాతృత్వం స్వీకరిస్తూన్న నన్ను గురించి ఊరివా రెందుకో కళ్లల్లో నిప్పులోసుగోడం?

* * *

ఆవేళరాత్రితో మాబావరుణం నాకు చెల్లిపోయింది. సర్వసాక్షియైన భగవంతుడు మాకోసమై ముత్యాలగొడుగు పట్టి, నట్ట నడుమ జాబిలిమీద మబ్బుపూత వేసిఉండగా లోకానికి కాపలాకాస్తూన్న వృద్ధాచారం మా అమ్మమ్మకళ్లలోంచి మమ్మల్ని చూసింది......

నేటికి యేడాదైంది మాఅన్నయ్యని చూసి. మాఅమ్మమ్మ ఉందో చచ్చిపోయిం దోకూడా నే నెరగను. నిరుడీరోజుల్లో నా కేమీ తెలియచెప్పకుండా, రాత్రిరైలులో రాజమండ్రీ గోషాస్పత్రికి నన్ను తీసుకెళ్లేడు మాఅన్నయ్య. దారిలో నాభయం చెప్ప నలవికాదు. నేను లోలోన కుమిలి యేడుస్తూ వుంటే, మాఅన్నయ్య పైకిచెప్పడానికి సిగ్గు కొద్దీ, న న్నొక్కటి కొట్టేడు!......ఇప్పటి కైనా, ఆచెయ్యి యెంతనొప్పెట్టిందో అనిపి స్తుంది నాకు. ఆస్పత్రిగేటువద్ద గుబురుగావున్న చెట్లకింద నన్ను దింపి జట్కా వెనక్కు పంపేసి, "యిక్కడేవుం" డని నాతో చెప్పి-

అంతే, మరి నాకగపడలేదు, నాటికీ నేటికీ. ప్రపంచమంతకీ నే ననవసరమని తోచి నన్ను బహిష్కరించినప్పుడు నన్నాదరించింది క్లారా దొరసాని. ఆమెమొగం అందుచేతనే మా అమ్మని పోలిందనుకుంటాను; లేక, యేలోకం నుంచో వచ్చిన నామట్టిలో మొదట ప్రాణం పోసి పెంచిన వాత్సల్యంచేత మాఅమ్మే యిక్కడ క్లారాగా పునరుద్భవించిందో!

*　　*　　*

నన్ను తృణీకరించిన లోకమంతనీ నేనే భరించినంత నిస్త్రాణగా వుందని క్లారాతో చెప్పేసరి కామె తనయింటపుట్టిన బిడ్డగా నన్నాదరించి నా కోగది యిచ్చింది. ఆగది ఒకభూలోకస్వర్గం. పంచభూతాలూ బాహాటంగా ప్రచారంచేస్తూంటాయి. అద్దపుకిటికీలు అవసరమైనప్పుడు వేసేస్తే, గర్భంలో శిశువులాగు లోపలివారికి బ్రహ్మానందంగా వుంటుంది. క్లారా తను స్వయంగా తెచ్చి ఒకగాజుగిన్నెతో "గ్లాకోస్" యిచ్చింది. నా స్థితి చూస్తే, మంచంమీద దిండ్ల కంటిపెట్టుకున్నాను. కనురెప్పలెత్తడం కష్టంగా వుంది. "త్వరగా తాగమ్మా, మరేం ఫర్వాలేదు. ఒక్కరాత్రి" అంది క్లారా. మెల్లగా లేచి కొంచెం తాగేను. జీవకారుణ్యంలో వున్న మధువే నాకు క్లారా చవిచూపింది! ఆతర్వాత ఒకఅరగంటకు నాచెవుల్లో స్టవు వెలిగించిన ఝూంకారం లేచింది. స్వప్నసీమ సైతం దాటి అలౌకమైన గాఢసుప్తిలో పడిపోయేను!

*　　*　　*

సూర్యభగవానుడు సహస్రబాహువులు చాచి లోకమంతటినీ తట్టిలేపిన వేళకు నాలో చైతన్యం మళ్లీ ప్రవేశించింది. ప్రక్క నదివరకున్న దిండు లేదు. నులివెచ్చగా నా బహిఃప్రాణం నాచిన్నికూన, సంఘంతో శత్రుత్వం వహించి సాధించుకున్న నా జన్మహక్కు, పొత్తిళ్లనడుమ నిండుకుండలో అమృతం లాగు తొణుకుతూంది! "అమ్మగారండీ, మొగపిల్లాడేనా?" అన్న నర్సుమాటలు నాచెవులకేదో దూరస్థమైన నేపథ్యంనుండి వినిపించేయి.

*　　*　　*　　*

మా అన్నయ్యాపమో ఉత్తరం రాశాట్ట క్లారాపేర:— "శిశువును విడుచుకుని వచ్చేస్తే మర్యాదగా నన్నింట్లో పెట్టుగోవచ్చు"నని. మాఅన్నయ్య నామీద ఇంత కఠినత వహించివుండడు; రాక్షసిసంఘం నాకుటీరంలోనైనా నే సుఖంగావుండడం ఇచ్చగించక, వాడిచేత ఇట్లా రాయించింది. స్త్రీజన్మసిద్ధమైన పురుషప్రేమ నానుండి దోచుకున్నది చాలక, యీ మాతృప్రేమ కూడా నానుండి అపహరించి నన్నిహపరాలు రెంటికీ దూరంచెయ్యడానికి, ఈ సంఘానికి నేనేం విషంపెట్టేనూ? వీరంతా నామర్యాద కాపాడ్డానికనిట, యీఎత్తులు! ఇంద్రపదవి

యిచ్చినా యేతల్లి, స్తన్యంవద్ద శిశువుని తిరస్కరించగలదూ?

నా 'చిన్నిపార్వతి, నా ముద్దులబాబు, పెద్దవాడయేక నాకు జన్మాంతరాలదాకా సరిపోయే ప్రేమ చూపించడూ!......క్లారా నన్నిప్పుడు పెళ్లాడమంటుంది. నా కక్కర్లేదు. మాతృత్వంతప్ప నాలో స్త్రీత్వ మెక్కడుంది? సంఘానికి వెరిచి మాబావ నావంక చూడకుంటే పోనీ. స్వర్గమే వుంటే, అక్కడ గాలించి యేనాటికైనా మా బావని పట్టుకుని, ఆనాడు నిలువుటద్దంముందట నిలిచినట్లు జంటగా చేరి, మాయీ ప్రతిబింబాన్ని చూసుకోమూ?

*　*　*　*

క్లారాయే ఇప్పుడు మాఅమ్మ. పార్వతే నాసర్వస్వమూనూ. నాకిప్పుడంతా ఆనందమే. నాఆనందమంతా నాపార్వతికోసమే. ఇప్పుడు ప్రాకడంనేర్చి నాకుట్టుపని తోచనివ్వడు. వియ్యాలలో వుంచడం మానుకున్నాను. తలకుపెట్టిన పూలుటోపీతో నా యెదట కిలకిలమని కొండసెలయేరులాగ వాడు నవ్వుతూవుంటే, ఇంద్రధనుస్సుతో చట్రంకట్టిన జాబిల్లినుంచి వెన్నెలకురిసినట్లుంటుంది. మిషనరీఅమ్మాయిలందరికీ నా బాబు జనముద్దూ. నానిద్రలో యిప్పుడు స్వప్నంరాదు. పురుదేన ్రాగి మత్తిల్లినట్టు, నావరాలమూటకు వక్షమప్పగించి కన్నుమూస్తే, లోక మేమైందీ నాకక్కర్లేదు.

ఇంతటిసౌభాగ్యం నాకు భగవంతుడు ప్రసాదించి, కడపట నాకు నరక మెందుకిస్తాడూ? స్వర్గద్వారంవద్ద యీరాక్షసులు పహారాజవాన్లుగా వుంటారా? లేక మా అమ్మమ్మయిష్టమా? నేను నమ్మను. ఈ డాంబికాలన్నీ నాలాటి అనాథలను చిత్రవధ చేయడానికి క్రూరలోకం చేసిన యేర్పాటు! గాలవేసి పరమపదించే కదళికి యేదరలోకం వస్తే నేనూ అక్కడికే వెడతాను!!

---

# శ్రీరామదండు *

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఒక వ్యక్తికిని, ఆతని రచనములకును అవినాభావసంబంధ ముండును. రచయిత చారిత్రము ఆతని లేఖినియందే యుండి, అందుండి వెడలు అక్కరములలో, పూవులందలి తేనియవలె తొలుకాడుచుండును. గోపాలకృష్ణయ్య వ్యక్తిత్వ మీగ్రంథమందు ప్రస్ఫుటించినది.

౧౯౨౦ లో గాంధిజీ శంఖారవము వినినంతనే, ఆంధ్రహృదయమున అంతదనుక నిదురించుప్రజ్ఞ లేచి, తలయెత్తినది. సంతృప్తి తలవాంచికొనినది; సంతుష్టి మూలబడినది. అభివృద్ధికాంక్ష విజృంభించినది. ఉత్సాహము వెల్లివిరిసినది. దేశీయు లావేశపూరితు లైరి. ఆశయసిద్ధికై నడుముగట్టిరి. వీరిలో గోపాలకృష్ణయ్య ఒకడు. నూతన వికాస మందిన ఈతనిహృదయమునుండి వెడలిన భావసౌరభము ఈచిన్నిపొత్తమం దున్నది.

ప్రజలమానసికవృత్తి నెఱిగి, సంప్రదాయమునకు అనుకూలములైనక్రియలే వారి హృదయములను ఆకర్షించునని గ్రహించి, సేవాధర్మమహత్త్వ మిట్టిదని వారికి దెలిపి, వారిని కర్మవీరులఁ జేయవలెనని ఈత డుద్దేశించినాడు. ఆలోచనము నెదుటనిలుచు దరఖాస్తులు—ఉత్కృష్టములేమైనను — వట్టివే యగుననియు, హృదయకవాటమును తట్టు శక్తియే ప్రజలచే ఘనకార్యములు చేయించుననియు, ఇట్టిశక్తి నిజమతధర్మచోదితమైన మార్గమందున్నదనియు గ్రహించిన బుద్ధిశాలి గోపాలకృష్ణయ్య. అకాలీ వీరులను, ఖిలాఫత్ గాజీలను ప్రేరేపించినట్లు మతదీక్షయు, మతనిష్ఠయేకాదు, మతోన్మత్తతయుగూడ క్రియాంగణమున హిందువులను పురికొల్పునని గట్టిగ నమ్మి,అతడు రామదండును లేవదీసినాడు. అతని యుద్దేశమందలి గభీరతత్త్వము నెఱుగకయో, ఆతనిదండు మూఢాచారములను రేకెత్తించు వెఱ్ఱిపటాలమని యెంచియో, ఆంధ్రుడుకాక ఆంధ్రేతరుడే లేవనెత్తు ఉద్యమమే ఆదరణీయమైనదని తలచియో ఆంధ్రులాంధ్రరత్నముయొక్క పూనికకు బుజము నొడ్డినారు కారు. ఈయుపేక్ష ఆతనిమనసున కెంతేని పరితాపము కలిగించినది.

ఆంధ్రులందు పొడసూపిన ఇక్కట్టులను తొలిపుటయందు తెలిపి, వానిని మాపుచేయు తారకము రామభజన మొక్కటియని ఆంధ్రరత్న మనినాడు. ఇతని రామభజనము నిమిత్తమాత్రమే. ప్రజలహృదయములం దడగియున్న భక్తివిభూతిని బహిర్గతమొనరించు తాళముచెవిని ఆతడు చేతబట్టదలచినాడు.

* గ్రంథకర్త: శ్రీరామదాసు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, శ్రీమదాంధ్రవిద్యాపీఠగోష్ఠి, విజయవాడ. ౭౧ పుటలు. వెల రు. ౦-౭-౦.

భజనావేశము సేవాధర్మమును నడపు అద్భుత శక్తియని గ్రహించి, ప్రతీచీసంప్రదాయము ననుసరించి ఏర్పడిన బాలభటసంఘముకంటె దనదండును మహత్తరమైనదానిగ జేయుట కాశక్తి అనివార్యమైనదని నమ్మి నిర్మాణ కార్యక్రమనిబంధనములను నిర్దిష్టము చేసినాడు. దండుతత్త్వమును నిరూపించువిషయము లివి : "సూర్యనమస్కారాదిమానసిక దైహికవ్యాయామములు నిత్యకృత్యములందు చేరుట. గ్రామప్రాంతములందు దీనుల రక్షణార్థమై ఆశ్రమములను నిర్మించి, యోగ్యతానుసారమైన వృత్తులను వ్యక్తుల కేర్పఱిచి, ఆశ్రమపదార్థములను గ్రామవాసులందు విక్రయమొనరించుట. శరణాలయవాసులకు విద్య గఱపుట. చుట్టుపట్ల సముచితప్రచారము సలుపుట. నిదానము, నిరోధము, వివేకము, ధైర్యము, శౌర్యము, స్థైర్యము, శీలము, తేజము, ఓజోబలసాహసౌదార్యాదిగుణములు అలవఱిచికొని, నిగ్రహానుగ్రహములోరులకు ప్రసాదించి, దేహమనోబలములకు తోడు సంఘబలమును దండుభటులు చేబట్టుట. అంతర్భావమునకును, బాహ్యావేశమునకును సామరస్యము కాపాడుట. స్త్రీలయందు సాహచర్యసేవను పురికొలుపుట. "సర్వలక్షణలక్షితులగు భటసంధాయకులను, భటులను సమకూర్చుట; నియమించుట; ప్రకృతజాతిధర్మస్థాపనము ఇహపరసాధకము, పరమపురుషార్థము అను నిస్సంశయములగు శ్రద్ధాభక్తులను భటాంతఃకరణములందు నాటుట. సర్వప్రాణిసమత్వమును, సోదరవాత్సల్యమును భటవర్గమునందు నిష్కళంకముగ పెంపొందించుట." నిరాదరణము నెత్తిబడినను పోతన తెలిపిన పరమభాగవతులట్లు * భటు లద్భుతసహనమును చూపుట. సూర్యచంద్ర మేఘులట్లు † అర్థింపబడకయ, పరహిత మొనరించుట. సమష్టిధర్మమును వ్యక్తిధర్మముతో సమన్వయముచేయుట. దధీచి, హనుమంత,లక్ష్మణాదిమహాపురుషులవలె ఐచ్ఛికసేవ నాదర్శముగాగొనుట ధర్మరాజ్యసంస్థాపనార్థము ఆత్మార్పణముగావించుకొనిన ఏసుపోలు మహాత్ముల దృష్టాంతములను మేలుబంతులుచేసికొనుట. వేయేల? నిష్కామకర్మ ఐచ్ఛికభటులచే నవలంబింపబడుట. ఒకతరగతితప్పిదమునకు ఒకపూటయుపవాసమును, వేఱొకరీతి అపరాధమునకు కొన్నిసూర్యనమస్కారములు దండనలగుట. చర్కాను త్రిప్పుమారుతిగల ధ్వజమును చేబూనుట. లక్ష్యశుద్ధిగలిగి, ముందంజవేయుచు, "శ్రీమద్రమారమణ గోవిందో హరిః", "జే మహాత్మాగాంధీ" యను ద్వాదశాక్షరి

---

* పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ
బడుచుం దురుగాని పరమభాగవతులు తా
రొడఁబడరు మారుసేయఁగ........."

† "పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవచక్రవాకమ్;
నాభ్యర్థితో జలధరోపి జలం దదాతి
సంతః స్వయం పరహితేషు కృతాభియోగాః"

షడక్షరీమాత్రము లుచ్చరించుట. రామదండు ఆధ్యాత్మిక మూలబంధముపై నిలిచియున్నదని ఈయంశములు వేనోళ్లు జాటుచున్నవి. గోపాలకృష్ణుని దృష్టి కాంతివంతమైనదనుట నిస్సంశయము. కార్యక్రమ విధానమున, ప్రత్యేక సేవ క్రియాంగణమును చక్కగ నిర్ణయించి, క్లిష్టపాలనాంశములందలి యభిజ్ఞతను ఆంధ్రరత్నము చూపగలిగినాడు.

దండుభావ మపూర్వమైనది కాదు. బాలభటసంఘము (Body of Scouts), రక్షణసేన (Salvation Army), భారతసేవక సమితి (Servants of Ind a Society), క్రైస్తవప్రచారకసంఘములు, హిందూస్థానీ సేవాదళము ప్రపంచప్రశస్తి నందినవి. పలువురు కూడినగాని మహోద్యమములు జయము గాంచనేరవు. సంఘసైనికులకు కొంత ఆవేశమవసరము. యుద్ధాంగణములందు నేడును మిలిటరీబేండు మ్రోగుచుండును. ఒకప్పుడు వీరులు శంఖములుపూరించువారు. భవానీ నామము నుచ్చరించుచు శివాజీ ముందంజ వేయువాడు. "హరహర మహాదేవ" యని ఆతని యనుచరులు శత్రుదుర్గము లందు జొచ్చువారు. "సత్ శ్రీఅకాల్", "అల్లాహూ అక్బర్" మున్నగు నుచ్చారణములు ఇటీవల మన దేశీయులందు వినవచ్చుచున్నవే. గోపాలకృష్ణుడు సూచించిన శబ్దమున ఛాందసమేమియు లేదు. ఈతని "అంతా రామమయము"లో హరిజనసమస్యాపరిష్కారముండెను. ఈతని కపిధ్వజము భావగర్భితమైనది. మారుతి బ్రహ్మచారి. జ్ఞానపిపాసువుల కధిష్ఠానదేవత. గోపాలకృష్ణుడీతని చేతులందు చర్కాను పెట్టినాడు. సేవాధర్మమునకే కాక శారీరక, అంతరంగిక, ఆధ్యాత్మిక, ఆర్థికపురోభివృద్ధికిని, జీవన కురుక్షేత్రవిజయమునకును ఆవశ్యకమైనది కపిధ్వజము కాక మఱేది? "రాజ్యముయొక్క తాళపు చెవులను రప్పించుటకుగాని, ప్రతిపక్షుని హృదయమున ప్రేమనాటి ప్రసన్నుని జేసికొనుటకుగాని ముఖ్యాధికరణము భటుడే" అని ఆంధ్రరత్నమనినాడు. ఈతనిదండుఉద్దేశములను గుర్తించినవారిలో ప్రథముడు రామభక్తుడైన గాంధిజీ. ఆలీసోదరు లీదండుభావమును ప్రశంసించిరి. ఆంధ్రుల ఆంధ్రత్వరాహిత్యము దీని కడ్డునిలిచినది. ఆంధ్రరత్నము 'కబళభిక్ష' యనినపుడు ఎందరెందరో ఆంధ్రులు మూతులు విఱిచిరి.

మహాపురుషులు పృథ్వీరంగమునుండిగాని, కార్యరంగమునుండిగాని తరలినను, వారి యాశయములు అస్తమింపవు. వాని యాలోకమును దృష్టియందిడికొని అగ్రేసరులగు ప్రజలు విజయజీవులు కాజాలుదురు. గాంధిజీ నేడు కాంగ్రెసునుండి తరలుచున్నాడు. మనోవాక్కాయములందు అహింసను తోడిభారతీయులు చూపినపుడు మరల బహిర్భాగమందు నిలుతునని మహాత్ముడనుచున్నాడు. మహాత్ముని ప్రస్తుతనిష్క్రమణము శోచనీయమే. అయినను, తనఆశయ

ములను హృదయంగమమొనరించుకొని, స్వయం సాహాయ్యముపై సంపూర్ణవిశ్వాస ముంచి తనఅనుచరులు కృతకృత్యులు కాజాలుట జూడవలెనని యెంచు గాంధిజీయుద్దేశము భావబంధురమైనదికాదని ఎవ్వరనజాలుదురు? వ్యక్తి వెనుకనిలిచినను, ఆతని ఆశయములు ముందేయున్నవని అనుచరులు గుర్తించిన చాలు. ఆంధ్రరత్నము అదృశ్యుడైనను, ఆతనిభావములు అమరత్వముకలవియని ఆంధ్రులు గుర్తించినచో, రామదండు పునరుద్ధరణమునందుట కెన్నినిముసములు పట్టును? ఒకప్పుడు నిట్టూర్పులునిగిడించిన గోపాల కృష్ణుని ఆత్మ దివ్యనృత్యమునలుపుట కెంత సమయమగును?

ఆశయజ్వాలకు ఆవేశవాతూలము తోడై, ఉత్కృష్టకార్యములను ద్రుతగతి నడుపజాలు శక్తిని పుట్టించును. విశేషసాధనమున గాని ఈశక్తి చేతజిక్కదు. సాధనమునకును, సగుణోపాసనమునకును కొంతవ్రతము, కొంతనిష్ఠ, కొంతదీక్ష అవసరము. గోపాల కృష్ణునిప్రణాళిక వీనిపై నాధారపడుటయందు అక్కజమేమున్నది?

ఈ పుస్తకము కావ్యముకాదు. దీనియందు కథనాకౌశలము నపేక్షించుట వెఱ్ఱితనము. జాతీయోద్ధరణమునకు పనికివచ్చు గ్రంథ మిది. దీనియాశయమును దెలుపు నాయకుఁడు ప్రత్యక్షము కాకపోయినను, గ్రామవాసులు దీనిని చేబట్టి, తమకమ సమితులను, దండులను నిర్మించుకొని, కష్టమును, దుఃఖమును పోద్రోలి, సుఖమును, ఆనందమును వశమొనరించుకొందురుగాక.

---

## వాసకసజ్జిక

'కుమారదేవ'

ఇతరు లాడుమాట లేవైన వినవలె
నని యదింతయైన మనసు లేదు;
ఐన—నాసమీపమందె, యం తెలుఁగెత్తి
పల్కుచున్నఁ—జెవినిఁబడకయున్నె?
వారిలోన నొకతె 'వనిత సంతోషంబు
కంటివే?' యటంచుఁ గన్నుగీటి—

(చర్చలివ్వి—నన్నుఁగూర్చియే!)-యందులె
కామె'యబ్రమదియె'యనుచుఁబలికె.
వారు నా కొకింత పరిచితులై మాత్ర
ముండియున్న, నందు నుచితరీతి;
'ఇప్పు డిచట నాదుహృదయాధినాథుఁ డే
తెంచునంచు సంతసించితి'నని."

—మకరందస్యందనమునుండి.

## తృతీయరంగము

(సుశీలుని గృహము)

సుశీలు—గౌరీశంకర్ సీతారామ్, గౌరీశంకర్ సీతారామ్. (అనుచుఁ బ్రవేశించును.)

(రామచంద్రుఁడు, రామకోటి, భావనారాయణ యనుశిష్యులు ప్రవేశింతురు.)

శిష్యులు—శ్లో.

వేదవేదాంతవేదాంగ సారభూతాం సముజ్జ్వలామ్,
గాయత్రీం మాతరం వందేసురుముఖాబ్జజాంపరామ్.

శ్లో. కరణం జ్ఞానస్య పున
స్తరణంభవలంఘనాయ తాత్పర్యభరా
చ్ఛరణం సతాంచ ముక్తా
భరణంజీవ! భజ రే శివం గురుచరణమ్.

(ప్రవేశము ద్వారమందు నారాయణభట్టు, నిరంజనుఁడు, అన్నంభట్టు)

నిరంజ—(స్వగతము) జ్ఞానకరణము, భవతరణము, సచ్ఛరణము నగు నా గురుచరణము? ఈ బాలకులు నన్నుద్దేశించియే యీశ్లోకమును జదువుచున్నారా యేమి?

వటుఁడు—(నమస్కరించి) స్వామీ, నారాయణభట్టుగారు శ్రీరాజశేఖరమహారాజుగారి కుమారునితో ద్వారమందు వేచియున్నారు. సెలవా?

సుశీలు—రమ్మనుము. నిరంజనకుమారుఁ డతి మేధావియని కర్ణాకర్ణికగా వినియుంటిమి.

(ప్రవేశించి నారాయణభట్టు, సుశీలునికి నమస్కరించి)

నారా—స్వామీ! మహారాజుగారు తమ పుత్రరత్నమగు నిరంజనకుమారుని, మీకు, శుశ్రూష యొనర్చి విద్యాగ్రహణం బొనర్పఁ బంపియున్నారు. చిత్తగింపుఁడు, జీవా! పుంభావమును దాల్చిన శ్రీవిద్యయోయన్నట్లు కూర్చుండియున్న యీసద్గురుమూర్తికి నమస్కరింపుము.

నిరంజ—(పుష్పములను సుశీలుని పాదములపైఁ జల్లుచు నమస్కరించును)

శ్లో. దేశికాం ఘ్రిద్వయంవందే సర్వశాస్త్రప్రకారకమ్,
తారకం మామకం శ్రేయోదాయకం లోకనాయకమ్.

సుశీలు—(స్వగతము) స్తుతిరూపమున నీతఁడు తన కోరికను వెల్లడించుచున్నాఁడు. (ప్రకాశముగ) నీకు శుభంబయ్యెడు. (అని యాశీర్వదించును.)

అన్నంభట్టు—నారాయణకుమారుఁ డన్నంభట్టు నమస్కరించుచున్నాఁడు. (అని నమస్కరించును)

సుశీలు—(అన్నంభట్టును నిరూపించుచు, స్వగతము.) రాజకుమారునితోవచ్చిన వీనినూ పన్యథా ప్రసరించునటు లున్నది. (ప్రకాశముగ) "తదేవ లగ్నం సుదినం తదేవ। తారాబలం చంద్రబలం తదేవ। విద్యాబలం దైవబలం తదేవ। లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి." నారాయణభట్టూ! ఇప్పుడే పూర్వశిష్యులతోఁబాటు వీరును పాఠముల నారంభింపవచ్చును.

నారాయ—చిత్తము. చిత్తము. సాధువులు దర్శనముచేతనే పునీతులఁ జేయుదురు. సావధానులరై సద్గురుముఖోద్గళితబోధసుధాధారలఁ గ్రోలుఁడు. (సుశీలునివైపునకుఁ దిరిగి) స్వామీ! సెలవొసంగుఁడు! పోయివచ్చెదను. (అని నమస్కరించి నిష్క్రమించును.)

అన్నంభట్టు, నిరంజ—చిత్తము. చిత్తము. (అని గురుని కభిముఖులుగఁ గూరుచుందురు.)

సుశీలు—రామచంద్రా! ఏదిరా నిన్నటిమురారి శ్లోకము.

రామచం—స్వామీ! చదువుచున్నాను.

శ్లో. తస్యాజ్ఞయైవ పరిపాలయతః ప్రజా మే
కర్ణోపకంఠపలితంకరణీ జరేయమ్,

య ద్గర్భరూపమివ మా మనుశా_స్తి సర్వ
మద్యాపి త న్మయి గురు ర్గురుపక్షపాతః.

సుశీలు—సారస్వతసారసర్వస్వవే_త్త మురారి కవిశిఖామణికాక మఱియెవ్వఁ డీశ్లోకమును వ్రాయఁ గలఁడు.

(బాలకులవంకఁ దిరిగి) భావనారాయణా! ఈశ్లోకాభిప్రాయ మేమి? ఎఱుఁగుదువా?

భావనా—చిత్తము. ఎఱుఁగుదును కాని మాలో రామకోటేశ్వరరాయఁ డీశ్లోకమును మురారికవి ఛాందసమునఁ బడినాఁడని నిన్నటినుండి వాదించుచున్నాఁడు.

సుశీలు—మురారికవి నెన్నునంతటి మూర్ఖాగ్రేసరుఁడవా నీవు! వీని కీతలవిసురుడు ప్రారంభము నుండి యున్నదియే. ఏమిరా! కోటీ! విధి నా కర్త మా యని తోడిబాలురతో వంకరదండము పెట్టు నీకు మురారి ఛాందసుఁడు కాఁడా?

రామకోటి—(నమస్కరించి) బాలురతో నంటినిగాని తమయొద్దఁ జెప్పఁదగినదికాదు. క్షమింపుఁడు.

సుశీలు—ఉండు. (నిరంజనునివైపునకుఁ దిరిగి) నిరంజనకుమారా!

నిరంజ—(నమస్కరించి) కుమారాయని నన్నుఁ బిలువవేఁడెదను.

సుశీలు—వత్సా! ఈశ్లోకాభిప్రాయ మేమి, చెప్పుము.

నిరంజ—చిత్తము. తెలిసినంతవఱకు విన్నవించెదను.

గీ. ప్రజలఁ బాలించుచుండ నప్పరమగురుని
యాజ్ఞ నే వార్ధకపునరలయ్యోఁ జెవిని
శిశువునుంబోలె నేఁడు శాసించు సర్వ
మారనన్, గురుకరుణకు మేరగలదె!

**సుశీలు—బాలకులారా! మురారిశ్లోకము నొక్కసారి వినినంతమాత్రమున నర్థమెఱుంగుటయు, దాని నింతలలితముగ నాంధ్రీకరించుటయుఁ జూడ నీతని** తండ్రియగు నారాజర్షితపఃఫలముసుమా. ఇఁక ఏమిరా! కోటీ! మురారిపై నీకోటియేమి? ఏలరా జంకెదవు? త్రికరణశుద్ధిలేని నీబోటి మానవంతులు కళాశాల నలంకరింపఁదగుదురుగాని గురుకులమున నుండఁదగరు. ప్రామాణ్యబుద్ధికలిగిన సచ్ఛాత్త్రుల భక్తివిశ్వాసములుకూడ నీవలన నంతరించును. ఏమిరా! నీపూర్వపక్షము చెప్పెదవా లేదా?

రామకోటి—చిత్తము. మనవిచేయుచున్నాను. దశరథునంతటి మహారాజు వైదికవిషయములవైననుగాక సర్వవిషయములఁ బురోహితునకు లొంగిపోవుట నా బుద్ధికి సరిపడినదికాదు. శిష్యునకు స్వతంత్రజ్ఞాన మనుగ్రహింప నేరని యసమర్థుఁడు వసిష్ఠుఁడనియా? గ్రహింప నేరనివాఁడు దశరథుఁడనియా? ఇట్లు మురారి వ్రాయుట. నాకు వ్యాకరణశాస్త్రమునందును, దర్కమునందునుకూడ సందేహములు కలవు. తిఙన్తమన్నట్లు సన్నమనక సన్నన్త మనుట యేల? "పృథివ్యప్తేజో వాయ్వాకాశ కాలదిగాత్మమనాంసి నవైవ" ఇచట నాత్మతరువాత మనస్సును చెప్పనేల? ఇట్టివి చాల కలవు.

భావనా—స్వామీ! మొన్న నీతఁడు అ. ఇ. ఉ. ణ్ సూత్రములో నొక ణకార ముత్తైయుండఁగా లణ్ సూత్రమందు మఱియొకయిత్తైన ణకారమును జెప్పనేల? అని రామచంద్రు నడుగ నాతఁ డొక పద్యముతో సమాధానమును జెప్పి రామకోటేశ్వరరాయల వాయి మూయించెను.

సుశీలు—రామచంద్రా, నీకు శాస్త్రమునందే కాక కవిత్వమునందును బ్రవేశము కుదిరినదా? ఏదీ నీ పద్యము?

రామచం—మీయెదుట చదువఁదగినంత గొప్ప పద్యము కాదు క్షమింపుఁడు.

**సుశీలు—చదువుము. చదువుము. అతివినయము వలదు.**

**రామచం—(సంకోచముతోఁ జదువును)**

క. నా నిత్తుఁజేయు వ్యాకర
ణానక్ సంశయముఁ బుట్ట నవ్వఁగనగు నా
దాని నలక్షుణమని వ్యా
ఖ్యానమునక్ సురుముఖమున నను బోధనమునూ.

సుశీలు—పద్యము మిక్కిలి బాగున్నది. ఇఁక దశరథవసిష్ఠుల విషయము. వసిష్ఠుఁడు సకలవిద్యా పారంగతుఁడు, సర్వజ్ఞుఁడు. దశరథుఁ డాత్మార్పణ ముఁ జేసికొన్న మహనీయుఁడు. సన్నిధానమున నున్నంతవఱకును గురువులకు శిష్యులను బోధించుటయు, శిష్యులకు గుర్వాజ్ఞను నిర్వహించుటయు నుభయము స్వధర్మపరిపాలనమని బోధించుటకై కవి యట్లు వర్ణించినాఁడు. శివాజి రామదాసుని, కృష్ణదేవ రాయలు తిమ్మరుసును నప్రయోజకులై సేవింపలేదు. మీదుమిక్కిలి యట్లాశ్రయించుటవలననే గొప్పవారైరి. రాజ్యములేని మారాయఁడు తాఁ జేయలేఁడుసరికదా, చేయుమహనీయులను, వారినిఁ బొగడు కవులనుగూడ సహింపలేఁడు.

(ప్రవేశము గోపాలశర్మ:సాష్టాంగనమస్కారముఁ జేసి వస్త్రముల సమర్పించును.)

సుశీలు—ఏమిరా గోపాలా! మీయింట నంద ఱకు క్షేమమేకదా! మీచెల్లెలి వివాహము నిర్విఘ్న ముగను, జక్కఁగను జరిగియుండునని తలఁచెదను.

గోపాల—తమదయవలన నేనిషమైన కొఱఁతయు లేదు. ఇంకొక్క విశేషము. మావారలతో సోమశిలలో జరుగు నుత్సవమునకుఁ బోయితిని. ఏమి చెప్పుదు స్వామీ! అచట సోమేశ్వర సన్నిధానంబున బాలికారూపంబున నున్న శారదంబోలి తపమాచరించు నొక పండ్రెండేండ్ల బాలిక కలదు. తపోవసానంబున నామె యనర్గళమైన ధారతోఁ దత్త్వబోధమును బద్య రూపమున నొనరించుచుండును. సాధువులు, పండితులు నిత్యము వినుచుందురు. నాకోపినన్ని పద్యముల నొక్క వేయింటిని వ్రాసికొని వచ్చితిని. దీనిని సత్యసార మందురు. (అని చేతికి నిచ్చును.)

సుశీల—(ఆనంద పరవశుఁడై పుస్తకమును దిరుగవేయుచు) ఇబ్బాలిక కలికల్మషహారిణియగు వాగ్దేవి కానోపు. సర్వశాస్త్రములయొక్క సార మిందుఁ గలదు. బాలకులారా! శ్రద్ధాళువులై యాలకింపుఁడు. (నిరంజనునివైపునకుఁ దిరిగి) కుమారా! ఈ గ్రంథమున నొక్క ప్రకరణము తీసి చదువుము.

నిరంజ—చిత్తము. చిత్తము. (అని గ్రంథము తెఱచును)

## సత్యసారము

గీ. సర్వసంశయములు సమసిపోయెడుదాఁక
కోరుదాని మనము చేరుదాఁక
వాసనాత్రయంబు వాడిపోయెడుదాఁక
భవము దాఁటుదాఁక వ్రతము తపము.

గీ. ఇంద్రియములచేత నెవఁడేని కన్గొను
లోకమంత, కాని లోని హరిని
భక్తుఁ డొకఁడు గాంచుఁ బ్రహ్లాదునింబోలి
కానరానివానిఁ గంబమందు.

గీ. తాప మెచ్చుకొలఁది తగ్గుచుండును నిద్ర
వలువనైన విప్పఁ దెలివిఁదప్పఁ
గలువరించుచుండుఁ గటకటపడుచుండు
యోగి, భోగి, రోగి యొక్కరీతి.

గీ. అమృతకలశంబు యాఁకలియయినయెడల
పుష్పశయ్యయ సుమి నిద్రఁబోవువేళ
లచ్చి కాటపట్టు సిరుల నిచ్చునపుడు
ఆప్తగృహ మాత్మమిత్రునైక్య మమరుపట్ల
సర్వధా ముక్తి హరిపాదజలజవృత్తి.

సుశీలు—వత్సా! సాక్షాచ్ఛారదాపరావతారం బనఁదగు మహాయోగినీకృతసత్యసారమే నీకుఁ గరగత మయినది. పరమేశ్వరియనుగ్రహంబున నీవు పరిపూర్ణుఁడ వయ్యెదవు.

సాంధ్యకృత్యముల నిర్వర్తింప సమయమయినది లెండు. బాలకులారా! ఈకుమారుని జాగ్రత్తతో నరయుఁడు.

బాలకు—చిత్తము. చిత్తము.

శ్లో. ప్రణవాకారం శ్రీగురు
మనవరతానందమూర్తి మార్తశరణ్యామ్,
మునిసన్నుతం సుశీలం
మనసా నిత్యం భజామి మామకశరణమ్.

(అని నమస్కరించి వెడలిపోవుదురు.)

సుశీలు—గౌరీశంకర్ సీతారామ్ (అని స్మరణ చేయుచు నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

## తృతీయాంకము

### (ప్రవేశకము)

(ప్రవేశము కలవాణి డామాడోలిశాస్త్రి తోఁటలో)

(డామాతోఁటలో మహాముద్రలో నుండి ధ్యానము చేసికొనుచున్నట్లుండును.)

కలవాణి—మాబుద్ధిమతి వెన్నవంటిమనసుకలది. నన్నే నమ్మికొనియున్నది. నిరంజనకుమారునిపైఁ బ్రాణములు పెట్టుకొనియున్నది. నాకెవ్వరిక్కడ దిక్కు? (ముందరకుఁజూచి) ఈమహనీయుఁ డెవ్వఁడో యిక్కడ ధ్యానముచేయుచున్నాఁడు. నాచెలియదృష్టము, నా భాగ్యము నెట్లున్నదో. ఈమహానుభావుని శరణు చొచ్చి నామనోరథసిద్ధిఁ బడయుదును. (అని యాతనికి సాష్టాంగనమస్కారముఁజేసి చెంత నిలువఁబడును.)

డామా—(ధ్యానము చాలించి కన్నులు తెఱచి) ఎవరు నీవు? నీపే రేమి?

కల—శ్రీమహారాణిగారి పుట్టినింటినుండివచ్చితిని. శ్రీమతి బుద్ధిమతీదేవికిఁ బ్రాణసఖిని. నన్నుఁ గలవాణి యందురు.

డామా—మహారాజుగారు,రాణిగారు జయంతాశ్రమమునకుఁ బోయి రని యెఱుఁగవా? ఉండు, ఉండు. నీపే రేమి? కల=వాణియా? కలమనోహరమైన, వాణి=వాక్కుగలది. ఈశబ్దము స్త్రీలింగమువలె నున్నదే. నా కొంపతీయుటకు నీవెందులకు వచ్చితివే యిచ్చటికి! మా కూటిలో దుమ్ము పోయఁదలఁచుకొన్నావా! ఏమి? ప్రత్యేక మొకపరిషత్తు పెట్టి మా నిరంజనమహారాజుగారు నిఘంటులలోని స్త్రీలింగశబ్దములనుగూడఁ దీసివేయించుచున్నారు. నీవేష మంతయుఁ జూచినకొలఁది సందేహము లేదు, నీ వాఁడుదానివలెఁ గానఁబడుచున్నావు. ఆఁడదాని వీవ కెందులకు వచ్చితివే?

కల—(స్వగతము) బ్రాహ్మణుఁడు పెద్దవాఁడే కాని చిలిపిమాట లాడుచున్నాఁడు. డామాడోలిశాస్త్రి యీయనయే యైయుండవోపు. నన్నేమన్న నేమి? నా కార్యము నెఱవేఱవలెను. మఱియు విదూషకులు పురుషులక్రింద పరిగణింపఁబడరు. నేను చొరవచేసి మాటలాడి యాతనికి టోపీవేసి కార్యముసాధించుకొందును. (ప్రకాశముగ) స్వామీ, ఒంటరిదానినిఁజేసి యెన్నెని మాటలాడితిరి. ఆఁడదాన నగుట, నీవ నాకుఁగల నిస్సహాయస్థితినుండి నన్నుద్ధరించుటకు మీకరుగ్రహము గాక వేఱుపట్టు లేనిదాన నగుటచేతను నన్ను మీ రేమన్నను దప్పుపట్టఁజాలను. నాకార్యము మీవలన నైననంతియు చాలును.

డామా—ఓరిబాబూ! ఇది యెవతెరా! ఇది మేనకయో రంభయో యైయుండవోపు. వేయికన్నులుండియుడ్డివాఁడే యింద్రుఁడు. నేను కనులుమూసికొనుటఁజూచి తపస్సనుకొని తనకెక్కడ నెసరుపెట్టెదనో యనుభయముచేత నా తపోభంగము చేయుటకు దీనిని పంపినాఁడాయేమి? ఎవరే పిల్లా! నీవు నిజము చెప్పు. మహారాణి పుట్టింటిదాననైన నామెకడ కేగవలసియుంటివి. ఆమెకు వేదాంతము ముదిరి పుట్టినింటివారి సందేశము తెచ్చిన పూఁబోఁడివైనఁ గన్నెత్తి చూడనప్పుడు నెత్తిని మేలిముసుఁగు వైచికొని వచ్చినదారినే పోవక నావెంటఁబడెదేల?

కల—మహారాణిగారి వైరాగ్యముచే మీయందఱముందు నేనింత పలుచనైతిని. యువరాజపట్టాభిషేకమని తెలియఁగానే మాబుద్ధిమతీదేవి చిన్ననాఁటనుండియు నిరంజనకుమారుని గుణరూప వైభవాదుల భావించు

నుండుటచేఁ దనమనోరథ మెట్టులు మహారాజకుమారునకుఁ దెలియఁజేయుదునా యనుచింతతోఁ జిక్కిపోవుచున్నది. గిరిరాజకుమారివలె నేకాంతమున నాతనిఁ గూర్చి తపించుచున్నది. ఆమెస్థితియంతయుఁ గాంచి యామెతల్లియుఁ జాలతపవు తలపోసి నన్నుఁ బిలిచి యిట్లనియె.

"ఉషాకన్యకుఁ జిత్రలేఖ వలె మాబిడ్డకు నీవు ప్రాణసఖి వగుటఁ గల్యాణపురమునకుఁ బోయి మా యభీష్టము ధర్మాంబ కెఱిఁగించి, నిరంజనకుమారునకును గన్యప్రేమాతిశయంబులు వర్ణించి, కల్యాణ మహోత్సవానంతరము మహారాజదంపతులు జయంతాశ్రమమునకుఁ బయనముచేయునట్లు సంధానము చేయుము" అని నన్నుఁ బంపిరి.

డామా—ఈమాట నాకప్పుడే యేల చెప్పలేదు?

కల—నాకుఁ దమతో నింతమాత్రము చనవు కుదిరిన నాభాగ్య మెట్లుండెడినో!

డామా—కలవాణి, నీపలుకులు కలకంఠపలుకులవలె నోరూరఁజేయుచున్నవి. తరువాత తరువాత.

కల—నేను మహారాణిగారికి మ్రొక్కి నా సంగతిఁ జెప్పఁబోవుచుండఁగా మనవారందఱును బాగున్నారా యనిమాత్రమడిగి తనచేటినిఁబిలిచి, యిది మాయమ్మగారింటనుండి వచ్చినది. మా మేనగోడలికి బహిఃప్రాణము. మేము మహారాజుగారి ప్రయాణ సంరంభములో నున్నాము. దీని నరసికొనుచుండు మని చెప్పి వెడలి పోయెను.

డామా—నిజమే; ఆమె యెంతకేని తగును.

కల—ఇందేమియు నసత్యము లేదు. స్వామీ, తమవంటి పెద్దబ్రాహ్మణులతో నబద్ధముఁ జెప్పుదునా?

డామా—ఓసి అమ్మకూఁతురా! మాటిమాటికిని పెద్దబ్రాహ్మణుఁ డని పిలుచుచున్నావు. నీకంటి కంత తాతగఁ గనఁబడుచున్నానాయేమి?

కల—అక్కటా అంత మీకేల? నేను మిమ్ములను బావగారనియే పిలిచెదను. మీయాజ్ఞ మీఱుదానను గాను.

తరువాత నాయవస్థ యాలకింపుఁడు. జయంతాశ్రమమునకుఁ బయనమగు మహారాణిగారిబండివెంటఁ బడి దారిలో నెట్లో వచ్చినపని యామె కెఱింగింపఁగా నామె "అంతపుణ్యమా! చిరంజీవి మిత్రులతోఁ జేరి యైచ్ఛికబ్రహ్మచర్యము పూనియున్నట్లు విన్నాను. నీవు తిరిగి రాజధాని కేగి రాజకుమారుని వేడుకచెలికాఁడగు దామోదరశాస్త్రిగారినిఁ గలసి యోజించి చేతనైన ప్రయత్నము చేసిపొమ్ము. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో యట్లు జరగఁగలదు. నాకింక గురుశుశ్రూషాపరాయణులగు మహారాజు ననువర్తించుటయే కర్తవ్యము. పాపము! నా మేనగోడలు బుద్ధిమతి నన్ను నమ్ముకొనియున్నది కాఁబోలు! శ్రీనివాసులకృప యెట్లున్నదో? నీవు మరలి పొమ్ము" అని నన్ను వెనుకకుఁ బంపివేసెను.

డామా—ఎంతపిచ్చితల్లి మహారాణి! చేతి కెదిగిన మహారాజు కుమారుఁడు. తన్ను నమ్మిన మేనగోడలు కోడలు. ఎవతెయయిన నీ సౌభాగ్య మనుభవించుట మాని మగనివెంటఁ జాంద్రాయణాదివ్రతములు సలుపఁ జనునా? కలవాణీ! నీవు బుద్ధిమతీదేవిపటమునైనఁ దెచ్చితివా?

కల—(ఒకచిన్నపటమును దీసి) ఇదిగో ప్రాణతుల్యముగ దీనినిఁ గాపాడుకొని వచ్చితిని. నీవే దైవమని నమ్మి నీచేతఁ బెట్టితిని. మా చెలికిఁ బ్రాణదానమును చేసిన పుణ్యమునఁ బొందుము. (అని కంట తడిబెట్టుకొనును.)

డామా—(స్వగతము) ఏమి దీని సఖీవిశ్వాసము! (ప్రకాశముగ) మంచిది. నీవును శీఘ్రముగ సుదర్శనమంత్రిగృహమున కేగి సవినయముగ నమస్కరించి, నీ వచ్చినపనియు, జరిగినస్థితియు విన్నవించి సెలవుపుచ్చుకొని నీయూరికిఁ బొమ్ము. తక్కినదానిని నేను నిర్వహింతును.

కల—మీ రామాట చెప్పిన నాకింక నొండు సందియ మేల? మీఋణము నే నుంచుకొనుదానను గాను.

డామా—ఈతొందరలో నయ్యెడిదేమి? పెండ్లికి మీయూరికి తరలిరామా! అప్పుడు నీనిగ్గు తేల్చనా?

కల—అంతపుణ్యము పుట్టెనా, మీకు నే నెట్టి దాస్యమైనను జేయనా? సెలవొసంగుఁడు. (అని చెప్పి పోవును. డామాడోలియు నిష్క్రమించును.)

## ప్రథమరంగము

(సభాప్రాంగణభూమి - నిరంజనుఁడు:)

ఒకనిప్రసక్తి యేల శివ
యోగికి స్వాత్మసుఖైకభోగికిన్
సుకవిసుధాంశుమాళికిని,
శోభనవృత్తికి, శాంతమూర్తికిన్
సకల గురూత్తమాంఘ్రియుగ
సారసభక్తికి, భవ్యశక్తికిన్
సుకృతికి, సాధుసద్గతికి,
సూనృతవాదికిఁ, దత్త్వవేదికిన్?

ఈజీవుని చిత్తక్షోభమునకుఁ ద్రికరణశుద్ధి లేక పోవుటయేకదా కారణము. స్వధర్మదీక్ష యింకను దృఢముగ మనసున నాటలేదు. పరధర్మములపై వలపు పూర్ణముగా వదలలేదు.

కర్మభూమియైన భరతఖండమునఁ బుట్టినవారికి నీరత్నగర్భయొసంగు పాఁడిపంటలు, నిండలి కళలు, శిల్పంబులు, శాస్త్రంబులు, సద్గురూపదేశములును బరాపేక్ష లేకయే శారీరక మానసికాత్మానందము లొసంగఁజాలు ననుట సిద్ధాంత మని సుశీలసన్నిధానమున కేగిన నాఁటనుండియు నామదిని నానాఁటికి దృఢమగుచున్నది. చుట్టుప్రక్కల నవనాగరికతావిజృంభణ మప్పుడప్పుడు మనస్సును జలింపఁజేయుచున్నది. పాపము! నాచెలికాఁడన్నంభట్టు నామాటమీఁద పరదేశములకేగి పలుపాట్లు పడుచున్నాఁడుగదా! లోకులు పలువురు జగము సత్తని నమ్ముచుండఁగా జ్ఞాని యొక్కఁడసత్తను చున్నాఁడు. ధనకనకవస్తువాహనాదికములు, దారాపుత్రాదులు, స్వచ్ఛందోనాది భోగంబులు మొదలగువానికొఱకుఁ బ్రజలు పలుపాట్లు పడుచుఁ బోరాడుచుండ రాజయోగియొక్కఁడే వైరాగ్యమే యభయంబనియు, మానవులకు సర్వవస్తువులు దుఃఖదాయకములనియు నిర్ణయించుచున్నాఁడు, బహుజనాచరణీయమగునది ధర్మమని చెప్పుటకు వీలులేకున్నది. ఒక్కొక్కతటి నంఘపరంపరగా బహుసంఖ్యాకులు స్వస్థానవేషభాషలు సమ్మతింపక, పరమత, పరధర్మ, పరదేశ, పరభాషా, పరసంప్రదాయముల నవలంబించుచుండుట చూచుచున్నాముగదా! జగదీశ్వరీ! నామనంబున నెందును భయభ్రాంతులు చొరనీయక శాంతి నెన్నఁడు సమకూర్చెదవో?

దౌవారి—జయము జయము. మహారాజా! తమ దర్శనార్థము ఖనిజశాస్త్రజ్ఞులును, శిల్పశాస్త్రజ్ఞులును వచ్చియున్నారు.

నిరంజ—వారి నందఱను పర్యాలోచనకుఁ బ్రక్క గదిలోఁ గూరుచుండఁబెట్టుము. నీవు పోయి కార్యదర్శి శివదాసుగారిని బిలిచికొనిరమ్ము.

దౌవారి—చిత్తము. (అని నిష్క్రమించును.)

నిరంజ—(స్వగతము) నాపడుకగదిలోని బల్లపైకి వచ్చినపటమునఁ జిత్రింపఁబడిన నారీమణి యెవ్వరో? స్త్రీపటమును నాశయనాగారమునకుఁ దెచ్చునంత స్వాతంత్ర్యమును, సాహసమును నెవరికిఁ గలవు? వివాహము మాననిశ్చయించిన నాకు నీస్త్రైణప్రసంగము విచారింపుట గూడ లజ్జకు. దీని నెవ్వ రెఱుంగకుండ భద్రపఱిచెదను. పెండ్లిమాట కేమిగాని యయ్యువిమాత్ర మతిమనోహరమైన వ్యక్తి యనుటకు సందియము లేదు. "యత్రాకృతిస్తత్ర గుణా వసన్తి" అనునుడి కలదుకదా!

(శివదాసు ప్రవేశము)

దౌవారి—మహారాజా, కార్యదర్శిగారు వచ్చియున్నారు.

నిరంజ—రమ్మనుము.

శివదా—ఏలినవారిపార్శ్వవర్తి శివదాసు నమస్కరించుచున్నాఁడు.

నిరంజ—మంచిది. మీతలిదండ్రులకు సేమమా?

శివదా—చిత్తము. మహారాజా! కొలఁదిదినముల క్రిందట దేవరవారియొద్ద సెలవుతీసికొని పోయియుంటినిగదా! నాస్తికుఁడనైననన్నుఁ జూచి విసిగి యిలువీడి

భద్రాచలమునకుఁ బోయి యచట వాసముచేయుచున్న మాజననీజనకులను క్షమాపణవేఁడి పిలిచికొనివచ్చితిని. మాతండ్రి, పెద్దమహారాజుగారు పోషింపుచున్న సత్ర యాగగోష్ఠిలో సత్కాలక్షేపము చేసికొనుచు బ్రహ్మానందభరితుఁడైయున్నాఁడు. నన్నీపాటియాస్తికునిం జేసినందుకు తమధర్మసంస్థాపనము ననుక్షణముఁ బొగడుచుండును.

నిరంజ—(స్వగతము) ఈతఁడు తనతలిదండ్రులకు గలుగఁజేసినంత విశ్రాంతిని మాతలిదండ్రులకు మేము కల్పింపలేకపోయితిమికదా! (ప్రకాశముగ) ఏమి యీ దినమువిశేషము?

శివదా—ఆయాశాఖలవారికిఁ బంపవలసిన జాబులన్నింటిని బంపివైచితిని. ముఖ్యముగా దేవరవారు సునామణిఁ జేయవలసినవానినిఁ దెచ్చితిని. చిత్తగింపుఁడు.

మహారాజకుమార వ్యాయామక్రీడా సంఘ కార్యదర్శి యిట్లు వ్రాయుచున్నాఁడు: క్రిందటిపక్షమునఁ జెన్నపురిలో జరిగిన వ్యాయామ సమావేశమున గుఱ్ఱపుఁ బందెమునందును, జలలక్ష్యసిద్ధియందును, మల్లవిద్యయందును, ఖడ్గవిన్యాసమునందును దేవరవారు ప్రప్రథమమున వచ్చినందులకు మహారాజకుమారు లందఱును "మహాసత్త్వ" యను బిరుదమును బ్రశంసాపూర్వకముగ దేవరవారి కొసంగినట్లు తీర్మానింపఁబడిన దని.

నిరంజ—మంచిది. వారు చేసిన సమ్మానమును మిక్కిలి కృతజ్ఞతతో నందుకొంటి మనియు, నీమాఱు జరగు వ్యాయామప్రదర్శనమును మన సంస్థానమున కాహ్వానముఁజేసితి మనియుఁ దెలియఁబఱుపుఁడు.

చోపుదారులు—జయము జయము. ధర్మవీర, ధర్మప్రతాప, మహాసత్త్వ, జీవమహారాజునకు జయము, జయము. (అని వెళ్లిపోవుదురు)

నిరంజ—దాసుగారూ, ఖనిజశాస్త్రజ్ఞులును, యంత్రశాలా నిర్మాణదక్షులును వచ్చి వేచియున్నవారఁట. మీరు మొన్న నాతోఁ బ్రస్తావించినది వీరిని గుఱించియే కాఁబోలు.

శివదా—చిత్తము.

నిరంజ—లోహకారవిద్య మనదేశమున విరివిగ వ్యాపించియున్నది. లోహస్వరూపము, వినియోగము, మిశ్రవిధానము మొదలగునవి రసశాస్త్రములయందును, శిల్పశాస్త్రములయందును జెప్పఁబడినవి. ఖనిజశాఖ మన సంస్థానమునఁ బెట్టఁబడలేదు. నేలబొగ్గు యొక్క యవసరము లేకయే యడవులలో నేసంవత్సరమున కాసంవత్సర మెండిన కట్టెపుల్లల సేకరింపఁజేసి మనదేశమున వాడుచున్నారు. ఇఁక నిరువదియైదు సంవత్సరములకంటె సీమగనులలో బొగ్గు లభింపదనుచున్నారు. అచట నడవులు లేవు. గోతులు పెట్టి లోపలి వన్నియు లాఁగిన భూమి ఫలించునా? సహజముగదొరకు రత్నములను, లోహములను సంపాదించి వినియోగించుట మేలుగాని బంగారుగుడ్డుపెట్టుబాతును జంపినట్లు భూస్వభావమునుమార్చు ఖనిజశాస్త్రములతో మనకుఁ బనిలేదు. వీరు మన శాస్త్రంబులఁ బరిశోధన గావించియు, భరతఖండమున నింకను శేషించియున్న శిల్పులఁ బరీక్షించియుఁ దదనుభూతప్రయోగములను, తత్కర్మసిద్ధియుఁ గాంచి సంవత్సరాంతమున నివేదికను బంపున ట్లేర్పాటుగావింపుఁడు. వారి పరిశోధనలకు వలయు ప్రాచ్యలిఖిత గ్రంథములను, బండితులను వారి కొప్పగింపుఁడు. ఈ శాస్త్రవేత్తలకు నిత్యనైమిత్తికముల కగు వ్యయమును సంస్థానమునుండి యిప్పించునది. నివేదికనుబట్టి వారికి భూరిబహుమతు లొసఁగబడు ననియుఁ జెప్పుఁడు.

శివదాసు—చిత్తము. దేవరసంస్థానమునఁ గావింపఁబడుతీర్పులు సర్వరాజన్యులకును మార్గదర్శకములు కదా! నాయనగారియాశయము లేలినవారి ప్రభుత్వమున మూర్తీభవించినవి.

నిరంజ—మంత్రిగారు వచ్చువేళ యగుచున్నది. ఇంకఁ జెప్పఁదగిన దేమైనఁ గలదా!

శివదా—అన్నంభట్టుగారి జాబొక్కటియే. ప్రకృతిశాస్త్రపరిశోధనలు పూర్తి యయిన వనియు, సాంఘికశాస్త్రములు, సంఘనిర్మాణసమస్యలు, ధనికదరిద్రభేదనిర్మూలక సంఘసిద్ధాంతములు, స్త్రీపురుష

సామ్యసమస్యలు, దిగంబరసిద్ధాంతములును బరిశోధించు చున్నాననియు, నింక నెంతకాలము పెండ్లి నుండవలయునో నిర్ణయింపఁజాల ననియు వ్రాయుచున్నాఁడు.

నిరంజ—అన్నంభట్టెంతవెఱ్ఱివాఁడు! ప్రకృతిశాస్త్రము లన్న నదియేమో చూచి రమ్మంటిని గాని సాంఘికశాస్త్రములలో వారు మనకు నేర్పున దేమి? ఆర్యసంప్రదాయముల నేను నికీర్తింతును. శూద్రుండగు సూతునిచే మహర్షులకుఁ బురాణములు చెప్పించిరి. త్రికరణశుద్ధిలేని బ్రాహ్మణోత్తములకంటె నక్కలిగిన శ్వపచుఁడు ముఖ్యుఁ డనిరి. శ్రీకృష్ణభగవానుఁడు చెంచెతను వరించి చెంచువారలకుఁ గులదైవతమై వారలకును, నితరులగు నార్యులకును స్నేహబంధము కల్పించెను. మహాదేవుండు శబరులతో సామ్యమొంది వారలకై శాబరమంత్రవిధానముల వ్యాపింపఁజేసి యార్యసంఘముతో నద్దాని నంటఁగట్టెను. రంగనాథుండు బీబీనాంచారిని బరిణయమై మహమ్మదీయసంఘసఖ్యమును సంపాదించెను. తానీషాకు భద్రగిరిరామచంద్రుఁడు ప్రత్యక్షమై హిందూమహమ్మదీయసమస్యను లేకుండఁ జేసినాఁడు. సంఘములఁ గట్టుకొనుటలో మనవారల యొక్క నేర్పోర్పు లెరిఁగఁగలవు? ప్రసిద్ధికెక్కిన పన్నిద్దఱాళ్వారులలో నెన్నితెగలవా రుండలేదు? దాసుగారూ, అన్నంభట్టునకు వెఱ్ఱి తీరినప్పుడే రానిండు. స్వయముగా వ్రాయునవకాశ మిప్పుడు మాకు లేదు. అతనికి వ్యయమునకువలయు సొమ్మనుమాత్రము మన ఖజానానుండి పంపుచుండుఁడు. అతని క్షేమోదంతమును నా కప్పుడప్పుడు తెలుపుచుండుఁడు. చాలును.

శివదా.—చిత్తము. (అని నిష్క్రమించును)

దౌవారి—మహారాజా, మంత్రిగారును, డామాడోలీశాస్త్రియు ద్వారమందు వేచియున్నారు.

నిరంజ—రమ్మనుము.

(ప్రవేశము మంత్రి, డామాడోలీ)

నిరంజ—(సింహాసనమునుండిదిగి మంత్రికి నమస్కరించును. మంత్రి యాసనముపైఁ గూరుచుండఁగాఁ దానును దనసింహాసనముపైఁ గూరుచుండును.)

డామా—రాజశేఖర మహారాజర్షిపుత్రా, సకలపరలోకస్తోత్రపాత్రా! కవిజనప్రగీత మహాసత్త్వకీర్తీ! నవయౌవనమనోహరమూర్తీ!

నిరంజ—పెద్దలసన్నిధానమునకై ననునీపొగడ్తను మానవయ్యా! నీకు నమస్కారము.

డామా—శీఘ్రమేవ వివాహమహోత్సవప్రాప్తిరస్తు.

సుదర్శన—తథాస్తు.

నిరంజ—(స్వగతము) నావివాహవిషయమున నిద్దఱు నేకాభిప్రాయులై యున్నారు. ఆహా! నేఁడేమో చిక్కు సంభవింపనున్నట్లున్నది. డామాడోలిమాటల కేమి యని యందునా, మంత్రివర్యులును తథాస్తని యనుట నన్ను మిక్కిలి కలఁచుచున్నది. పటమునందున్న ఛాయాప్రతిబింబమునకు నాధారభూతమైన బింబముండునా? అది యేకాలపునాఁటివ్యక్తియో దాని నమ్ముకొని నా మనోనిశ్చయమును మార్చుకొనుటయా?

సుదర్శ—ఏమయ్యా శాస్త్రీ, మహారాజకుమారుని నూతనప్రభుత్వమెట్లు ప్రజలు గ్రహించుచున్నారు?

డామా—ప్రజలెల్లరు నాయుష్మంతుని కమనీయ గుణగణములఁ బొగడుచు నీతఁడు తండ్రికీర్తికి వన్నెఁ బెట్టఁదగినవాఁ డనుటకు సందేహము లే దనుచున్నారు. కాని మీపైనిఁ బెద్దనింద వచ్చియున్నది.

నిరంజ—అమాత్యశేఖరులకుఁ గూడ నిందయా?

డామా: మహారాజకుమారుఁడు వృద్ధమంత్రిగారి యాజ్ఞకుఁ బూర్ణముగా లోఁబడియుండు రని మంచిచెడుగులు తా విచారింపకయే యాతఁడు చెప్పినట్లాచరించు ననియుఁ బ్రహ్మమున ఏకాలఁదిమ్మదియో యనుకొనుచుండిరి. ఇప్పుడీవిషయము రెండుచెవులసందునఁ దలకాయగలవా రందఱును జెప్పుకొనుచున్నారు.

నిరంజ—పూజ్యుఁడు, పితృసమానుఁడు నగు నమ్మహనీయుఁ ననుసరించుట, వారికిని నాకును ఖ్యాతివిషయమేకాని మఱియొండు గాదు.

డామా—అంత యభేదప్రతిపత్తి యమాత్యశేఖరునితో నేలినవారు కల్పించుకొనియుండ మంత్రిగారు చెప్పలేరు కాని చెప్పియుండినపక్షమునఁ బట్టాభిషేక మహోత్సవ తూర్యారావములు శాంతింపకపూర్వమే కల్యాణమహోత్సవమును మేము కన్నులకఱవు దీరఁ గాంచియుండవలసినవారముగదా యని యనుకొనుచున్నారు.

సుదర్శ—రాజకుమారునివివాహయమైన భారము నంతయు నాపై నిలిపి మహారాజు తపోవనమున కరిగెను. ఆతఁడు ధన్యాత్ముఁడు. ఎప్పుడు చిరంజీవి గృహస్థాశ్రమ దీక్షఁ బూనునా యని నిరీక్షించుచున్న నేను జెప్పక పోవుదునా?

నిరంజ—సర్వజ్ఞు లయిన యమాత్యశేఖరులకుఁ గూడఁ గేవల మైహికమును, దుచ్ఛమునగు వివాహము విషయమున నిట్టియభిప్రాయ ముండుననియూహింపనైతిని.

సుదర్శ—కుమారా! నీ వన్నట్టులు వివాహము కేవల మైహికంబునుగాదు, తుచ్ఛంబును గాదు. వసిష్ఠ మహర్షి తపోమయమైన జ్యోతి యని యరుంధతిని వర్ణించినారు.

గురునుపదేశశక్తి, నను
కూలసతీమణిసేవ, భక్తిచేఁ,
గర మనురక్తిచేఁ, బ్రబల
కామముచే, మహనీయసూక్తిచే,
సరసపుదృష్టిచే, విమల
సాత్త్వికభావముచే, సదా మనో
హరముగఁ గొల్వ, జీవుఁడు ప
రాత్మను జెందెను రామసత్కృపన్.

శంకరుండు భార్య కర్ధశరీర మొసంగె. చతుర్ముఖుం డర్ధాంగికై ముఖం బొసంగెను. పంకజనాభుండు ప్రియురాలికి హృదయ మొసఁగెను. అనుకూలదాంపత్య మఖిలార్థప్రదం బగు.

భ్రమరముఁ గమలము నొక్కట
సమమార్చిన దేవుఁ డిచ్చు సకలశుభంబుల్
అమరత్వ మైన నొల్లమి
సమసమిథునము తనయెడ సర్వం బుంటన్.

నిరంజ—

మునుపటికత లేల్లొకొ మా
నినులన్ భువి నమ్మరాదు నీచెప్పినచొ
ప్పునఁ గానరారు ముదితలు
మనమునకును శాంతి నీరు మంత్రివరేణ్యా.

లేదుకదా కృపాలవము
లేములయందుఁ గాముకాళికిన్
లేదుగదా సుఖంబు లవ
లేశము వారలయందు ధైర్యమా
రాదుగదా యథావిధిగఁ
బ్రాంజలులై భజియించి మ్రొక్కినన్
బోదుగదా మనోమలిన
మున్ దరిఁ జేరఁగ నెట్లు పూరుషుల్.

డామా—ఉన్న సంగతి మహారాజుగారు చెప్పినారు. నాయనుభవమును నట్టిది.

కట్టింతురు కొట్టింతురు
పుట్టింతురు లేనిమాట పూవుంబోఁడుల్
పెట్టింతురు విష మైనన్
గట్టా యిటువంటిచిత్రకర్మము తగునే?

సారసదళనేత్రలకై
సారెకుఁ గష్టింప నేల సన్న్యాసమునన్
భారం బంతయుఁ దీరున్
గోరినవియమంబున కనుకూలత కుదురున్.

మంత్రి—శాస్త్రీ, వివాహప్రాప్తిరస్తని దీవించితివి కదా యని నీమాట నూఁతఁజేసికొనియుండఁగా నేమి యిట్లె మరుతిరిగితివి? ఎప్పుడును పరిహాసము చెల్లునా? దేశకాలపాత్రముల నెఱుఁగవలదా!

కనకాంగి చెంత నుండినఁ
దనుకాంతియు ధనము బలము ధైర్యము హెచ్చున్
ఘనబోధమహిమఁ దత్త్వం
బును గని మోదింతు రుత్తముల్ విప్రవరా.

డామా—చిత్రము చిత్రము. మంత్రిగారిమాటలకు మాఱుగలదా? పురుషులకంటె స్త్రీలే తెలివికలవారు. సందేహము లేదు.

చదివినఁ బండితు లగుదురు
విదితము గాకున్న యెడల వెఱ్ఱులె పురుషుల్
చదివినఁ జదువకయున్నన్
ముదితలు విద్వాంసురాండ్రు పుట్టుక మంత్రీ!

మూడుజాములును ముక్కులు మూసికొని తపస్సు చేయు మునీశ్వరులు కృష్ణుఁ డన్నము మడుగ నొసఁగుటకు శంకించుచుండ వారిభార్యలు యజ్ఞేశ్వరుఁడగు కృష్ణున కన్నమిడి తృప్తిఁగావించిరి. తరువాత నా ఋషీశ్వరులు కటకటా మోసమాయెఁ గాంతలపాటియు బుద్ధిలేదాయె నని మొత్తుకొనిరి.

నిరంజ—ఏమయ్యా శాస్త్రీ! ఏయెంపకాఁడు గును బట్టుచున్నావు?

డామా—బుద్ధిమతు లెల్లకాలంబులను గలరు. (మంత్రిపై పునరుఁ దిరిగి) అమాత్యశేఖరా, మన మహారాజునకు నట్టిబుద్ధిమతి యొక్కతె లభించెనేని మనతో నిటులు వాదించునా?

నిరంజ—(స్వగతము) పడకటింటఁగల పటము నందలివ్యక్తి బుద్ధిమతిది కాదుకదా! దానిని గూర్చి శ్లేషగా మాటలాడుచున్నాఁడా యేమి యితఁడు. ఘుణాక్షరన్యాయముగ నామసామ్యము కుదిరెను. విదూషకునిమాటలకు విలువ యేమి? (ప్రకాశముగ) మగవాఁడు పిచ్చివాఁడై మగువల నమ్మినమ్మి చెడుచుండును. స్త్రీహృదయము మాయాక్రాంత మని యెఱిఁగియెఱిఁగియు నద్దాన భ్రాంతిఁ దగులుట దగునా?

కామియైనవాఁడు కల్లసంసారంబు
లో మునుంగు నాత్మలోఁ గలంగుఁ
గామి గానివాఁడు రాముఁడై నిశ్చింత
సహజకర్మమందు శాంతిఁ జెందు.

సుదర్శ—కుమారా! నీపట్టుదల వదలవుకదా! వేల్పులును బెద్దలును నీపాటి విచారింపకయె యర్ధాంగుల నంగీకరించిరా?

స్త్రీలు పూజ్యులు పండితచిత్తవృత్తు
లరసి మెలఁగుచు నేర్పొప్ప లతిశయిల్ల
నిహపరసుఖంబు లెప్పట్ల నిచ్చుచుంటఁ
బ్రీతిమతి చిత్రరీతి స్త్రీజాతినీతి.

నిరంజ—క్షమింపుఁడు, చిత్రరీతికాదు, చిత్రాంగిరీతి.

ఎన్నని చెప్పుమయ్యా
పున్నెంబున కంతరాయము వివాహం బౌఁ
గన్నులఁ గనమే యీఁగలు
తన్నుకొనన్ శ్లేష్మమునందుఁ దగులుకొనంగన్.

సుదర్శ—మాటకు మాట చెప్పుట యొకనిశేషమా? శక్తిహీనుఁ డెందును నసమర్థుఁడ యగు. శక్త్యంశసంభూత స్త్రీయును, శివాంశసంభూతుండు పురుషుండు నగుట శాస్త్రప్రసిద్ధ ముభయులకును జీవత్వదోషముడిగిన శివశక్తు లగుదురు.

నిర్వాణపదము నిచ్చున్
గర్వము లేనట్టిరమణి కపటము వీడున్
సర్వముఁ దెలియంబల్కును
శర్వుంగాఁ జేయుఁ దాను శక్తియ యగుటన్.

నిరంజ—అమాత్యశేఖరా, మీరు విచారించి నిర్ణయింపవలసినకార్యము లెన్నియో కల వని శివదాసిప్పుడే వచ్చి మనవిచేసికొనినాఁడు.

సుదర్శ—(స్వగతము) నన్ను మఱపింపఁ జూచుచున్నాఁడుగా! నేనుమాత్ర మాతనిని మఱపించి త్రోవకుఁ దేలేనా! (ప్రకాశముగ) కుమారా! వచ్చినకార్యము చెప్పమఱచితిని. నేఁటిసూర్యోదయము జయంతాశ్రమమున నుండి సందేశము వచ్చినది.

నిరంజ—ఏమి యది? నాయన గారియాజ్ఞకు సర్వథా బద్ధుఁడను.

సుదర్శ—చిరంజీవిని జూచి చిరకాల మయిన దనియు, నాతనిఁ దోడ్కొని జయంతమునకు నన్నొక్కమాఱు రమ్మనియు రాజశేఖరమహారాజుగారు సందేశ మంపిరి.

నిరంజ—అవశ్యము పోవుదము.

సుదర్శ—ఎవఁడురా అక్కడ? జయంతాశ్రమమునకుఁ బోవుచేర్పాటులు గావింపుమనట్లు శివదాసుగారితోఁ జెప్పుము.

నిరంజ—(మంత్రిగారికి నమస్కరించి) శివదాసుగారితో మాటలాడి యిదే నేను బయలుదేరుచున్నాను. మీరును సిద్ధము కండు.

(అని నిష్క్రమించును. తక్కినవారును నిష్క్రమింతురు. తెరవ్రాలును).

సుదర్శ—(తెరముందునకువచ్చి) రాజశేఖర మహారాజా! నీవె తన్నుఁడవు! రాజ్యముయొక్కయుఁ, కుమారునియొక్కయు క్షేమము విచారించుభారమును బరిపూర్ణముగ నాయందున్నదని నమ్మితివి. ఈకుమారుఁడు నేఁ జెప్పినమాట వినక యెంత విసిగించుచున్నాఁడు. మనసా! ఎంతకాల మహంకరించి యొరుల దిద్ది తీర్పఁ గడంగెదవు? ఎవరి నేమనవచ్చు?

తగ దింక జగము గూడఁగ
వగలం బొగులంగ దగదు వారిన్ వీరిన్
దిగలాగఁగ నెగఁద్రోయఁగఁ
దగదో మనమా గురూక్తిఁ దత్త్వముఁ గనుమా!

నిరంజనకుమారుని గురుసన్నిధానమునకుఁ గొని పోవుచున్నానుగదా! ఇతనితిక్క తీరిచి సమ్యగ్దర్శనంబు గటాక్షింప వారే సమర్థులు. సద్గురుమూర్తీ! నీ బోధామృతపానమహిమంబుననే సుమా, నే జీవించుట.

మాటికిమాటికిన్ గురుని
మాటలె జ్ఞప్తికి వచ్చుచుండెఁ గా
మాటము హెచ్చుకొద్ది యను
మానము లేదు వృథాభిమానమే
సూటిగ నెత్తి కెక్కి మధు
సూదనుభక్తిని నడ్డగించి నా
నాఁటికి బాధపెట్టెడిని
నన్నుఁ గృతార్థునిఁ జేయు దైవమే.

శ్రీమహిళాశివాంజలులఁ
జెల్వగు నీపదపంకజద్వయిన్
రామ! మదీయ మానస
సరస్సునహంసల రాకపోకలన్
నేమము మీఱ నాడునటు
నిల్పినదేశికుఁ దత్పరంపరా
కాముల శాంతిధాముల వి
కారవిదూరుల ధీరులన్ పరం
ధామకళావిశిష్టుల య
థావిధిశిష్టుల ధర్మనిష్ఠులన్
గామము దీర్చి యూర్చుటకు
జ్ఞానవదాన్యుల ధన్యులన్ సుబో
ద్ధాముల రాములన్ గురుల
దాసుల నెమ్మది మాటిమాటికిన్
నీ మురిపెంపుమూర్తు లని
నిశ్చలభక్తిని నమ్మి కొల్చెదన్
పామరపావనా! పరమ
పండితజీవన! జీవధావనా!

(పాటగాఁ బాడవచ్చును)

గురునాథ! గురునాథ! సద్ఘనసుందరగురునాథ!
చిద్ఘనసుందరగురునాథ! (అనుచు నిష్క్రమించును.)

“ పురజనులు కోరినందున ” వేయబడిన నాటకప్రదర్శనము



చూచేటందుకు కన్ను, చేతకు చేయి, ఆలోచనకు బుర్ర, వాదమునకు నోరు ఏలాగో నడకకు కాలు పెట్టినది పేరు. లోకంలో తిట్టేనోరైనా కట్టగలం కాని తిరిగే కాలిని కట్టలేము. నారీమణుల విషయంలో నోరుకూడా కట్టడం బహుకష్టం అనిపించగలదు. అమెరికాలో ప్రబలే అసాధారణప్రజ్ఞ ఏమిటంటే మనుష్యులు బుర్ర క్రిందకి, కాళ్లు పైకి పెట్టి నడవడం అని గిరీశంప్రభువు ప్రకటించాడు. కాలున్నవారి కలాపం యీవిధముగా వుంటే, యిక కాలు లేకపోవడం మనలో అవలక్షణం. ఈలోపం ఏమాత్రం లోకానికి గిట్టదు. కాలు లేకుంటే కష్టమెక్కువ. మెట్లెక్క లేము. మంచం దిగలేము. కన్య వరించదు. కట్నం కూడిరాదు. కాంత కొలువదు సరిగదా కళ్లెర్రచేయును. కసరి కొట్టును. కర్ర చేతనున్ననేమి, కాలిలోటు కాలిలోటే! ఎంత కీర్తిగల్గినా, ధనము సంపాదించినా, తెలివితేటలు పుట్టినా, ఒకకాలు కాలుకాదనే ఆర్యోక్తి కల్లకాదు. ఎప్పటికి అడుగుతీసి అడుగుపెట్టిననే నడక అగుచున్నది. అడుగుతీసి అడుగు పెట్టలేకపోవడం మనకు అనారోగ్యప్రదం.

మనం పుట్టే పుట్టడంతో నడవడం లేదు. మానవుడు అడుగువేయడానికి అందరాని పాట్లు పడినాడు. ప్రాకడంతో మొదలిడినాడు. డేకినాడు. తదుపరి తప్పటడుగులతో తడబడినాడు. అటుపిమ్మట ఆసరా చేసుకొని అడుగెట్టడం ఆరంభించాడు. ఆసరా లేకుండా నడకకు నిలబడినాడు. కడకు అడుగువేయడంలో ఆరితేరినాడు. ఆఖరునకు నడక అలవాటైపోయింది. అవలీలగా అడుగులు వేస్తున్నాడు. నడక సాగుతోంది. గాలిమీద ఆధారపడ్డట్టే కాలిమీద ఆధారపడుతున్నాడు. కాలు కదపడంతో భూమిమీద పడుతోంది అడుగు. ఈఅడుగే పాదంజాడ; చిలిబిలిగా పడుచరణపుగురుతు; కంటికగపడు కాలిముద్ర. ఇది చూదామన్నా నీటిమీద పడదు, నిప్పుమీద పడదు, గగనంమీద పడదు, గాలిలోను పడదు. పంచభూతాల్లో ప్రప్రథమమైన పృథివికీ దీనికీ లంకె—ఏమిటో యీ స్నేహం! అవినాభావసంబంధం! నడకలో నక్కివుంటుంది పాదప్రస్తారం, మనం గొప్ప మార్గదర్శకులం గాకపోయినా!

ఈనడక ఎల్లాజరుగుతోందని ఆలోచిద్దాం. మనస్సులో ముందుగా నడవాలని సంకల్పం కలుగుతుంది. వెంటనే మనస్సు క్షణంలో కాలిమీద అధికారం చూపుతుంది. దానితో ఓకాలు ముందు భూమిమీద పెడతాం. రెండోకాలు మనిషి పడిపోకుండా వెంటనే కాసుకుంటుంది. భూమిని ఆనుకొని ఒకకాలు తీసి ఒకకాలు పెడతాం. రెండుకాళ్లు ఒకేమాటు ఎత్తివెయ్యం; గంతులేతప్ప. అడుగులకు కుడిఎడమ నిష్కర్షగావుంది. ఇక చిన్నపెద్ద అనేభావం నిస్సందేహంగా వుంది. పొట్టిపొడుగు అనేపట్టింపు పూర్ణంగావుంది. లాఘవసన్నం అనేలక్షణం లోటులేకుండావుంది; అది అంతం ఉంది; ముందు వెనక ఉంది. క్రిందు మీదు వుంది. దిక్కు లేదనుకునేరు — దిక్కుంది. నడచిన మార్గాన్ని నిరాఘాటంగా చూపుతాయి అడుగులు. మనం ఆగుతే అవి ఆగుతాయి. మనం సాగుతే అవి సాగుతాయి. మనం తడబడితే అవి తడబడతాయి.

నడకలో మనిషివుద్దేశాన్నిబట్టి, ధృఢసంకల్పాన్నిబట్టి, చేసేపనినిబట్టి, పని జరూరునుబట్టి, ప్రాణాపాయాన్నిబట్టి, సహజంగా వంట్లోవుండే చురుకుదనాన్నిబట్టి, నడిచేప్రదేశాన్నిబట్టి, చుట్టుప్రక్కలనున్న ఆవరణనుబట్టి, స్వలాభాన్నిబట్టి, ఆధారంచేసుకొనివున్న సంఘాన్నిబట్టి, ఆశించేవస్తువునుబట్టి నడకమారుతుంది. నడకతోటే మారునవి అడుగులును. మనలో అడుగుతీసి అడుగుపెట్టకపోవడం అస్వస్థతను తెలియజేస్తుంది. ఇక అడుగులకు మడుగులొత్తుతూ తీసుకొనిపోవడం అరవపేనుసును. ఒకొక్కప్పుడు దీర్ఘాలోచనలోదిగినా, గొప్పతనం అనేది గోరంత

ఆచరించినా, నిద్రావస్థలోనున్నా, ఒళ్లు మరేకారణం చేతనో మరచియున్నా, ఎవరైనా మత్తుమందు చల్లినా, నడుస్తున్నట్టు స్మరించలేని దుస్థితి సంప్రాప్త మవుతుంది. కల్లు, బ్రాంది కైపెక్కినవారి స్థితి యిచట ముచ్చటింప పనిలేదు; మద్యపాన నిషేధసంఘాల దాముచ్చట. మనం నిజంగా అడుగుతీసి అడుగుపెట్టకే కున్నా స్వప్నావస్థలో మెల్లకిమెల్లు నడచివేస్తాం. నిద్ర లోనే లేచి పర్యాయంగా నాలుగుమూలలా తిరగడం ఒకరోగం. జాగ్రదవస్థలో మనంవుంటే, మనమనస్సు కాలిమీద అధికారం చెలాయిస్తేనే కాలుతీసి కాలు పెట్టడం!

నడకలో ఒయ్యారం వుంటుంది. దర్జా, ఠీవి, హొయలు అనేపదాలు నడకకుచెల్లుతాయి. పిఱికితనం తో అడుగులు ముందునకు పడుతున్నా పడవు సరి కదా వెనుకకుతగ్గుతాయి. కోపంతో అడుగులు లొంగు బాటులోనుండవు. ఆందోళనతో వస్తుంది తడబాటు. హాస్యంతో అడుగులు వింతవింతగా మారుతాయి. ప్రేమలో నడక యితరులమీద ఆధారపడుతుంది. వేగంలో అడుగులవడి, శాంతంలో అడుగులనిదానం తెలియగలదు. అంతా నడవకతప్పనపుడు ఎవరినడక వారిదే.

సాధారణంగా నడిచే ప్రతిమనిషికి గమ్య స్థానం బుర్రలో నాటుకొనివుంటుందా అని ఆలో చిస్తే లేకుండా తిరిగేరకం నూటికి తొంభైపాళ్లని రూఢిపరచుకోవలెను. దీని విషయమెటున్నా మనలో కొందరు నడిచేటప్పుడు సమ్మతిని సర్వత్రా చాటుతూ తలలూపుతారు. తలలు ఒరగవేస్తారు, లోకంలో మనం మోతహాలికి లొంగించకుండా భారం మోయాలని. నడ కంటే విచారిస్తారు; తలలు వాలుస్తారు. తలవంపు లెందుకని తలలెత్తుకుంటేగాని కాళ్లాడవు కొందరికి. నడకంటే కొందరికి బ్రహ్మానందం; బుజాలు బాగా ఎగరవేస్తారు. నడకంటే భయపడేవారున్నారు; వారు వంగి నడుస్తారు. అణకువ అలవరచుకొందురు కొందరు. నిగ్రహింపనూట జ్ఞప్తికి తెచ్చుకొని, అడుగుపెడితే ఏ పాతాళానికి పాచిక పారుతుందో అని వణికిపడతారు మరికొందరు. జీవితకాలం తక్కువ, చేయ వలసినచేత ఎక్కువ అనే భావంతో తిని తిరిగిన రెండు ఘడియలు విసవిస కాళ్లు విరగ ద్రొక్కు కుంటారు కొందరు. అంతా భగవత్ప్రీత్యం లేకుంటే మనముఖం, మనం అడుగుతీసి అడుగు పెట్టడమే అని నడకను విధిక్రింద భావించేవారుకలరు. గాలిలో పక్షులు రెక్కలువిరుచుకొని ఎగరడంలేదా మనకేమని ముందుకు విరగబడేవారున్నారు. ధమిధమిఅనే ధ్వని అయ్యేట్టు నడిచేవారు, భూదేవిని అదరగొట్టేవారు వున్నారు. కాలు భూమిమీద పూర్ణంగామోపుతే ఏపామో పట్టుకుపీకుతుందని ఎత్తుడుకాళ్లు వేసేవారు న్నారు. మడిమమాత్రం అరిగేట్టు అదిమి నడుస్తారు కొందరు. నడకంటే లావాంటివారు లెంపలువేసు కుంటారు. వ్యాయామసంఘాభిమాని గడకర్రలా ఛాతీ ముందునకుపెట్టి నడవాలంటాడు. మనలో దొడ్డి కాళ్లను సరిజేసుకొనెడి నడకగలదు. సవారీబోయీలవలె వెర్రికేకలేసే నడకగలదు. క్రమశిక్షణపొందిన రక్షక భటునివలె లెఫ్‌ట్ రైట్ వేసే నడకగలదు. ఇట్లు నడక ఒకవిధమా? కర్రపూతంజేసిన నడక. కళ్లునెత్తిమీదకొచ్చిన నడక. కాళ్లు విరగద్రొక్కుకొని నడక. ఎవరిలో వారు మాటాడుతూ నడక. కూనురాగం కొంతతీస్తూ నడక. త్యాగయ్యకృతికి తాళంవేస్తూ నడక. మెఱుపు తీగలా మెలికలు తిరుగుతూ నడక. పిరుదులుత్రిప్పుతూ నడక. పిలకలువూగుతూ నడక. పమిటెలుజారుతూనడక. జుట్టుముడివీడుతూ నడక. జబ్బజాడించి జవానులానడక, గజ్జలు ఘల్లుఘల్లుమనిపించేనడక. కంకణాలు గణగణ మనిపించేనడక. పొట్టేలులా తలవంచుకునడక-యిట్టివి. తర్వాత తిమింగిలంలా యీదేవారు, పిట్టలాఎగిరేవారు, పందిలాపారాడేవారు, లేడిలాపరుగెత్తేవారు, పాములా జరజర ప్రాకేవారుకూడావున్నారు. కుదేసిన గుమ్మడి కాయలా దొర్లేవారున్నారు. నడక నరుడొక్కడి సొమ్ముకాదు, ముండాదేవుడు గుర్రపునడకనీ ఎద్దు నడకనీ, పిల్లినడకనీ, తాబేటినడకనీ, కూర్చాడని కొందరికోపం. వాటినిచూచి బాగా అభినయించే టందుకే యీనడక లేర్పడినవంటాడు నటకుడు. పైగా

కాలాన్నిబట్టి నడక మారుతుంది. వానాకాలపునడక వినేవుంటారు, చూడకపోయినా. పెళ్లిళ్లతో బయలుదేరాయి పెళ్లివారినడకలు. నడకలో వికృతాలు చాలా వున్నాయనికాబోలు మనపూర్వులు ఎన్నో క్రియలను ముందే కల్పించారు. డేకడం, ప్రాకడం, ఎగరడం, పరుగెత్తడం, ఉరకడం, జారడం, దొర్లడంలాటివి గతిరూపాలు. ఇంతకు నడక ముఖ్యంగా ఎందుకిచ్చాడు దేవుడంటే వాహనయోగం జాతకంలో పట్టనివారిని రక్షించేటందుకని నమ్మకతప్పదు. ఎంతయోగమున్నా నడవందే పనిజరుగదు యీమాయప్రపంచంలో.

మన నాగరికంతో నడక మూలపడింది. పూర్వం కాలినడకతో కాశీ అందేది, ఏకాటికో ఓకాటికి. లేకుంటే కైలాసం తప్పకుండా అందేది. ఇప్పుడు అడుగడుగునకు కారే కైలాసం, కాని క్రోసెడుమారం అందుబాటువడం సందేహం. విమానం వున్నా వియనా అందడం అనుమానం. కాని రామమోహనుని రైలెక్కితే రామేశ్వరయాత్ర నిజమని రవ్వంత స్వానుభవమున్న ముదుసలి తెలుపుతుంది. అంటే యిప్పటికి పూర్వానికి గొప్ప మార్పు ఏమిటంటే అడుగుతీసి అడుగు భూమిమీద, ఒట్టేసినట్టు, పెట్టకపోవడమే. అడుగు కదుపుతేనేగాని అనుకొనినచోటు చేరలేకపోవడం పూర్వపు దుస్థితి; అడుగు కదపకుండా గమ్యస్థానం చేరడం యిప్పటి ఆశయం. విజ్ఞానం యిచ్చివేసింది దీనికి తగిన యంత్రసహాయం. దీనికి తోడైంది మనోబలం, బుద్ధిబలం. కాని దైవికంగాకూడా అడుగుతీసి అడుగు పెట్టకుండా కైలాసగిరి నందుకోడానికి మార్గాన్వేషణ చేసి శాస్త్రకారుడు ఓ తాయిలం కనిపెట్టి నడిబజారులో పడవేస్తే నయమే. కాని దైవికంమాట అంటే యీ రోజుల్లో వినేవారుండరని ముందునుంచి అనబోకండి. ఐతే పూర్వులు నడకబిగిని నాలుగుదేశాలు చూచేవారు; యాత్రలకీ యాగాలకీ ఎగడేవారు. మనం మాత్రం యీ యుగంలో ఏమి తీసిపోయామా?

నడవడంతో అడుగులు పడతాయన్నాం. అడుగుల మహిమ కొంత స్మరిద్దాం. దేవలోకంకేసి దృష్టి త్రిప్పుదాం. విష్ణుపాదాలు ముందు అగపడక మానవు. శ్రీరాముని 'పద్మరేఖలుగల్గు పదయుగంబులవాడు' అన్నారు. వాటిని సేవిద్దాం. ఎందుకంటే పాదములకు ప్రణమిల్లడం మనలో మన్నన. ఇంకా రామాయణంలో పాదుకాపట్టాభిషేకం వుండనేవుంది. పాదసేవ దైవపరంగా అపారమైన భక్తి; యిహంగా అదే దాస్యమనిపించుకుంటుంది. పాదాల మహత్తు వేరొకచో 'హరిపాదరజమున నొకఱాతి బడతిజేసెనట' అని వ్రాయబడినది. ఇంతటి ప్రభావంవున్న హరి ఓ ప్రదాతను వెదకి, విజ్ఞాపన పూర్వకంగా రెండు చేతులు నులుముకుంటు ఆశ్రయించాడు.

ఏమని?

ఒంటివాడ నాకు నొకటిరెండడుగుల
మేర యిమ్ము సొమ్ము మేరయొల్ల
గోర్కిదీర బ్రహ్మ కూకటి ముట్టెద
దానకుతుకసాంద్ర దానవేంద్ర.

అని ఇందలి కిటుకు ప్రదాత బుర్ర కందలేదు. అదెంతపని అనడంతో కొంపలంటుకున్నాయి. చిన్న అడుగులనుకునేసరికి చచ్చేటంత పనిజరిగింది. చరిత్ర మారింది.

సూనృతంబుగాని సుడియగు నాజిహ్వ
బొంకజాల నాకు బొంకులేదు
నీ తృతీయపదము నిజము నాశిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ.

అనిప్రార్థించవలసిన స్థితికి వచ్చింది. దేవుడంతవాడు అడుగులకిట అల్లలాడడం చిత్రంగానేవుంది. ఈహరి చిన్నప్పుడుమాత్రం కాళ్లని తిన్నగా వుంచుకొన్నాడా?

శకటము హరిదన్నిన దివి
బ్రకటంబై యెగసి యిరుసు భరమున గండ్లన్
వికటంబుగ నేలంబడె
నకటాయని గోపబృంద మాశ్చర్యపడన్.

ఎంతగొప్ప ఆక్సిడెంటు! కొంతకాలమునకే యీహరే యింకోచోట.

పద్మరాగాది రత్న ప్రభాసమాన
మహిత కాళియఫణిఫణామండపమున
నళినలోచన విఖ్యాతనర్తకుండు
నిత్యమై పుణ్యమున చేర్చినృత్యమాడె.

అన్నంతపని చేసినాడు. పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటమన్నట్టులైంది. ఇట్టి నూపురప్రభ నాలుగు మూలల దేదీప్యమానంగా వెలిగిపోయింది. కాని యింతటి త్రిలోకమూర్తి అనబడేవానిగతి వేరొకసమయంలో చూస్తే మనం హర్షించం. ఎంతమంచి గొల్లకైనా నిమ్మకాయంత వెర్రి లేకపోదనిపించగలదు.

'జలజాతాసన......శిరమచ్చో వామపాదం బునం దొలగంద్రోచె లతాంగి' అంటే ఎంతగుండె నిబ్బరమైనవారికి గుండె చెరువుగాకమానదు. కాని తగిన శాస్తి కావలసినదే, నడతమంచిదికానపుడు!

ఇక కవులంటారా ?

'పాదముల కంబుజము చెల్లుబడగు, నడకు
దనరు మత్తేభ విక్రీడితంబు సెల్లు'

అని వ్రాయగలరు.

'ప్రతిఘటించు చిగుళ్లపై
నెఱ్ఱవాతెనరీతినున్నవి వీని మృదుపదములు'

అని వ్రాసిరి.

'నడువ నేరనికొమ్మ యడుగులు పొక్కులై
శర్కరస్థలముల శ్రమము జెందె'

అని వ్రాయగలిగిరి. కొంత వేదాంతం అలవడినవారు

'వేదవేదాంతముల వేధ వెదకి కనని
పద్మలోచను శ్రీపాదపంకరుహము'

అని వ్రాయుదురు. కొంచెం శృంగారంగా పోనిస్తే

'అటరెండు మూడంజ లరుగునప్పుడు కాళ్ల
బంకజాక్షికి దొట్రుపాటు గనిరె' అంటారు.

ఇంకా వ్యాపారము ముదురుతే :

'మందయాన లనంగ మానైన యమ్మాట
నిక్కంబుగా మాంద్య మెక్క నడల' అనవలసి వస్తుంది. వీరి అడుగులు పట్టుకొని దేవులాడేది విమర్శకులు! ఇక సిద్ధుడిగొడవ ఒక మూల ప్రబలంగా వినబడుతోంది; అతడు వాడినది పాదలేపనం. అదే దివ్యౌషధపురసం. ఈశ్వరుని కృపవలన కలిగిందన్నారు. దానితో,

దివి బిసరుహ బాంధవ సైం
ధవ సంఘంబెంత దవ్వు దగ లేకరుగక
భువినంత దవ్వునే మును
శవశవలే కరుగుదుము హుటాహుటి నడలన్.

అని ఎంతసేపు తన ప్రభావాన్ని చెళ్లబోసుకున్నాడు. మనం ఆనందించాం. విదేశాలుతిరిగాడు సిద్ధుడు; కాని యిరోపులైతే తెలిసేదిపస. ముందు డబ్బియ్యకపోతే మొదలు దోనెక్కనియ్యరని ఎరుగడు. పోనిండు.

ఇటుపైన నాటకరంగంలో అడుగిడుదాం. పాత్రపోషణకుగాను అడుగులను బాగాగమనించాలి. వెనుక కాళ్లులేనివాడు నాట్యంచేస్తే, కళ్లులేనివాడు చూచి ఆనందించాడట! ఇప్పుడు గొంతుకెత్తి సంగీతం పాడి ప్రేక్షకులమెప్పించడం కాళ్లులేనివాని నటనవంటిది; వీనులకు వినబడే సంగీతం నటన అనుకోడం అంధుని ఆనందంవంటిదే. నాట్యాభినయాలకు అడుగులు ముఖ్యంగా గమనించాలి. నాట్యంలో భేదాలున్నాయి. పాదక్రమభేదములు చాలాగలవు, వర్ణభేదాలవలె! రసాభినయం, అర్థాభినయం లోటుపరచి చేయుఅభినయం అధమం. ఇప్పటి ఆంధ్రనాటకరంగంలోని అడుగులు కేవలం తప్పటడుగులు. తెరలెత్తిదించుటతో తెల్లవారుచున్నది. పాత్రధారులు పాదాలను పరికించాలి; పాత్రకు పునర్జీవంపొయ్యాలి.

ప్రక్కనున్న చైనాదేశములో కాళ్లను యినుపపెట్టెలోపెట్టి బిగించి చిన్నకాళ్లుచేసుకోడం ఆచారం. వ్యభిచారం దానిమూలాన్ని తగ్గుతుందని వారి అభిప్రాయం. మన హిందూదేశంలో శ్రీశంకరాచార్యుల వారికి సనందనులనే శిష్యులుండేవారు. వారు పద్మపాదులనే బిరుదం సంపాదించారు. కాలినడకను గురునామస్మరణ గావించుచు గంగను దాటగల్గిరట! అందు

చేతే యిప్పటికి శ్రీశంకరాచార్యులవారంటే పాద పూజచేసి నెత్తిని నీళ్లుచల్లుకొంటున్నాం.

మాకు యీ వింత క్రొత్త కాదన్నారు క్రైస్తవులు.

'And in the fourth watch of the **night Gesus went unto them walking on the sea.'**

వారి బోధమాటటుండగా జైన మతస్థులు శ్వేతాంబరులనీ, దిగంబరులనీ చీలిపోయారు. క్రొత్త పాదములనుంచి పార్శ్వనాథ దేవాలయంలో పూజించడం విషయంలో పట్టింపులకు పోయి ప్రీవీకౌన్సిల్ దాక పరుగులెత్తారు. ఇదిమాత్రం సముద్రం దాటడం కాదాలని. ఆమాటకువస్తే హనుమంతుడుమాత్రం సామాన్యుడా!

మనిషికే కాదు నడక గ్రహాలకు వుంది. గ్రహాలకు గతులున్నాయన్నారు. వక్రగతనీ, ఋజుగతనీ, వికలగతనీ, మందగతియనీ, శీఘ్రగతనీ, అథోగతనీ సిద్ధాంతిగారు చెప్పేసరికి మనకు సండేలు కొట్టుకోగలవు. అడుగు కదపనిది, పాపం, ఒక్క సూర్యుడే— వాడి గ్రహచారం! ఇక మిగతా గ్రహాలన్నీ వెనకాల జారవిడిచే అడుగులే కక్ష్యాన్వృత్తాలంటాం. జ్యోతిషం గ్రహగతికి మనిషిమతికి పెట్టింది ముడి!

ఇక పాదాలవిషయం లెక్కిద్దాం. ఏకపాదం మనము నడిచెడిబాట. పాదాలు మనిషికి రెండు; పక్షికీ రెండు. పద్యభేదానికి ద్విపద అంటాం. కవిగారికి లెక్కడు పాదాలున్నాయి. చతుష్పాదాలు జంతువులు. పాదంఅంటే నక్షత్రప్రమాణంలో నాలుగో వంతంటారు సిద్ధాంతిగారు. తుమ్మెదని మనం షట్పదం అంటాం. సప్తపదిఅనేది పెళ్లిలో హిందువులువేసే ఏడు తప్పటడుగులట. అష్టాపదమంటే సాలిపురుగు స్ఫురణకు వస్తుంది; తప్పితే చదరంగపుబల్ల తెమ్మంటాం. అదే అష్టపదిఅంటే జయదేవునిదికదా అంటాం. శతపది జెఱ్ఱి. సహస్రపాదుడన సూర్యునికి చెల్లినది. విష్ణువునకు విలువ హెచ్చింది. కాని వీటన్నిటిని మించింది మఱ్ఱిచెట్టు. ఏలనందురా? దానికి బహుపాదం అనే పేరుంది. ఇంతతో పాదప్రశంస చాలిద్దాం.

నేర పరిశోధనలలో అబ్బితే సిగ, అబ్బకపోతే కాళ్లు పట్టుకోవాలి. శిగ దొంగ, అందనివ్వడు. అందుచేత అడుగులుపట్టుకొని దేవులాడాలి. అడుగుత్రొక్కినపుడు, కాలుకడిగినపుడు, ఇసుకనేలను నడచినపుడు, రాగిడిమన్ను మట్టినపుడు, బుగ్గిలో పాదం పెట్టినపుడు, దుమ్మురేగినదారిని దౌడుతీసినపుడు, పూడవని కొంపలో కాలిడినపుడు కాలిముద్రపడుతుంది. రాజబాటను ఒంటరిగానేగినది, యిరువురుముగ్గురు కలసికొన్నది, గుఱ్ఱముమీద గాలపుచేసినది, ఏనుగెక్కినది, దేనినైనా తరుముకొనివెళ్లింది, కుక్కనుకూడా లాక్కెళ్లింది, దారిలో ఆగి మాటాడింది, కాళ్లీడుస్తూ అడుగులేసింది తెలిసికోవచ్చును. బండిచక్రపు గురుతులు బాగా పరికింపవచ్చును. సుడాన్ దేశంలో ఒంటెల దొంగతనం సామాన్యంగా జరుగుచుండునట. అచట ఒంటెగిట్టలను బట్టియు, మనిషి అడుగులనుబట్టియు దొంగను గుర్తించు నిపుణులున్నారు. కాపూరుతలమహారాజుగారి రాజ్యంలో కోజీలున్నారు. వారు అడుగులను మనిషి ముఖమును పోల్చినట్టు పోల్చగల ప్రవీణులు. ఈకోజీలను రక్షణశాఖలో జేర్చిన నేర పరిశోధన పెంపొందును. మనము తొడుగుకొనినచెప్పులు ప్రాతవా, జోడునకు అడుగున మేకులున్నవా, పాదరక్షల చుట్టుకొలత ఎంత, జోడునకు బాగులున్నవా అనేవిషయం పరీక్షించాలి. అడుగులను గమనించాలి. రక్షణశాఖకు అడుగులగుర్తించెడి గట్టితనముండవలయును. ప్రస్తుతము మన దేశములో అడుగులవిషయమై క్రమశిక్షణ సరిగా నొసగబడుటలేదని వేరుగచెప్పపనిలేదు. వీనికే ప్రత్యేకం పాఠశాలలుండవలయును. పాదములగుర్తించి పరీక్షలు గావింపవలయును. లేకున్న నేరములదొకదిక్కు, అడుగులదొకదిక్కు, నేరగానిదొకదిక్కు, నేర పరిశోధనదొకదిక్కు అగును. ఇట్టి దుస్థితితొలగుగాక! సరియగు నడకకు సమయమురానున్నదేమో!

---

# వ్రాత

బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం

ఆ వేళ వచ్చిన మనిషిని నేను మొదటిసారి చూసినప్పుడు అంత జాగ్రత్తగా పరీక్ష చెయ్యలేదు. నా బెంగాలీ స్నేహితుడూ, అతని చెల్లెలూ, నేనూ వసారాలో కూర్చుని మాట్లాడుతుండగా వర్షంలో తడిసి ఖంపువాత్తో తల తుడుచుకుంటూ మెట్లెక్కేడాయన. గొడుగైనా తెచ్చుకోలేదు. వెంటనే ప్రమోద్ లేచి "ఇప్పుడే వస్తా"నని మాతో చెప్పి ఆయనతో లోపలిగదిలోకి వెళ్ళిపోయాడు. వాళ్ళిద్దరూ లోపలికి వెళ్తుంటే అమీయాదృష్టీ, ధ్యానం అంతా ఆ మనిషి మీదనే నిలిచాయి. నేను మట్టుకు అమీయాముఖమే చూస్తూ కూర్చున్నాను. అప్పుడు అమీయా "ఆయన్ని సరిగ్గా చూసేవా?" అనడిగింది నన్ను. "చూడలే"దని సమాధానం చెప్పేను...... నేనా రోజులలో అమీయాని తప్ప మిగిలినవాళ్ళని ఇష్టంగా సహించగలిగే స్థితిలో లేను. డార్జిలింగ్‌లో ఈ అన్ననీ, చెల్లెల్నీ చూసినప్పటినుంచీ లోకం యొక్క సాధారణసమస్యలు నాకు అర్థం కావడం మానేసేయి. మనస్సుకంతటికీ ఒకటే ఉద్దేశ్యం, హృదయానికంతటికీ ఒకటే కోరిక. జీవితానికంతటికీ ఒకటే నిరాశ.........

ఆయన ఇల్లువదిలేటప్పుడైనా ఆయనకేసి పరీక్షగా చూడమంది అమీయా.



"అమీయా 'ఆయన్ని సరిగ్గా చూసేవా?' అనడిగింది నన్ను"

"ఆమనిషిజోలి నాకెందుకుకాని, ఇప్పుడైనా... ఆవిషయంగురించి మనస్సుమార్చుకోవా?" అని దీనంగా ప్రశ్నించాను. నామాటకి జవాబులేదు. కాసేపు అమీ యామీ మాట్లాడకుండా పరధ్యానంగా ఉండేసరికి నే నిన్నాళ్లూ మిడ్నపూర్ లో వాళ్లింట్లోఉండడంవల్ల కొద్దో గొప్పో లాభం కలుగుతోందికాని లేకపోలే దనుకున్నాను.

చటుక్కున నాకేసి తిరిగి, "ఈపెద్ద మనిషి ప్రమోద్ ని ఏదోగొప్పకుట్రలో దింపుతున్నాడని నాఉద్దేశ్యం" అంది. నేను కొంత సేపటివరకూ బోధపరచుకోలేకపోయాను.

అప్పుడు నెమ్మదిగా సర్దుకుని, "ఎటువంటి కుట్రని నీఅనుమానం?" అనడిగేను.

"పైకి జ్యోతిష్కుడనని చెప్తాడుకాని..."

"జ్యోతిష్కుడా?"

"అసలు రహస్యసంఘానికి దేనికో ప్రమోద్ ని సభ్యుడుగా చేసేందుకు ప్రయత్నిస్తున్నా డనుకుంటాను."

"రహస్యసంఘమా? ఖద్దరుబట్టలైనా కట్టుకున్నట్టులేదే ఆయన."

"ఖద్దరికీ ఈరహస్య సంఘాలకీ ఏమీ సంబంధంలేదు. కాని ఎందుకు నీకీ అనుమానం కలుగుతూందో చెప్తావా? ఆయన ఇంటి కెప్పుడొచ్చినా సంభాషణంతా గుసగుసలలోనే. వచ్చినమొదటిసారి ప్రమోద్ ఆయనతో ఇంట్లోవాళ్లందరికీ పరిచయం కలిపేడుకాని తర్వాత ఎప్పుడొచ్చినా మావైపు చూడనేచూడడు; ఆయనగురించిమాతో ఏమీ మాట్లాడడు. నేనప్పుడప్పుడడిగితే, 'అతని మాటకేం లే! పిచ్చి జ్యోతిష్కుం చెప్తా'డని ఏదో మాటమార్చి మరిపించేస్తాడు. ఇదంతా చూస్తుంటే నిజానికి నాకు కొంచెం భయంగా ఉంది."

"ఆడవాళ్ల కన్నీ భయాలే" అని నేనన బోతుంటే ప్రమోద్ ఆయనతో సావిట్లో కొచ్చేసేడు. ఈరహస్యసంఘోద్యోగిని తీక్షణంగా పరీక్షచేద్దాం అనుకునేసరికి మొఖం నాకు కనపడకుండా తిప్పేసి ప్రమోద్ తో మాట్లాడడం మొదలెట్టేడు.

"నేను చెప్పినతారీఖువరకూ ఆకాగితం విప్పనని నువ్వు వాగ్దానం చేసేవుసుమా" అన్నా డాయన.

"తప్పకుండా నేనంతవరకూ విప్పనని నీకు మాటిచ్చాను కాదూ?" అని ప్రమోద్ సమాధానం చెప్పేడు.

ప్రమోద్ కి నమస్కారంచేసి ఆయన వెళ్లిపోతుంటే ప్రమోద్ "వర్షంగాఉంది. గొడుగిస్తా నుండ" మని లోపలికి వెళ్లబోయాడు. "పరవాలే"దంటూ ఆపెద్దమనిషితలమీద ఖండువా కప్పకుని వర్షంలోకి దిగి వెళ్లిపోయాడు. ఆఖరికి నేనాయన్ని సరిగా చూడనేలేదు.

ప్రమోద్ మళ్లీవచ్చి మాతో కూర్చున్నాడు. ఒకనిముషం అన్నా చెల్లెలూ ఒకరి నొకరు దృష్టితిప్పకుండా చూసుకున్నారు.

ప్రమోద్ నాకేసి తిరిగి "నీకు జ్యోతిషంలో ఏమైనా నమ్మకం ఉందా?" అనడిగేడు.

"నాకు జ్యోతిష్కులలో కొంచెం నమ్మకం ఉందేమో కాని, జ్యోతిష్కులలో నమ్మకం లే"దన్నాను.

ప్రమోద్ నవ్వేడు. "నాకూ జ్యోతిషికులలో నమ్మకం లేదు కాని, ఇప్పుడు వెళ్ళిపోయిన స్నేహితుడు నాకు జ్యోతిషంలో పూర్తిగా నమ్మకం కుదిరేటట్టు చెయ్యాలని పంతం పట్టేడు...... ఏమిటి జరుగుతుందో చూడాలి."

అమీయా, అందుకుంది. "నువ్వు చెప్పననిమాటిచ్చిన కాగితం ఆ సందర్భంలో నేనా?"

"అవును."

"ఏమిటది?"

"నాకూ తెలియదు."

"ఎన్నాళ్ళలో విప్పొచ్చు నా కాగితం?"

"పదిరోజుల్లో. వచ్చే ౧౫-వ తారీఖున సాయంత్రం ఆరుదాటేక. విప్పి చదవగానే జ్యోతిషంలో నమ్మకం కలుగుతుందట."

"అయితే ఈవాళే విప్పిచూడకూడదూ?"

"ఆడవాళ్ళ కన్నీ అలాంటి బుద్ధులే... అమీయా, నేనా రోజువరకూ విప్పనని మాటివ్వడం నువ్వు కూడా విన్నావు కా!"

"పరవాలేదులే. ఇక్కడ మేమిద్దరం మరెవరితోనూ చెప్పంలే."

"అదే కాదు. ఆ కాగితంలో వ్రాయబడినది ఈ పదిరోజులలోపునా జరిగే అనుకోని చర్యొకటి. ఇప్పుడే చూసేస్తే దానిలో తమాషా అంతా పోతుంది."

"నిజంగా నీ స్నేహితుడు గొప్ప జ్యోతిషికుడా?" అనడిగేను నేను.

"జ్యోతిషికం చెప్తూ ఉంటాడు కాని, అంత గొప్ప జ్యోతిషికుడని నేనింతవరకూ చెప్పలేను. ఈ ఊళ్లో చాలామందికి అతనంటే చాలా నమ్మకం. మనవాళ్ళకే కాదు, దొరలకి కూడాను. ఆరునెలల కిందట పోలీసులో ఒక దొరుండేవాడు. పెళ్లానికీ తనకీ పడేది కాదట. రమేష్—అంటే నా స్నేహితుడిని పిలిచి 'ఈ పెళ్లానికి విడాకులిచ్చి మరొక మంచిపిల్లని ఎప్పుడైనా పెళ్లాడుతానా లేదా' చెప్పమన్నాడట. ఆ పెళ్లాన్ని విడిపించుకుంటాడనీ, మళ్లీ పెళ్లి చేసుకుంటాడనీ రమేష్ చెప్పేడట. అలా, చెప్పినట్టే, చెప్పిన వేళలకే ఆ ఉద్యోగికి అన్నీ జరిగేయని రమేష్ చెప్తాడు... ఇప్పుడు మన జిల్లా కలెక్టర్ కూడా జ్యోతిషంలో నమ్మకం ఉన్నవాడే. లేకపోలేదు. వారం రోజుల కిందటే రమేష్‌ని పిలిపించాడు. రమేష్ ఆయన చక్రం వేసి పరీక్ష చేసేడు కూడాను."

"ఈ దొరలకి కూడా ఈ పిచ్చి నమ్మకాలేమిటో?" అంది అమీయా.

"మనవాళ్ల కంటే కూడా వాళ్లకే ఎక్కువ నమ్మకం." అన్నాడు ప్రమోద్.

"నమ్మకం లేకపోయినా కుతూహలం వాళ్లకి చాలా ఉంటుం"దన్నాను నేను.

ఆతర్వాత చీకటిపడేవరకూకూడా ముగ్గురం ఏవేవో మాట్లాడేం కాని జ్యోతిషం మీద ప్రశంస మళ్లీ రాలేదు. నేను అమీయాని 'నన్నెందుకు పెళ్లి చేసుకోనంటూ'వని మళ్లీ అడగనూలేదు............

ఈసంభాషణ జరిగిన వారంరోజులకి సరిగా ప్రమోద్ ఇంట్లో అతని స్నేహితుడిని మరొకడిని చూసేను. ఆస్నేహితుడిని చూడగానే ఎందువల్లనోకాని అతనంటే నాకు అసహ్యంకలిగింది. ఆరోజున అతనిచర్యలు మరీచూచినకొలంది అసలే నచ్చలేదామనిషి నాకు. తెలివితక్కువ హాస్యాలుచెప్పి ముందు తనే గట్టిగా నవ్వడం ప్రారంభించేవాడు. మిగిలినవాళ్లందరూ నేనున్నానని ఇంగ్లీషు లోమాట్లాడుతుంటే, తనుమట్టుకు బెంగాలీ లోనే మాట్లాడుతూ, చివరకి "ఓహో, మన మద్రాసీస్నేహితు డిక్కడున్నాడన్నమాట మరచిపోతున్నా"నంటూ నాకేసి తిరిగి వేళాకోళంగా చూసేవాడు. తర్వాత అమీయాని ప్రమోద్ వాళ్ల తల్లి అక్కడుండగానే, చనువుగా వీపుమీద గుద్దుతూ జుట్టుపట్టుకు లాగుతూ హింసించేవాడు. అమీయా అప్పుడప్పుడతనికేసి కోపంగా చూస్తూఉన్నా మొత్తానికి అతని కాచనువంతా ఇష్టంగానే ఇస్తున్నట్టు నాకు కనిపించింది. ముందర వీళ్లకి తనేమైనా దగ్గిరచుట్టం ఏమో అనుకున్నాను. కానే వయాక మాటలలో చుట్టంకాదని తెలిసింది. చిన్నప్పటినుంచి కుటుంబస్నేహితుడు. కొన్నేళ్లు చదువుకున్నాడు. కాని పెద్దపరీక్ష లేవీ పాసవలేదు. చిన్ననాటిబట్టీ అమీయా అంటే ఇతనికి చాలాప్రేమ. కాని రెండేళ్లకింద అమీయా నితను పెళ్లిచేసుకోమనడిగితే ఇతనికి చదువూ ఉద్యోగం లేకపోవడంచూసి "నిన్ను పెళ్లిచేసుకున్నాక పోషించమని మరెవరిని వెళ్లి బతిమాలుకోమంటావో కూడా చెప్ప"మని సమాధానం చెప్పిందట. ఈ విషయాలేమీ దాచకుండా అత[illegible]రుగుండానే చూస్తున్న మొదటిసారే వాళ్లంతా నాకు చెప్పేరు. అమీయా చెప్పడంలో ఏమీ సిగ్గుపడలేదు. అమీయా ఒప్పుకోలేదన్న చింతకూడా ఆమనిషి కంతున్నట్టు నాకు తోచలేదు. ఎన్నేళ్లు బతికినా ఇతను నవ్వులాడుతూ వేళాకోళాలు చేస్తూ కాలంగడుపుతాడు కాని ఏవిషయంలోనూ దీక్షా శ్రద్ధా పట్టుదలా ఇతని కెన్నడూ ఉండవని నాలోనే ననుకొని ఊరుకున్నాను.

మాటల సందర్భంలో మౌనంగా ఉండడం నచ్చక ఆఖరికి "మీ రిప్పుడేం చేస్తున్నా"రని నేనడిగితే నాకేసి అతికోపంగా చూసేడతను. నాతోపాటు అమీయా గ్రహించి, తప్పంతా నా ఒక్కడిదే కాకుండా ఉండేందుకు, "నలిన్, నువ్విప్పు డేం చేస్తున్నావో మాకందరికీ చెప్పకూడదా ఏమిటి?" అంది.

"నే నేమీ ఉద్యోగం చెయ్యడం లేదని నీకు తెలుసునుకదా. నన్నెందు కింకా ప్రశ్నలడగడం?" అన్నాడు నలిన్.

అమీయా దానికి జవాబు చెప్పింది. "నువ్వేంచేస్తున్నావని మేము అడిగితే, నువ్వే ఉద్యోగం చేస్తున్నావు, ఎంతడబ్బు సంపాదిస్తున్నావని కాదు మాప్రశ్న; మనిషి జన్మెత్తేక అనేకమైన పనులుచేస్తూ ఉండొచ్చును. ఉద్యోగాలే కాదు, పద్యాలువ్రాస్తూ ఉండొచ్చును. రహస్యసంఘాలలో జేరి కుట్రలు పన్నుతూ ఉండొచ్చును. ఇటువంటిదేమైనా చేస్తున్నావా అని మాప్రశ్న."

"నిజమేకాని, నువ్వుచెప్పినదాంట్లో... కాని నాకుమట్టుకేం తెలుస్తుం"దన్నాడు.

"అదుగో, అదుగో, మాటమింగెయ్యకు. నువ్వేదో సంఘంలో జేరేవు."

"అమీయాకి అందరూ రహస్యసంఘాలలో దిగుతున్నారన్న పిచ్చి పట్టుకుందేమిటా!" అనుకున్నాను.

"నిజంగానే, అమీయా. నేను జేరే" నన్నాడు నలిన్ నవ్వుతూ.

"ఈరహస్య సంఘాలగురించి నీకెవరు చెప్పేరు?" అనడిగేడు నలిన్.

"నాకు తెలియదనుకున్నావా? నాకంతా తెలుసును. నువ్వీమధ్య అటువంటి సంఘంలో చేరేవని కూడా నాకు తెలుసును."

అమీయా తల్లి ఇంతట్లో ఈరహస్యసంఘాలనేపనిమీద బోధపరచమనడిగింది. ప్రమోద్ కొంతసేపూ అమీయా కొంతవరకు బోధపరచి చటుక్కున నలిన్ కేసితిరిగి, "ఏమీ, నలిన్, అంతేకాదూ?" అనడిగింది.




" అమీయా నలిన్ దగ్గరకి పరుగెత్తి

"నేను నమ్మననుకుంటున్నావు కాని నీ చర్యలన్నీ నేనూ జాగ్రత్తగా చూస్తున్నాను సుమా" అంది అమీనా, "చడీచప్పుడూ లేకుండా మాటమాటకీ ఊరొదిలేస్తూ ఉండడం, ఊళ్లో లేనట్టు ఎవరికీ తెలియనివ్వొద్దని ప్రమోద్‌ని బతిమాలుకోవడం, నన్నడగకుండా నా రసాయనశాస్త్ర పుస్తకాలు పట్టుకుపోతూ ఉండడం అంతా నేనూ కనిపెడ్తూఉన్నాను."

"అంతా బాగానే ఉందికాని, పోలీసు వాళ్లకీ రహస్యం ఊదెయ్యకుసుమా. నా కొంపముంచేస్తావు." అని నవ్వేసేడు నలిన్.

ఇంతట్లో ప్రమోద్ నలిన్‌తో జ్యోతిషంగురించి మాట్లాడడం మొదలెట్టేడు. 'చెల్లెలికి రహస్యసంఘాలూ, అన్నకి జ్యోతిష్యం—బాగానే ఉంది వేలంవెర్రి.' అనుకున్నాను. ప్రమోద్ జ్యోతిషంగురించి మాట్లాడని రోజులేదు. నాకు రోజులు గడిచిన కొలదీ విసుగెత్తుకొచ్చింది.



[illegible]

"రమేష్ నాకు జ్యోతిషంలో స్థిరంగా నమ్మకం కలిగేటట్టు చేస్తానని వ్రతం పట్టేడు, తెలుసునా?" అన్నాడు ప్రమోద్.

"ఎలా కలిగిస్తాడేమిటి?" అనడిగేడు నలిన్.

"నా కొక కాగితం జాగ్రత్తగా మడిచి మూడువైపులా అంటించేసి ఇచ్చేడు. ౧౯-వ తారీఖున నే నది విప్పాలట. విప్పి, అందులో ఉన్న వ్రాత చదవగానే జ్యోతిషంలో నమ్మకంకుదురుతుందట."

"ఎక్కడుంది దాకాగితం?" అన్నాడు నలిన్.

"ఎందుకూ ? ఇప్పుడు చూసేందుకు వీలు లేదు. ౧౯-వ తారీఖున సాయంత్రం ౬ గంటలు దాటేవరకూ చూడనని అతనికి నేను వాగ్దానంచేసేను."

"విప్పేందుకు కాదు. ఊరికే చూడ డానికి. నువ్వు నిజంచెప్తున్నావో అబద్ధం చెప్తు న్నావో నాకేం తెలుస్తుంది ?"

"నిజంగానే ఆయన ప్రమోద్‌కి ఆకాగి తం ఇచ్చేడు" అంది అమీాయా.

"ప్రమోద్ నీ కాకాగితం చూపించాడా, అమీాయా ?"

"లేదు."

"చూసేవా మరి ?.....తీసుకురా, ప్రమోద్. ఉంటేనే సుమా."

ప్రమోద్ లేచి కొంతసేపట్లో ఆకాగితం తీసుకొచ్చాడు. అందరం చూసేం. అమీా యా మళ్ళీ 'ఇప్పుడే విప్పిచూసేస్తే ఏమీా ?' అంది. అలా వీలులేదన్నాడు ప్రమోద్, కాగితం కుడిచేతులోపట్టుకుని. చటుక్కున నలిన్ ఆకాగితం లాక్కుని దూరంగా పారి పోయి కనురెప్పపాటులో జేబులో కత్తితీసి కాగితం చక్కగా విప్పి పెంకితనంగా చదివే సేడు. చదువుతున్న కాసేపూ అతని మొఖం లో చాలా హాశ్చర్యంకనిపించింది. ప్రమోద్‌కి పట్టరానికోపం వచ్చింది. అతనికళ్ళ కేసి చూస్తే నలిన్‌మీాదకి ఉరికి చంపేస్తాడేమో అనుకున్నాను. ఇంతట్లో అమీాయా నలిన్ దగ్గిరకి పరుగెత్తి తనకికూడా ఆకాగితం చూపించమంది. నలిన్ చూపించనన్నాడు.

"నువ్వు ఎలాగో చూసేసేవుకా ?"అంది అమీాయా.

"నేను చూసేసేను కాని నువ్వూ ప్రమోద్ ఇంకా చూడలేదే. అసలు ప్రమోద్ తనూ మీారూ దానిని చూడరని వాగ్దానం చేసేడుకాని నేను చూడనని వాగ్దానం చెయ్యలేదు."

చేసినపనీ, ఆడేమాటలూ అన్నీ నలిన్ అంటే నాకు అసహ్యం హెచ్చుచేసేయి.

అమీాయా ఇంకా బతిమాలుకుంది చూపించమని. ముమ్మాటికీ చూపించనన్నా డు నలిన్. పైగా అమీాయాని లోపలికివెళ్ళి జిగురుతెమ్మని ఆజ్ఞాపించాడు. మాట్లాడకుండా అమీాయా లోపలికి వెళ్ళి జిగురుతెచ్చింది. ప్రమోద్ కేసి చూస్తూ అన్నిపక్కలా ఆకా గితం మళ్ళీ నలిన్ అంటించేసేడు. ఎంతో ఆప్యాయంతో కూడుకున్న మందహాసంతో ఆకాగితం తెచ్చి ప్రమోద్‌కి ఇవ్వబోయాడు. ప్రమోద్ ముందర పుచ్చుకోలేదు. కాని అప్ప టికే కోపం చాలావరకు చల్లారిపోయింది.

నలిన్ దీనంగా, "నన్ను క్షమించవా?" అన్నాడు. కాగితం అందుకుని ప్రమోద్ నువ్వుచేసినపని చాలా తప్పుపని సుమా" అన్నాడు.

"నేను చేసేపనులన్నీ తప్పు పనులే కాని నువ్వు నన్ను క్షమించినట్టేనా ?"

కాసేపుండి "క్షమించినట్టే" అన్నాడు ప్రమోద్. "పోనీ ఇప్పుడైనా చెప్తావా ఆకాగితంలో ఏముందో?...నాఒక్కత్తెకే చెప్పు" అంది అమియా.

"చెప్పేనంటే జాగ్రత్త" అన్నాడు ప్రమోద్.

"అబ్బే, నేను చెప్పను, ప్రమోద్... అమియా, ఇప్పుడే చెప్తే దానిలో తమాషా ఏమీ ఉండదు. నేను చూడడంకూడా పొరపాటే."

"పోనీ, నీకైనా చదివేక జ్యోతిషంలో నమ్మకం కుదిరిందా?" అనడిగింది అమియా.

"౧౯-వ తారీఖువరకూ చూస్తేనే కాని నాకూ కుదర"దన్నాడు నలిన్.

ఆతర్వాత రమేష్ గురించి మాట్లాడడం మొదలెట్టేరు.

"రమేష్ అంటే మనవాళ్ళకే కాకుండా దొరలకికూడా చాలా నమ్మకం అని విన్నానే" అన్నాడు నలిన్.

"అవును, వాళ్ళకీను. వాళ్ళల్లో చాలామంది అతన్ని పిలిపిస్తూఉంటారు. ఒక పోలీసుద్యోగుండేవాడు. ఇప్పుడున్న వాడిముందటివాడే. రమేష్ అంటే అతనికి అంతులేని నమ్మకం. అతనికేకాదు, మొన్న వచ్చిన జిల్లాకలెక్టర్ కూడా రమేష్‌ని పిలిపించి జ్యోతిషం చెప్పించుకున్నాడు" అని చెప్పేడు ప్రమోద్.

"అలాగా?" అన్నాడు నలిన్.

ప్రమోద్ కాగితం పట్టుకునీ, అమియా జిగురు పట్టుకునీ లోపలికి వెళ్ళిపోయారు.

నలిన్ నాకేసి తిరిగి "౧౯-వ తారీఖువరకూ మీరిక్కడే ఉంటారా?" అనడిగేడు.

"౨౦-వ తారీఖునో, ౨౧-వ తారీఖునో వెళ్ళిపోదాం అనుకుంటున్నా"నన్నాను.

... ... ... ... ... ... ... ... ... ... ...

౧౯-వ తారీఖున సాయంత్రం నాలుగున్నరగంటలకి అమియా, నేనూ కాఫీ తాగుతున్నాం. ప్రమోద్ ఇంట్లోలేడు. అమియాని వదిలేరోజు దగ్గర కొస్తున్నకొలదీ నాకు చెప్పరాని బెంగపట్టుకుంది. ఈరోజున మళ్ళీ ఆఖరిసారి నాఘోష మొదలెట్టేను. ఎంతో మృదువుగా ఆవిషయంగురించి మాట్లాడొద్దని నన్ను బతిమాలుకుంది అమియా.

"నువ్వంటే నాకెంత ప్రేమో నీకు తెలుసునుకదా" అన్నాను.

"ఎంత ప్రేముంటే నేమీ? మన దేశాలు వేరు, మనభాషలు వేరు. మన......"

"నిజంగా నేను నీకు నచ్చితే, అమియా, ఈభేదాలేవీ నీకు కనపడవు."

"కళ్లుమూసుకుంటే ఏమిప్రయోజనం?"

"నువ్వు బెంగాలీయువకుడిని ఎవరినైనా పెళ్ళి చేసుకోవాలని అనుకుంటుంటే నీఅభ్యంతరాలన్నీ నేను బోధపరచుకోగలను. గొప్ప

కుటుంబంలో పుట్టినదానవు. దేశాలన్నీ తిరిగినదానవు. అర్థంలేని రాష్ట్రాభిమానం అవలంబించి 'బెంగాలీయువకులు బెంగాలీ యువతులకే'అంటే నేనొప్పను."

"మా బావొకడు సీమలో ఒకతెల్ల పిల్లని పెళ్లి చేసుకుని వచ్చాడు. చాలా మంచి పిల్ల, పాపం. కాని వాళ్లిద్దరికీ పడలేదు."

"దానికీ దీనికీ ఏమైనా పోలికుందా, అమియా?"

"రెండూ ఒకటే."

"దానర్థం ఎవరో బెంగాలీఅబ్బాయిని నువ్వు ప్రేమిస్తున్నా వన్నమాట."

"ఇన్నాళ్లిక్కడున్నావు నువ్వు. నా కోసం ప్రత్యేకంగా ఎవరైనా రావడం చూసేవా?"

"ప్రమోద్ స్నేహితులు అనేకమందొచ్చారు."

"ఎవరు?"

"ఎవరేమిటి?...నలిన్ నే చూడు."

"నలిన్‌ని పెళ్లి చేసుకోనని చెప్పేనే నే."

"పెళ్లి చేసుకోకపోవచ్చును,చదువు లేదనీ డబ్బు లేదనీ. ప్రేమిస్తూఉండొచ్చునుకా...ఏమిటంతాలోచిస్తున్నావు? నేనన్నది నిజమేనా?"

"ప్రేమకాదు కాని...చాలా డబ్బుంటే నలిన్‌కి, రెండేళ్లకిందట తను నన్నడిగినప్పుడు అంతచటుక్కున పెళ్లిచేసుకోనని చెప్పకపోదును."

"అదుగో. నేను చెప్పలేదూ?"...

ఇంతట్లో ప్రమోద్ వచ్చేసేడు.

"అమియా, మనకి నలభైవేల రూపాయిల నష్టం వచ్చింది."

"ఏమయింది, ప్రమోద్?"

"కలకత్తానుంచి శంకర్ ఇప్పుడే నాకు తంతి పంపించాడు. మనకి బాకీఉన్న వసంతలాల్ దివాలా ఎత్తేడు."

"నలభైవేలే!" అన్నాను నేను. మళ్లీ "లక్షలున్న వాళ్లుమీకు నలభైవేలొకలెఖ్ఖా?"

"ఎంతున్నా నలభైవేలు దమ్మిడీతో సమానంకాదుకదా." అన్నాడు ప్రమోద్.

అమియా వాళ్ల కలకత్తామనిషి, శంకర్‌ని తిట్టడం మొదలెట్టింది. అంత అశ్రద్ధయితే మరొకరిని చూసుకోవాలంది. ఆ కోపంలో అమియాముఖం నాకు చాలా అందంగా కనిపించింది. కాని వెంటనే వైఖరి మార్చేసి, "ప్రమోద్, నీస్నేహితు డిచ్చిన కాగితంలో ఉన్న జోస్యతిష్యం ఇదే ఏమో" అంది అమియా.

"కావొచ్చును" అన్నాడు ప్రమోద్.

"చూద్దాం. తీసుకురా." అంది అమియా. ప్రమోద్ గోడకేసి చూసేడు.

"ఇంకా అయిదుగంటలుకూడా కాలేదు. ఇంతవరకూ ఆగినవాళ్లం ఆరుగంటలవరకూ కూడా ఆగొచ్చును" అన్నాడు.

అమీయా కది నచ్చలేదు.

"నీఇష్టం." అంది.

ఇంతట్లో ప్రమోద్‌స్నేహితు డొకడు హడావిడిగా ఇంట్లోకి పరుగెత్తుకొచ్చాడు.

"ఏమిటిసంగతి, బాసూ?"

"మీరింకా వినలేదూ?"

"ఏమిటి?"

"మనజిల్లాకలెక్టరుని ఎవరో పిస్తోలుతో చంపేసేరు."

"ఎప్పుడు?"

"ఇప్పుడే. అరగంటకూడా కాలేదు."

అమీయా లేచి నుంచుంది.

"ఎవరు పేల్చేరు పిస్తోలు?"

"ఏమో పేరింకా తెలియదు. కలెక్టర్ కచ్చేరీలో ఉండగా కిటికీలోంచి పేల్చేడ టామనిషి."

"ఆమనిషిని పట్టుకున్నారా?"

"పారిపోతుంటే పోలీసువా డొకడు తుపాకీ పేల్చేడు. గుండు వెన్నులోంచి శరీరంలోకి వెళ్ళి ఆమనిషి కిందపడిపోయాడట. ఆసుపత్రిలో ఉన్నా డిప్పుడు, స్పృహతప్పిపోయి."

"ఎవరో ఇంకా తెలియలేదా?" అనడిగేను నేను.

"నేనంతా పూర్తిగా కనుక్కోకుండానే ఇక్కడికి పరుగెత్తుకొచ్చాను."

ఈ గడబిడ చూసి అమీయాతల్లి కూడావచ్చింది. ప్రమోద్ ఆవిడకి బోధపరిచాడు.

"ఎంత ఘోరం! ఎంత ఘోరం!" అందావిడ. "ఆదొరభార్య ఎంత ఏడుస్తుందో కదా ఈవాళ రాత్రి."

"చంపిన బెంగాలీయొక్క భార్యో?" అంది అమీయా.

"ఆవిడకూడాను" అంది అమీయాతల్లి.

"చంపినవాడికి పెళ్ళయియుండదు. బెంగాలులో ఇలాంటిపనులు చేసేవాళ్లు పెద్దవాళ్లుకారు. అంతా కుర్రజట్టే" అన్నాడు ప్రమోద్ స్నేహితుడు.

"నలిన్‌కి వీ ళ్లందరిసంగతీ తెలుసును. ఈవాళ సాయంత్రం నలిన్ రాగానే అదెవరో తెలుస్తుంది." అన్నాడు ప్రమోద్.

వెంటనే అమీయా నన్నూ, ప్రమోద్‌నీ నలిన్ ఇంటికివెళ్లి అత న్నిక్కడికి తీసుకు రమ్మంది.

అమీయాతల్లి, "వాళ్లిల్లు ఊరికిఆచిగురు నుంది. ఎందు కంతతొందర? పోనిద్దూ" అంది.

అన్నా చెల్లెలూ వెళ్లడమా వద్దా అని ఇంకా వాదించుకుంటూనే ఉన్నారు. ఇంతట్లో ఊళ్లోవీథు లన్నిటిగుండా పోలీసువాళ్లు గుంపులుగుంపులుగా పచార్లు మొదలెట్టేరు. ఇంట్లో అందరం వీథిసావిట్లోకివచ్చి నుంచున్నాం. ఎవ్వరూ ఇళ్లువిడిచి వీథిలోకివెళ్లేం

దుకు వీలులేదని ప్రకటనచేసేరు. ప్రమోద్ స్నేహితుడు తనింటికివెళ్లాలని బయలుదేరే సరికి వీధిమీదకాలుపెట్టగానే తుపాకీపట్టుకుని పోలీసువాడొకడు పరుగెత్తుకొచ్చాడు. ప్రమోద్ స్నేహితుడు తనింట్లో ఆడవాళ్లుతప్ప మరెవరూ లేరనీ, తనువెళ్లకపోతే వాళ్లు బెంగపెట్టుకుంటారనీ ఎంతో వాదించాడు. లాభం లేకపోయింది. తలవంచుకు మళ్లీవచ్చేసేడు. రమారమి ఒకగంట ఆలాగే వీధులోనుంచున్నాం. ఆఖరికి విసుగెత్తి ఇక నారోజుకి విశేషాలుమరేమీ తెలియవనిచెప్పి లోపలికివచ్చి కూర్చున్నాం. కూర్చున్న రెండుమూడునిముషాలలో గడియారం ఆరుగంటలుకొట్టింది. ఎవరూ శ్రద్ధగా ఎన్నిగంటలుకొట్టిందోకూడా వినలేదు. అలా మాట్లాడుతూనే ఉన్నాం. పదినిముషాలుకూడా జరిగుండవు. వీధిసావిట్లో నాలుగు పోలీసుటోపీలు కనిపించాయి. తర్వాత ఒక తెల్లపోలీసుద్యోగి కనపడ్డాడు. అందరంలేచి వీధులోకి వెళ్లేం.

"ప్రమోద్ బానర్జీఇల్లు ఇదేనా?" అనడిగేడు ఆఉద్యోగి.

"అవును" అన్నాడు ప్రమోద్.

"నువ్వేనా ప్రమోద్ బానర్జీవి?"

"అవును."

వెంటనే ప్రమోద్‌వి రెండుచేతులూ ఒకపోలీసువాడు పట్టుకున్నాడు. ప్రమోద్ విడిపించుకోబోయాడు. మాట్లాడకుండా జేబులోంచి సంకెళ్లుతీసి ఆఉద్యోగి ప్రమోద్ చేతులు బంధించేసేడు. ప్రమోద్‌తల్లి నేలమీదకి కూలిపోయి ఏడవడం మొదలెట్టింది. అమీయమా ఆవిడని ఓదారుస్తూ ఆఉద్యోగికేసి తీక్షణంగా చూస్తూకూర్చుంది.

"నాకెందు కిలా సంకెళ్లు వేస్తున్నారు?" అంటూ ప్రమోద్ గంభీరంగా అడిగేడు.

"పోలీసుకచ్చేరిలో అంతా సావకాశంగా చెప్తాంకాని, నీఇల్లంతా ఇప్పుడు పరీక్ష చెయ్యాలి" అన్నాడాఉద్యోగి.

"ఎందుకూ?"

"సికురమేష్ అన్న పేరుతో ఒకస్నేహితుడున్నాడు కాదూ?"

"అవును."

"అతనికీ నీకూ జరుగుతూ ఉన్న ఉత్తరప్రత్యుత్తరాలు కొన్ని పరీక్ష చెయ్యాలి."

"నాకూ అతనికీ ఎన్నడూ ఉత్తరప్రత్యుత్తరాలు లేవు."

"ఇంటితాళాలన్నీ ఇచ్చి మమ్మల్నే పరీక్షచేసుకోనీ...నీ గదెక్కడ ?"

రెండుచేతులతోటీ ప్రమోద్ మొలలోంచి తాళాలుతీసి అందిచ్చాడు. గదికేసి చూపించాడు.

మమ్మల్నెవ్వరినీ కదలనీకుండా ముగ్గురు పోలీసువాళ్లని కాపలాపెట్టి ఒకపోలీసువాడితో ఆఉద్యోగి లోపలికి వెళ్లేడు. మిగిలిన గదులన్నీ కొంతసేపు పరీక్షచేసి ఆఖరికి ప్రమోద్ చూపించిన గదిలోకి వెళ్లేడు.

ఈలోపున అమీయా దుఃఖం ఆపుకోలేక అక్కడ నుంచున్న పోలీసువాళ్లని తిట్టడం మొదలెట్టింది.

"మాతప్పుకాదు తల్లీ. తెల్లవాళ్లని మీరు చంపడం మొదలెత్తే వాళ్లూరుకుంటారా మరి ?" అన్నా డాముగ్గురిలోనూ ఒకడు.

"మా ప్రమోద్ కి ఈ చంపడం విషయమై ఏ సంగతీ తెలియదు" అంది అమీయా.

అమీయాతల్లి పిచ్చెత్తినదానిలా తన కొడుకుకేసి చూస్తూ కూతురుమీద ఆనుకు నుంది.

"పిస్తోలు పేల్చి ఆయన్ని చంపినమనిషిని పట్టుకున్నారా ?" అనడిగేను నేను.

"ఓ, పట్టుకోకేమీ ? అప్పుడే ఆమనిషి కడుపులో గుండుపల్ల ఆసుపత్రిలో చచ్చిపోయాడుకూడాను."

"ఆమనిషి పేరేమిటి ?"

"మాకు తెలియదు. చచ్చిపోయాడని విన్నాం. అంతే."

"ఈసందర్భంలో మరెవరినైనా పట్టుకున్నారా ?"

"ఈమనిషి గుండుదెబ్బవల్ల పడిపోయిన సమయాన్నే అతనికి కాస్త దూరంలోనే రమేష్ అన్న మనిషిని చూసేం. కలెక్టర్ దొరగారిని చూడడానికి వస్తున్నా నన్నాడు. పట్టుకున్నప్పుడు అతని జేబులో ఒక పిస్తోలుంది. అదెందు కక్కడుందనడిగితే తను దొరగారికి జ్యోతిష్కం చెప్పేవాడిననీ, తను దొరలతో తిరగడం నచ్చని బెంగాలీ కుర్రాళ్లు చంపేస్తారేమో అన్నభయంతో పిస్తో లెప్పుడూ ఓ జేబులో పెట్టుకుంటాననీ చెప్పేడు. అందుకు సర్కారువారి అనుమతి ఎందుకు పొందలేదంటే, వారు వేరే అపనమ్మకాలు పెట్టుకుంటారని వారికి తెలియపరచలేదన్నాడు. పెద్దపోలీసుకచ్చేరీలో ఉన్నాడిప్పుడు......"

కాసేపట్లో ఏమిటేమిటో కాగితాలు చేతులో పట్టుకుని ఆపోలీసుద్యోగి గదిలోంచి పైకివచ్చాడు. నాకేసీ, అమీయాకేసీ చూస్తూ, "నేను మళ్లీవచ్చేవరకూ మీరెవరూ ఇంట్లో ఏ సామానూ ముట్టుకునేందుకు వీలులేదు సుమండీ" అన్నాడు. మేము జవాబేమీ చెప్పలేదు.

ప్రమోద్ కేసితిరిగి, "నీ కీహత్యవిషయమై ఏమీ తెలియదు కాదూ?" అన్నాడు విషపునవ్వుతో.

"ఏమాత్రం తెలియదు" అన్నాడు ప్రమోద్. ఉద్యోగి ఆకాగితా లన్నిటిలోంచీ ఒకకాగితం పైకితీసేడు. అది రమేష్ ప్రమోద్ కిచ్చినకాగితం. విప్పిచూపించాడు. అమీయా కూడా లేచినుంచుని చూసింది.

ఆకాగితంలో ఉన్నదిదీ:

"19-వ తారీఖున రమారమి నాలుగున్నరగంటలకి మిడ్నపూర్ జిల్లా కలెక్టర్ తనకచ్చేరీలోనే చచ్చిపోతాడు."

చదివినవాళ్లం అందరం నిలువల్లా నీరై పోయాం. ఇదా రమేష్ వ్రాసిఇస్త! ఇదా నలిన్ చింపిచదివేస్త!......ప్రమోద్ కాసే పయాక మాట్లాడబోయాడు.

"నువ్విప్పుడేమీ చెప్పవలసినబాధ్యత నీకులేదు. ఆలోచించుకొని తర్వాత ఎప్పుడు తోస్తే అప్పుడు నీకు నచ్చినకథ చెప్పొచ్చును నువ్వు." అన్నా డా ఉద్యోగి.

"కథకేమీ లేదిందులో. అది నాస్నేహితుడు రమేష్ పదిరోజులకిందట నాకు జ్యోతిష్యంలో నమ్మకం కుదిరేటట్టు చేస్తానని ఇచ్చాడు. 19-వ తారీఖున సరిగ్గా ఆరుగంటలు దాటేక విప్పమన్నాడు. దానిమాట మరిచేపోయా నిప్పుడు నేను. నేనుచెప్పినది నిజం అనేందుకు వీళ్లందరూ సాక్ష్యులు."

"ఇప్పుడు నువ్వుచెప్తున్నకథ విన్నాక వాళ్లు సాక్షులు కా కేం చేస్తారు?"

"వాళ్లబద్ధం ఆడరు...అదికాక ఇక్కడలేనిస్నేహితుడుకూడా ఒకతను ఈ కాగితం చూసేడు. మేము ఊరికే పైనేచూసేంకాని ఆస్నేహితుడు విప్పేసి లోపలివ్రాతకూడా చూసేసేడు. అతను నాకు సాక్ష్యం."

"ఎవరది?"

"అతనిపేరు నలిన్‌దాసు—గుప్తా."

ఉద్యోగి మళ్లీ విషపునవ్వు నవ్వేడు.

"నలిన్‌దాస్—గుప్తా!...మంచిసాక్షే! అతనే కలెక్టర్‌ని చంపుత. అతను చచ్చిపోతూ 'ప్రమోద్‌తో రమేష్ వ్రాసినది నిజం అయిందని చెప్ప'మని పలవరించాడు. ...ఈకాగితం కోసమే వస్తనేను." ......

ప్రమోద్‌ని వాళ్లు తీసుకుపోయారు.ఇద్దరు పోలీసువాళ్లు మామీద కాపలా. అమీయా ఏకధారగా ఏడ్చేస్తోంది. పాపం, అమీయా తల్లి ఆవిచారంలో స్పృహతప్పి కొయ్యలా పడుంది. నాకళ్లల్లో కూడా నీరు గిర్రు మని తిరుగుతోంది. పాపం, ప్రమోద్ గతేమిటో!

అమీయాని ఓదార్చబోయాను.ఎంతో నాజూకైన తనచెయ్యి పట్టుకుని, "మరేమీ పరవాలేదు, అమీయా. ప్రమోద్‌ని ఏమీ చెయ్యరు వాళ్లు. ఏమీ చెయ్యలేరు. ఒక గంటలో మళ్లీ ఇక్కడుంటాడు" అన్నాను.

నాకేసైనా చూడలేదు. అమీయా ఏడుపు మానలేదు. నా భుజంమీద చంటిపిల్లలా తన తల వాల్చింది. నుదురుమీద పడుతున్న తన ముంగురులు చేతితో వెనకకి దువ్వి సద్దేను. ఇంకా ఏడుస్తూనే నాకు జవాబిచ్చింది.

"ప్రమోద్‌కోసం...అంత బెంగలేదు... తనేమీ...చెయ్య లేదు... కాని... నలిన్ మొఖం...ఈ జన్మలో... మళ్లీ నాకు కనపడదు."

నలిన్‌మాటే మరచిపోయాను నేను!

---

 రాధాసుందరముఖ
సారసమధుపా - ముకుంద, సభ్యతకై
పారఁగఁ గందవ్రాతము [సొం
నే రచియించెదను నీతినిచయము వెలయన్.

కేశవ, భావింపంగా
నాశాన్వితజనుఁడు దాసుఁడగు నందఱకున్
దేశాధిపత్య మున్నను
లేశంబును సుఖముఁ బొందలేఁడు దనమదిన్.

నారాయణ, యాపద చే
కూరెడు సమయంబునందుఁ గొంచెంబయినన్
ధీరతఁ బాయదు గాదే?
ధీరవరునిమానసంబు దృఢతరమగుటన్.

మాధవ, కామము లోభముఁ
గ్రోధము నజ్ఞునిగఁ జేయుఁ గోవిదునైనన్
బోధమును గోరుమనుజుఁడు
దా ధీ నిడనీక వానిఁ దరలింపఁదగున్.

గోవింద, యమృత మయినను
వావిరి యగునేని గరళభావము నొందున్
గావున వివేకి మితముగ
నేవస్తువునైన వాడుటే యుక్తమగున్.

శ్రీవిష్ణూ, యధికముగా
నేవానికిఁ దెలియు వాని హృదయము సందే
హావృతమై వర్తించును
భావింపఁగ నీమమాయ బహుచిత్రముగా.

మధుసూదన, మూఢుఁడు బహు
విధముల గౌరవమునొంది వెలయుచునుండుణ్
బుధశూన్యము లగుపట్టుల
సుధ దొరకనిచోటునందు సుద్దవిధముగణ్.

కనఁగఁ ద్రివిక్రమ, యెవ్వం
డొనరించెడు చేఁత వాని కొప్పఁగఁ దోఁచుణ్.
పను లన్యు లెంత బాగుగ
నొనరించిన వానియందు నోగె యగపడున్.

కులమును గని చుట్టఱికము
సలుపుజనుఁడువామనా, సుసౌఖ్యమునొందున్
స్థల మెఱుఁగుచు వసియించినఁ
గలుగదుగద మదికి వంత గాసంతయినన్.

వాసన కర్మఫలం బగు
వాసనవలననె జనించుఁ బ్రాణివితతికిన్.
వాసిగ స్వభావము కనక
వాసా, శ్రీధర, గజాధిపతిపరిపాలా.

గుణికంటె హృషీకేశా,
గుణివేషధరుండు దోఁచు గురుతరునివలెన్
మణివరముకంటెఁ గృత్రిమ
మణి దగు రమ్యతర కాంతిమంతం బగుచున్.

బొం కొకటి గప్పఁ బూనుచుఁ
గొంకకపదిబొంకునుడువుఁగూయుదురుఖలుల్
సంకటసమయమునందును
బొంకరుగద పద్మనాభ, పుణ్యాభిరతుల్.

వావిరి సమ్మెటపోటులు
పావకునకు లోహసహితవాసమువలనన్,
గావున దామోదర, కుజ
నావలిసహవాస మధికహానిదము సుమీ.

పంకభయంబును లోకా
తంకంబును జిత్తమునకుఁ దగులనికతనన్,
సంకర్షణ, దుర్మార్గుఁడు
జంకక యొనరించు నెగ్గు సామికినైనన్.

నాలుకకొన నమృతంబును
హాలాహలమొదివి యుదరమందుండుట నా
భీలమగు ఖలునిచేఁత
వైళమ శ్రీవాసుదేవ, వర్జింపఁదగున్.

తులసీవనిఁ బద్మ్యమ్నా,
కలంజము జనించుమాడ్కిఁ గాపురుషుఁడు స
త్కులమున నరుదుగఁ గలిగి వి
మలకులమర్యాద నగ్గిమంటం బెట్టున్.

అనిరుద్ధా, కుచ్ఛితకుల
మున నొకసమయంబునందుఁ బొడమును గాదే?
యనవద్యగుణుఁడు బొగ్గుల
గనియందు వినిర్మలమణి గలిగెడుభంగిన్.

పురుషోత్తమ, కడు లెస్సగఁ
బరికింప జగంబునందుఁ బామరులును ధీ
వరులును లేరు నిజంబుగ
నరుమది భ్రమ కెఱుకకును సదనంబయితగుటన్.

పండితుఁడు మితాలాపి య
పండితుఁడు సదస్సునందు వదరును మిగులన్

నిండినకుండ యధోక్షజ,
యుండుఁ దొణక కెపుడు నర్ధి యూఁపంబడినన్.

నూతనము శ్రేయమనియుఁ బు
రాతన మతిహేయమనియుఁ బ్రాజ్ఞుఁడు నరసిం
హా, తలఁపకుండ నెరపును
బ్రీతిని దత్త్వంబెఱింగి విమలమనముచేన్.

ధనికునిచెంతకు యాచక
జన మచ్యుత, యేగు నితరసన్నిధి కెపుడున్
జనదు గుడముండుతానం
బునకుఁ బిపీలికసమూహము సనును గాదే.

తనయును రేగినను జనా
ర్దన, మానము విడువలేఁడు తతవీర్యుఁ డెటన్
గన మానవిహీనుఁడు జీ
వనమును కడుదొడ్డదనుచు భావన సేయున్.

తలపంగ ఘనునివచనము
శిలాక్షరముపోలె మిగులఁ దిరమై యొప్పన్
జలలిపివిధముగ నీచుని
పలు కస్థిరభావమొంది పరఁగు నుపేంద్రా.

నరునకు స్వకీయదోషము
గురిగింజవిధంబుగానె గోచర మగుఁగా
పరుఁ డొనరించినదోషము
ధరాధరముపోలెఁ దోఁచుఁ దనమదికి హరీ.

శ్రీకృష్ణ, యసంతృప్తుఁడు
నాకమునకుఁ జనిన మేరునగముం గనినన్
లోకేప్సితసుఖముం గన
లేకుండునుజుమి విషాదలిప్తహృదయుఁడై.




## పేనా, పెనసలు పెట్టె

కో. నరసింహాచారి

ఈపెట్టెలో అతుకవలసిన భాగమే లేదు. W X Y Z అను అట్టను 19½ అంగుళముల నిడివియు, 8½ అంగుళముల వెడల్పును గల దానిని తీసికొనవలసినది (చిత్రము 1). చిత్రమునందలి కొలతలప్రకారముగ అట్టపై గీతలు వేసి వివిధభాగములను గుర్తించవలెను. ఇందు L, N అనునవి పొడుగైనప్రక్కలుగను, M, O అనునవి వెడల్పుప్రక్కలుగను ఏర్పడును. F అనునది O కు లోపలిభాగమున రావలసిన తునుక. T అనునది పెట్టెయొక్క మూతయు, E G అనునవి ఆమూతకుక్రిందుగా మడువబడియుండు రెండుతునుకలును అగును. R అనునది పెట్టెమూతను వేసినపుడు పెట్టెలోనికి జొనుపవలసిన తునుక. మూలగీతలతో చూపినభాగమునంతయు కోసివేయవలెను.

పెట్టెయడుగున మూతయందువలె (T) నొకేతునుకగా లేక దానికన్న కొంచెము వెడల్పుతక్కువయగు B, C అను రెండుభాగములుగా గలవు. ఇందు ఒకటి మఱియొక దానిలో దూర్చవలసియుండును. మొదట B యందు a b అను మధ్యరేఖకు వెలుపట a b c d భాగమును చిత్రమునందు జూపిన రీతిని కోయవలెను. అటుపిమ్మట t ని బిందువుగా t d కి సమానముగ t v ని గుర్తించుకొని, తర్వాత n ను బిందువుగా n v కి సమానముగ n a ను గుర్తించుకొని, C యను భాగమున a b c d ని B యందలి యదేగుర్తుగల భాగమునకు సమానముగ గుర్తించుకొనవలెను. ఇందు s s అను రెండుకోతలను (సందులు) చేయవలెను. B యందలి e, e అను రెండు చెవులను, C యందలి s, s అనుసందులలో దూర్చవలసి యుండును. N అనుభాగమున మూతను తెఱచుటకు అనుకూలముగ నుండుటకై f అనురీతిని కోయవలెను.

ఇట్లు అన్నిభాగములను కోసినపిమ్మట మొదట L, M, N O అనువాటిని గదికి గోడలుండురీతిని మడుచుకొనవలెను (చిత్రము 2). అపుడు f అనునది O భాగమునకు లోపలివైపున నుండవలెను. పిమ్మట H, J భాగములను అడుగువైపున లోప్రక్కగా మడిచి వాటిపై C ని మడిచి, దానిపై B ని




మడిచి e, e అనుచెవులను s, s సందు EG లను లోప్రక్కగా మడిచి T ని మూసి లలో దూర్చవలెను (చిత్రము 3). తర్వాత నయెడల పెట్టి పూర్తియగును (చిత్రము 4).

# దైవోపహతులు

శ్రీ శ్రీనివాసశిరోమణి

౧

ఏనాడు యీదేశంలో విగ్రహారాధన ప్రారంభమయినదో యెనిమిత్తమని నిర్ణయించడానికి ఆధారములు లేవు. ఆ విగ్రహాలున్న ప్రదేశములే యీదేశములో మహాక్షేత్రాలుగా ఉన్నవి. సామ్రాజ్యాలు పుట్టినవి-నాశనమయిపోయినవి. అనేకమతాలు పుట్టినవి చచ్చినవి. ఎన్నెన్నిమార్పులో దేశంలోవచ్చినవి. ఆ విగ్రహాలుకాని, ఆ క్షేత్రాలుకాని, వాటి ప్రాముఖ్యముకాని పోలేదు. ఈనాటివరకు ఆవిగ్రహాలు, ఆక్షేత్రాలు ప్రపంచాన్నిఅంతా ఆకర్షిస్తున్నవి. అందుకుకారణం మంత్రబలమని కొందరంటున్నారు. కాదు అక్కడ ఉన్న యంత్రబలమని మరికొందరంటున్నారు. అదీ కాదు ఆవిగ్రహాలను అలంకరించిన రత్నాలబలమని యింకాకొందరంటున్నారు. ఇందులో ఏబలమో ఎవరికి తెలుసును ?

ఏ తెలుసనట్టిముండాకొడుకో "రాళ్లు దేవుళ్లైతే[౧] రాసులుమింగవా" అన్నప్పటికీ, ఆరాళ్లు రాసులనేకాదు, రాజులనేకాదు, సామ్రాజ్యాలనేకాదు, సమస్తదేశాలను మింగినట్లు కనబడుతున్నది.

౧౭-వ శతాబ్దములో పాశ్చాత్యదేశాలలో ప్రజలందరు రత్నాభరణాలు ధరించవలెననే పిచ్చిలో పడిపోయినారు. అందులో మహోచ్చస్థితిలోనున్న ఫ్రెంచి సమ్రాట్టులు, వారి పట్టమహిషులు, వారి పట్టమహిషులేకాదు, ఉంపుడుకత్తెలుకూడా రత్నాభరణములతో అలంకరించుకోవడం అలవాటయిపోయినది.

ఫ్రాంసుదేశములో అనేకమంది రత్నపరీక్ష తెలిసినవాళ్లు రత్నాలకోసరం దేశదేశాలూతిరిగి సంపాదించుకొని వస్తూఉండేవారు. అటువంటివారిలో "జీన్ బాప్టిస్ట్ టావర్నియర్" చాలాప్రసిద్ధుడు. ఫ్రెంచిదేశములో ౧౭-వ శతాబ్దంలో ఈ రత్నాలసందర్భం ఏది వచ్చినా ఈయన పేరు కనబడుతుంది. ఈయన ఫ్రెంచి దేశానికి ఇతరదేశాలనుంచి ఎన్నెన్నిరత్నాలు చేర్చినాడో లెక్కలేదు. ఈయనకు వృద్ధాప్యం వచ్చిన కొద్దీ రత్నాలమీద కాంక్ష ఎక్కువై పోయినది. హిందూదేశములో మొగలునవాబులు ధరించేటన్ని మణులు, అంత అమూల్యమైనవి, ఎవరూ ధరించడం లేదని దేశాలన్నీ మారుమోగిపోయినది. పైగా భారతవర్షమే "రత్నగర్భ" అని యూరోపియనులంతా తెలుసుకొన్నారు. ప్రతివాళ్లదృష్టీ భారతవర్షంమీదికి మళ్లింది. అప్పటికే ఈరత్నవ్యాపారంలో ఎంతో ధనమార్జించినప్పటికిన్నీ హిందూదేశమూ, అక్కడవారికే రత్నాలవిషయమూ టావర్నియరుకు తెలిసేసరికి ఆ దుర్దా పట్టలేకపోయినాడు. ప్రపంచంలోకల్లా అమూల్యమైనమణి తాను సంపాదించవలెననుకొన్నాడు. ౮౦ సంవత్సరాల వయస్సులో మణులకోసరం హిందూదేశయాత్రకు బయలుదేరినాడు. అయితే ఈ యాత్రాగర్భంలో ఎంత విషాదమున్నదో, పాపము, ఆయనకేమి తెలుసును ? ఈ హిందూదేశపురాళ్లు రాసులను మింగుతవో, రాజులను మింగుతవో, పాపము ఆయనకు తెలియదు.

టావర్నియరు మొగలుసామ్రాజ్యప్రధాననగరమైన ఢిల్లీకిచేరేసరికి మొగలుప్రభువు అత్యంతాదరంతో ఆపరాసుయాత్రీకుణ్ణి ఆదరించినాడు. మొగలుప్రభువు తన అంతఃపురములో ఉన్నరత్నాలనన్నింటిని పరాసుయాత్రీకుడికి చూపించినాడు. అప్పటికీ, ఆఉన్నవాటితో సంతృప్తిపొందక మొగలాయిచక్రవర్తిహిమాలయపర్వత ప్రాంతాలలో కొత్తగా కొన్ని వజ్రాలగనులు కనుక్కొన్నట్టూ, ఆగనులలోనుంచి యింకా ఉత్తమమయినవి రకరకాల వజ్రాలూ తీస్తున్నట్టూ చెప్పినాడు. ఆగనులుచూడడానికి టావర్ని

యరును ఆహ్వానముచేసినాడు. మొగలుప్రభువుతో గజారోహణంచేసి ఆహిమాలయపర్వతప్రాంతాలలో ఉన్న రత్నాలగనులవద్దకు ఫ్రెంచియాత్రికుడు వెళ్లినాడు. అటువంటిగనులు చూడడానికి ఎవళ్లకున్నూ అవకాశములేదు. మొగలాయీనవాబు కేవలం సహజాదరాతిశయమువల్ల ఈఫ్రెంచియాత్రికుడికి అటువంటి అవకాశమునిచ్చినాడు. ఆగనులవద్ద కొంతకాలం ఉండి తిరిగి మొగలుప్రభువుతోపాటు ఢిల్లీచేరినాడు.

ఈఫ్రెంచిరాజబంధువును సత్కరించడం కోసగం సానపట్టని ఒకదివ్యరత్నాన్ని టావర్నియరుకు మొగలుసమ్రాట్టు బహుమానముగా యిచ్చినాడు. సానబట్టని మొద్దురాయికే, దానిఅందముకే, టావర్నియరు ఎంతో ఆశ్చర్యపోయినాడు. అతనిఆశ్చర్యము "మొగలు" అనే ప్రఖ్యాతిపొందిన ఒకరత్నాన్ని చూపించినాడు. టావర్నియరు చకితుడైపోయినాడు. అతడు పుట్టి బుద్ధెరిగినతర్వాత కలలోనైనా అంత అమూల్యమైన వజ్రము ఒకటి ఉంటుందని అనుకోలేదు. అటువంటి వజ్రాన్ని చూడటంవల్ల తనజన్మ తరించిపోయినట్లుగా ఎంచుకొన్నాడు. ఆవజ్రము యొక్క ఎత్తుసరి ౨౮౯ క్యారట్లు. అది కోడిగుడ్డుఆకారంలోఉంది. దానిస్వరూపం, దానివైభవం వర్ణించడానికి ఎవరికిసాధ్యమవుతుంది?

టావర్నియరు అదిచూసి విభ్రాంతుడయినాడు. మొగలుచక్రవర్తి మందహాసంచేసి "ఈవజ్రంకంటే కూడా ఇంకా ఎంతో అమూల్యమైనరత్నాలు ఈ దేశంలోఉన్నవి. అవి మనవ్యమాత్రుడు అలంకరించుకోడానికి అనర్హుడు. దేవతావిగ్రహములను అటువంటి వానితో అలంకరించడం ఆచారము. బర్మాదేశములో మాండలేప్రాంతములలో పాగన్ అనే పట్టణం ఉన్నది. ఆపట్టణంలో సీతారాముల దేవాలయం ఒకటిఉన్నది. ఆసీతారాముల వక్షఃస్థలంమీద ఒకనీలంఉన్నది. ఆ నీలముకంటే అమూల్యమైనది ఈప్రపంచములోలేదు" అని చెప్పినాడు.

దానిని ఎందుకీమొగలుచక్రవర్తి ధరించకూడదనే ఆశంక టావర్నియరుకు కలిగినది.

"అటువంటిరత్నములు మనుష్యులు ధరించడానికి వీలులేదు. అందువల్లనే అవి దేవతావిగ్రహముల కంఠములనలంకరించినవి. ఎవరైనా వాటిని పెట్టుకోదలచినట్లయితే, పెట్టుకోవలెననే ఊహ కలిగినంత మాత్రానికే నాశనమైపోతారు. ఇక వాటినిధరించిన వాళ్లగతి ఏమవుతుందో చెప్పవలెనా! మనుష్యులు పెట్టుకొనేరత్నాలువేరు. దేవతావిగ్రహాలకు పెట్టేరత్నాలువేరు." అని మ్లేచ్ఛుడైన మొగలుసమ్రాట్టు పాశ్చాత్యుడికి చెప్పినాడు. ఈమాటలు ఫ్రెంచియాత్రికుడికి నచ్చలేదని తెలిసికొని నవాబు ఒకకథ కూడాచెప్పినాడు. అప్పటికే "రెండువేలసంవత్సరముల నాడు ఆ అమూల్యనీలము ఆసీతారాముల వక్షస్థలమును అలంకరించినది. ఆనీలముమీద ఎంతమందికో కాంక్ష పుట్టినది. అయితే అదితీసికొంటే నాశనమైపోతారనే భయంతో ఎవరూ ధైర్యముచేయలేకపోయినారు. కాని కొంతకాలము గతించినతరువాత బర్మాదేశపురాణీ బిస్సర్ అనేఆమెకు ఆనీలముమీద మోజుపుట్టినది. ఆ మోజుతో ఆనీలాన్ని తెప్పించి పెట్టుకొన్నది. ఆనీలాన్ని పెట్టుకొన్న కొద్దిరోజులకే ప్రభుత్వములో కల్లోలములుపుట్టి ప్రజలు చెలరేగి ఆరాణీని చంపివేసినారు. ఇటువంటి అవాంతరాలు ఎన్నోవచ్చినవి. ఆనీలాన్ని ముట్టుకొన్నవారికి అవాంతరాలు రాకతప్పవు. అవి ఆ దేవతావిగ్రహములైన సీతారాముల వక్షస్థలముమీదనే ఉండవలెను." అని మొగలుచక్రవర్తి చెప్పినాడు.

ఆశ చాలాచెడ్డది. అందులో పాశ్చాత్యుడికి ఆశ పుట్టినదంటే చెప్పవలెనా! ఎటువంటి దారుణపు పనులయినచేస్తాడు. ఆనీలాన్ని ఎట్లాగైనా సంపాదించుకొని యింటికిచేరవలెననుకొన్నాడు టావర్నియరు. కొనడానికా వీలులేదు. ఎంతడబ్బుపెట్టినా వచ్చేదికాదు. దాన్నిసంపాదించడానికి ఒక్కటేమార్గం ఉన్నది. దొంగిలించుకొని పోవలసిందే. దేశదేశాలు చూసినవాడు, రకరకాల మనుష్యులతోటీ సంబంధం వచ్చినవాడు ఈస్వల్పవిషయం చేయలేకపోతాడా ?

టావర్నియరు సపరివారంగా బర్మాదేశం వెళ్లినాడు. మాండలేచేరినాడు. ఏనుగులమీదనెక్కి చచ్చి చెడి పాగన్‌పట్టణంచేరినాడు. ఈ ఫ్రెంచివాడు పాగన్ చేరేసరికే ఎవరో ఒక పాశ్చాత్య యాత్రీకుడు చాలా ధనాఢ్యుడు సీతారాములదర్శనార్థం వస్తున్నాడని ఆ ప్రాంతాలవాళ్లందరూ విన్నారు. టావర్నియరు పాగన్‌పట్టణంలో దిగినాడు. విశేషంగాదానధర్మాలు చేసినాడు. ఆలయానికివెళ్లి సీతారాములదర్శనం చేయవలెననుకొన్నాడు. హిందువులుకానివాళ్లను దేవాలయంలోకి రానిచ్చేఆచారంలేదు. అయితే ఎంతో దూరదేశంనుంచి ౮౦ సంవత్సరముల ముసలివాడు సీతారాముల దర్శనార్థంవచ్చి అక్కడఉండేవాళ్లందరికి విశేషంగా దానధర్మాలుచేసినతరువాత దేవాలయములోనికి రానీయకుండా ఉంటారా ?

టావర్నియరు మహాభక్తిశ్రద్ధలతో దేవాలయము ప్రవేశించినాడు. సీతారాముల విగ్రహము దృష్టిగోచరముకాగానే సాష్టాంగదండప్రణామము చేసినాడు. ఆ సాష్టాంగదండప్రణామ మిషతోటే కొంచెము తలకాయఎత్తి విగ్రహమువంక జాగ్రత్తగా చూసినాడు. కండ్లను పొడిచివేసే నీలపురంగు, రెప్పపాటులో అది నీలపురంగా, కాక ఊదారంగా అనే భ్రాంతికలిగే కాంతులు సీతారాముల వక్షఃస్థలముమీదనుంచి ప్రసరిస్తున్నవి. అదే మొగలుసమ్రాట్టు వర్ణించిన నీలము. ఆనీలాన్ని చూసినకొద్దీ టావర్నియరు ముగ్ధుడయిపోయినాడు. దేహం పరవశమయిపోయింది. అక్కడనుంచి లేవలేకపోయినాడు. బొందిలో ప్రాణములు ఉంటే దాన్ని పట్టుకొనిపోవలసిందేనని నిశ్చయించుకొన్నాడు. ఇందుకోసరము ఏపనిఅయినాసరే చేయడానికి సంకల్పించుకొన్నాడు. ఆయన పరవశత్వం చూసి పూజార్లంతా ఆయన ఒక మహాభక్తుడనుకొన్నారు. ఫ్రెంచివాడి మనోగతములు వాళ్లు ఎట్లా తెలుసుకోగలుగుతారు. ప్రవర్తనమంతా మహాభక్తుడిదిలాగా ఉంది. అటువంటి భక్తిశ్రద్ధలతో దానధర్మాలు, పూజా పునస్కారాలూ చేయిస్తూ టావర్నియరు నాల్గు రోజులు గడిపినాడు. అయిదోరోజు వచ్చింది. ఇక పట్టలేకపోయినాడు. అర్ధరాత్రివేళ ఆలయములోకి ప్రవేశించినాడు. కాపలాఉన్నవాళ్లనందరిని, నిద్రపోతున్నవాళ్లనందరిని, కదలడానికి మెదలడానికి వీలులేకుండా తాళ్లతో కట్టివేయించినాడు. ఒకడు, అరనిద్రలో అటూఇటూ మెదలుతున్నవాళ్ల పీకలు నులిపివేయడానికి మనుష్యులను నియమించినాడు. అదివరలో తెల్లగుడ్డలు కట్టుకొన్న పరివారమంతా ఆరాత్రి నల్లగుడ్డలు కట్టుకొన్నారు. ఆ అర్ధరాత్రివేళ టావర్నియరు దేవాలయములో ప్రవేశించి సీతారాముల వక్షఃస్థలంలో ఉన్న నీలాన్ని ఎత్తుకొని పారిపోయినాడు.

దేవాలయములోనుంచి బయటకు అడుగువేసిన తక్షణమే టావర్నియరుపరివారము అంతా ఏనుగులెక్కి కదిలిపోయింది. తెల్లవారినతరువాత పూజార్లు నిద్రలేచినారు. ఏనుగులులేవు. ఫ్రెంచియాత్రీకుడు పలాయనమయినట్టు గోచరించింది. దేవాలయము కాపలావాళ్లంతా కట్టివేయబడిఉన్నారు. దేవాలయములోకివెళ్లి చూసినారు. మోసముజరిగింది. నీలాన్ని ఫ్రెంచిభక్తుడు ఎత్తుకొనిపోయినాడు. వాళ్లను పట్టుకోవలెననే ప్రయత్నము కేవలము నిష్ప్రయోజనము. ఏమంటే, నీలముపోయిందని, దాన్ని ఫ్రెంచియాత్రీకుడే ఎత్తుకొనిపోయి ఉంటాడని పూజార్లు నిశ్చయించేసరికి ఫ్రెంచియాత్రీకుడు హిందూదేశము దాటిపోయి ఉంటాడు. ఇక పూజార్లుచేయదగినది ఏమున్నది? "నీనీలాన్ని ఎత్తుకొనిపోయినవాణ్ణి, స్వామీ, నీవే శిక్షించవలెను" అని సీతారాములను ప్రార్థించినారు.

## ౨

మార్గమధ్యములో ఏమాత్రమూ ఆలస్యముచేయకుండా టావర్నియరు ఫ్రెంచిదేశముచేరినాడు. స్వదేశంచేరిన కొద్దిరోజులకే ఆయన చాలా అమూల్యమైన రత్నాలను రత్నగర్భ అయిన భారతదేశమునుంచి తీసికొనివచ్చినాడని వెల్లడైపోయింది. అందులో విశేషించి ప్రపంచంలో అదివరకెవళ్లూ కనీవిని ఎరగని అమూల్యనీలాన్ని ఒకదాన్నికూడా తెచ్చినాడని

ఫ్రాంసుదేశమంతా మారుమోగిపోయింది. ఫ్రెంచి ప్రభువు పద్నాలుగవలూయీ తన ఆస్థానానికి టావర్నియరును పిలిపించినాడు. ఆయన ప్రాచ్యదేశాలనుంచి తెచ్చినరాళ్లనన్నిటిని చూపించమన్నాడు. సీతారాముల నీలాన్నితప్ప తక్కినరాళ్లు అన్నీ చూపించినాడు. అమూల్యమైన నీలంఉందని లూయీకి తెలుసును. బహుశః ధనకాంక్షవల్ల టావర్నియరు ఆనీలాన్ని బయటపెట్టష్టంలేదనుకొన్నాడు. ఆనీలాన్నిచ్చేట్లయితే ఒకలక్షపౌన్లు ఈయడమేకాకుండా ఒకబిరుదుకూడా యిస్తానన్నాడు. టావర్నియరు కావలసినంతధనం సంపాదించినాడు. ధనకాంక్షలేదు. ఆనీలాన్ని తనదగ్గరే వుంచుకోవలెననుకొన్నాడు. కాని ఫ్రెంచిప్రభువు లక్షపౌన్లు ఈయదలచుకొన్నప్పుడు, పైగా ఒకబిరుదుకూడా ఈయదలచుకొన్నప్పుడు నీలాన్ని ఈయకపోతే ఏమవుతుందోననుకొని నీలాన్ని లూయీప్రభువుకు లక్షపౌన్లకు అమ్మివేసినాడు.

టావర్నియరు దేశదేశాలూ తిరుగుతూ అమూల్యరత్నాలు అపహరించుకొచ్చే గొడవలో ఉంటూ ఉండగా ఆయనసుపుత్రరత్నము అంతూపంతూ లేకుండా ఋణాలుచేసివేసి తండ్రిఆస్తినంతా తనఖా పెట్టినాడు. టావర్నియరుఆస్తిఅంతా కొడుకుచేసిన ఋణాలకిందపోయింది. నీలాన్ని అమ్మివేసిన కొద్దిరోజులకే కటికదరిద్రుడైపోయినాడు. ఆశ్వాసాంతకాలములో మళ్లీ ఎక్కడైనా ప్రాచ్యదేశాల్లో యిన్ని రత్నాలు కొట్టుకొనివచ్చి యింతడబ్బు సంపాదించుకొందామని ౧౬౮౯ వ సంవత్సరంలో మళ్లీ బయలుదేరినాడు. మార్గమధ్యంలో విపరీతమైన జ్వరంవచ్చి చచ్చిపోయినాడు.

టావర్నియరు ప్రాచ్యదేశాలలో రత్నాలకోసం తిరుగుతూఉండగా ఏ అడవికుక్కలో చంపి తినివేసినవని కొంతమంది అభిప్రాయము. అయితే అది యథార్థము కాకపోవచ్చును. ఏమంటే ఈ నీలాన్నే ధరించిన అమీరోజెమ్లా అనేవాడు అట్లా అయిపోయినట్లు తెలుస్తున్నందువల్ల టావర్నియరు జ్వరంవల్లనే చచ్చిపోయినాడని అనుకోవచ్చును.

## 3

ఈ నీలంవల్ల లూయీప్రభువుకు ఏమయినా అపకారం జరిగిందా అని యోజిస్తే అంతగా కనపడదు. కాని ఫ్రెంచిసామ్రాజ్యపు పునాదులన్నీ ఈ లూయీప్రభువుకాలంలోనే కదలిపోయినవి. ఫ్రెంచివిప్లవ శంకుస్థాపనము ఈ కాలములోనే జరిగినది. ప్రభుత్వానికి ఆపదలు అప్పుడే ప్రారంభమైనట్లు చక్కగా గోచరమవుతుంది.

లూయీప్రభువు, మాంటెస్పాన్ అనే ఒకానొక అంతఃపురాంగన ఆనీలాన్ని పెట్టుకొని రాజవిందుకు రావడానికి ఎరువు యిచ్చినాడు. అంతటితో ఆయువతిమీద లూయీప్రభువుకు మోజుపోయింది. మోజుపోవడమేకాకుండా అంతఃపురములోనుంచి ఆమెకు ఉద్వాసంకూడా చెప్పినాడు. చివరకామె అధోగతిపాలయిపోయింది. తరవాత కొంతకాలానికి ఫ్రెంచి ఆర్థికమంత్రి నికలస్ ఫొకెట్ అనేఆయన ఆ నీలాన్ని లూయీప్రభువు దగ్గిరనుంచి ఎరువుతీసుకొన్నాడు. నీలాన్ని ఎరువుతీసుకొన్న కొద్దికాలానికే నికలస్ ఫొకెట్ మీద లూయీప్రభువుకు అపరిమితమైన ఆగ్రహంవచ్చినది. ప్రభువుగారి ఆగ్రహంవల్ల పదభ్రష్టుడైపోయినాడు. పదభ్రష్టుడు కావడమేకాకుండా ఎన్నో పరాభవాలనుభవించినాడు. చివరకు జైలులో కూడా పడిపోయినాడు. తరువాత మూర్ఛలవల్ల మరణించినాడు.

ఈనీలాన్ని, ఇంకా యిట్లాంటివే కొన్ని ప్రాచ్యదేశాలనుంచి వచ్చిన రత్నాలను ధరించినవాళ్లంతా నాశనమయిపోతున్నారనే వదంతులు ఆయా దేశాలలో వ్యాపించినవి. ఈ నీలంలో ఒక దయ్యమో, భూతమో ఉన్నదని అందరు అనుకోసాగినారు.

లూయీప్రభువుతరువాత మేరీఅంటొనెట్ అనే రాణి ఆనీలాన్ని ధరించినది. ఆమె ఆనీలాన్ని పెట్టుకొన్న కొద్దిరోజులకే దేశములో మహావిప్లవము ఆరంభమైనది. ఆ విప్లవములో ఆమెను చంపివేసినారు.

రాజ్యము నాశనమైపోయింది. ఆతర్వాత కొంతకాలము వరకు ఆనీలము ఏమయిపోయిందో తెలియదు.

అయితే ౧౭౮౯-వ సంవత్సరములో ఫ్రెంచి దేశములో విప్లవమురాకపూర్వము రాజుగారి రత్నాభరణాలన్ని నాలుగులక్షల ఎనభైవేలపౌన్లు కిమ్మతు చేస్తవని అంచనావేసినారు. ఆ రత్నాభరణాలన్నీ విప్లవములో దొంగలు దోచుకొనిపోయినారు. ఆ దొంగతనములో సంబంధమున్న కొంతమంది దొంగలను శిక్షించినారు.

## ౪

తరువాత పాతిక సంవత్సరాలకు హాలండుదేశంలో ఆమ్స్టర్‌డామ్ పట్టణములో రత్నాలు సానపెట్టే వాడివగ్గిరకి ఈ నీలముచేరినది. పేరుతెలియని ఒకానొక రత్నాలవర్తకుడు ఈనీలాన్ని తీసుకొనివచ్చి తిరిగి సానపెట్టమని యిచ్చినాడు. దానిని సానపెట్టడానికి చాలాకాలము పట్టినది. అది తీరట్లా తయారయ్యేసరికి ఆరోజే ఆ సానపెట్టినవాడికొడుకు ౧౭ ఏండ్లవాడు దానిని దొంగిలించుకొని పోయినాడు. ఆనీలాన్ని దానికిమ్మతులో పదవవంతుకు వాడు అమ్మివేసినాడు. ఆ అమ్మివేసినడబ్బుతో వాడు లంజముండలను మరిగి తెగతాగి చిట్టచివరకు ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఆనీలాన్ని ఫ్రాంసిస్‌జూలియా అనే ఫ్రెంచి యువకుడు కొన్నాడు. వాడిగతి మరీ అన్యాయమై పోయింది. ఆ నీలంవాడికి ఎక్కడా అమ్ముడుపోలేదు. ఆనీలం అమ్ముకోడానికి లండన్ పోవలెననుకొన్నాడు. డబ్బులేదు. అందుకోసరమని ప్యారిస్‌పట్టణములో ఒక వజ్రాల వర్తకునికి కొంతభాగము అమ్మినాడు. వజ్రాల వర్తకుడు కొంతభాగం కోసితీసుకొన్నాడు. మిగతా నీలాన్ని తీసుకొని ఫ్రాంసిస్‌లండన్ వెళ్లిపోయినాడు. ఆనీలంతోపాటు ఫ్రాంసిస్‌వెంట దారిద్ర్యంకూడా వెళ్లింది. అన్నాతురుడై ఫ్రాంసిస్ లండనులో పాకీ పనిచేయడానికి తయారయినాడు. కాని ఆనీలంమీద ఉన్న మోజువల్ల దానిని ఎవరికీ అమ్మలేదు. ఆనీలాన్ని దాచిపెట్టుకోడానికి స్థలములేక కాలిజోడులో పెట్టుకొని పాకీపనిచేస్తుండేవాడు. చిట్టచివరకు దారిద్ర్యభారము ఎక్కువైపోయి అన్నంలేక అల్లాడుతూ మార్గాంతరంలేక రత్నాలవ్యాపారంచేసే డానియల్ ఎలిసన్ అనే "జ్యూ" దేశస్థుడికి అమ్మజూపినాడు. ఆ డానియలు ఆనీలాన్ని తీసుకొని చూసి కొనుక్కుందామా వద్దాఅని ఆలోచించి ౫ వేలపౌన్లు డబ్బు ఈయడానికి నిశ్చయించుకొనేసరికి ఫ్రాంసిస్ కేవలం అన్నాతురుడై చచ్చిపోయినాడు.

౧౮౩౦-వ సంవత్సరమువరకూ ఆనీలం డానియలువద్దనే ఉండిపోయింది. అప్పటికి దానికిమ్మతు ౧౮౦౦౦ పౌన్లుగా నిర్ణయించినారు. తర్వాత కొంతకాలానికి రత్నపరీక్షలో ఆరితేరిన బుద్ధిమంతులు దాని కిమ్మతు ౩౦,౦౦౦ పౌన్లుగా అంచనావేసినారు. థామస్ హెన్రీహోప్ అనేఆయన ఆనీలాన్ని కొన్నాడు. ఆహోపు తిరిగి దానిని నిపుణులైనవారిచేత సానపట్టించినాడు. అందుకోసరం అంతులేనిధనము ఖర్చుఅయిపోయింది. ఆతదనంతరము విశేషకాలము ఆహోప్ అనే ఆయన జీవించలేదు.

థామస్ హెన్రీ హోప్ తరువాత లార్డ్ ఫ్రాన్సిస్ హోపుకు ఆనీలమువచ్చినది. ఫ్రాన్సిస్ హోపు హస్తగతమైన రెండుమూడుసంవత్సరములలోపలనే ఆయనకు దుష్కాలము ఆరంభమై సమస్తవిధములైన దుఃఖములూ అనుభవించినాడు.

౧౮౯౪-వ సంవత్సరంలో ఫ్రాన్సిస్‌హోప్, మేమోహా అనే నాట్యకత్తెను పెండ్లిచేసుకొన్నాడు. ఆమె త్రిలోకసుందరి. ఆసుందరిఈనీలాన్ని పెట్టుకొన్నది. నీలాన్ని ధరించేసరికిఆమెచిత్తవృత్తులన్నీ మారిపోతాయి.

ఆమెకు హోపుతోవుండడం యిష్టములేక పోయింది. పెనిమిటిని వదలిపెట్టి మరొకణ్ణి తగులుకొని వాడితోలేచిపోయింది. ఆనీలాన్ని ధరించడంవల్లనే అట్లాంటి దుర్బుద్ధిపుట్టినట్టు ఆమేచెప్పింది. ఆనీలము పెట్టుకొనివున్నంతసేపూ పెనిమిటితో వుండబుద్ధి పుట్టేదికాదట! ౧౯౦౨-వ సంవత్సరంలో ఫ్రాన్సిస్ హోపు భార్యను వదలిపెట్టడానికి దావాతీసుకొని వచ్చి

కృతకృత్యుడైనాడు. అటుతరువాత ఆయనకు దారి ద్ర్యమువచ్చి నీలాన్ని అమ్మివేసినాడు. అప్పటికే అంటే ౧౯౦౨-వ సంవత్సరమునాటికే ఈనీలము ధరించేవాళ్లకు కలిగే దుష్ఫలాలతో యూరపుఖండ మంతా మారుమోగిపోయింది.

౫

౧౯౦౮-వ సంవత్సరములో రష్యాదేశపువాడు, రాజవంశములోవాడు, కోటేశ్వరుడూ, క్యాన్టో విస్కీ అనేవాడా నీలాన్ని కొన్నాడు. ఆనీలము అతనిదగ్గరకు చేరినకొద్దికాలానికే "లాడ్యూ" అనే ఒకానొక ప్రసిద్ధనాట్యకత్తెమీద విపరీతమైన అనురాగముకలిగినది. అతనికామెమీద కల్గిన అనురాగమునుంచి ఆమెనాట్యంచేసేటప్పుడు మెడలో పెట్టుకోడానికి యిచ్చినాడు. ఆమె తనతెల్లనిమెడలో ఈ నీలాన్ని- క్షణలేశములో కళ్లుపొడుచుకుపోయేటట్లు వెదజల్లే నీలపుకాంతులు, ఉత్తరక్షణలేశములో కళ్లు మిరుమిట్లు గొలిపే ఊదారంగుకాంతులను ఈనే ఆ నీలాన్ని-అలంకరించుకొని నాట్యముచేస్తున్నది. ఆమె నాట్యముకైతేనేమి, ఆమెధవళగళముమీద నాట్యము చేస్తున్న నీలానికైతేనేమి ప్రేక్షకులందరు విభ్రాంతులైపోయినారు. ఆప్రేక్షకులలో ఆమెప్రియుడొకడు ఆఆకర్షణీయ విగ్రహాన్నిచూసి కోపముపట్టలేక చివాలునలేచి జేబులోనున్న రివాల్వరుతీసి ఆమెకంఠానికి గురిపెట్టి కనురెప్పపాటులో కాల్చివేసినాడు.

ఈవిపరీతం జరిగిన రెండురోజులకు క్యాన్టో విస్కీని ప్యారిసునగరంలో ఎవరో పొడిచి చంపి వేసినారు.

క్యాంటోవిస్కీ హత్యసంగతి తెలిసి ఆనీలాన్ని అమ్మిన కలాట్ అనేరత్నాలవర్తకుడు తనకాయన దగ్గరనుంచి రావలసిన మిగతాబాకీ వసూలుకాదనేవిచారంతో ఆత్మహత్యచేసుకొన్నాడు.

తరువాత కొంతకాలానికి చేతులుమారిమారి ఒక గ్రీకురత్నాలవర్తకుడిచేతులోకి చేరినది. ఆనీలము చేరినరోజు రాత్రే ఆగ్రీకువర్తకుడు భార్యాపిల్లలతో గుఱ్ఱబ్బండిలోవస్తూఉండగా ఆగుఱ్ఱబ్బండి ఒకగుట్టకు కొట్టుకొని బండిపడిపోయి బండిలోఉన్నవాళ్లంతా చావడానికి సిద్ధమయినారు. ఇక ఈనీలమువుంటే ఏమి కొంపముణుగుతుందోననుకొని ఆగ్రీకువర్తకుడు తుర్కీ సుల్తాన్ అబ్దుల్‌హమీదుకు ఎట్లాగో అమ్మివేసినాడు.

నీలం ప్రాచ్యదేశంలోకి తిరిగివచ్చింది. ప్రాచ్య దేశములోనికివచ్చినా దానిస్వభావము ఎక్కడికి పోతుంది? నీలము సుల్తానుదగ్గిరికి చేరినకొద్దిరోజులకే సుల్తానునగలనుభద్రపరిచే సేవకుడిమీద సుల్తానుకు తీవ్రమైన కోపమువచ్చినది. ఆకోపమునుంచి ఆసేవకుణ్ణి చావగొట్టించి చీకటిగదిలో పడవేసినాడు. ఆచీకటి గదిలో ఉండగాఉండగా వాడికిపిచ్చెత్తింది.

తర్వాత కుతుబ్‌బే అనే ఖోజ్జావాడు సుల్తాను నగలనన్నింటిని చూస్తుండేవాడు. వాడు సుల్తానుకు చాలాముఖ్యుడు. వాడిని ఎవరో గొంతుపిసికి చంపివేసినారు. అంతటితో ఆనీలముయొక్క ప్రభావము ఆగిపోలేదు. తుర్కీదేశంలో తురుష్క యువకులవల్ల మహావిప్లవముకలిగినది. ఆవిప్లవములో సుల్తాను రాజ్యభ్రష్టుడు కావడమేకాకుండా ప్రాణాలుకూడా కోల్పోయినాడు.

మళ్లీ కొంతకాలము ఆ సీతారాముల నీలము ఏమైపోయిందో, ఎక్కడికిపోయిందో, ఎవరిప్రాణాలు అపహరిస్తున్నదో, ఎవరికొంప ముంచుతున్నదో తెలియ లేదు. అయితే ౧౯౧౧-వ సంవత్సరంలో అమెరికా దేశంలో రత్నాలవ్యాపారం చేసేవారిదగ్గిర ఎడ్వర్డ్ బి. మిలీన్ అనేఆమె కొన్నది. కొన్నవెంటనే ఆ రత్నాలవర్తకులకూ ఆమెకు తగాదావచ్చి వ్యాజ్యాలలోకి దిగినారు. ఆనీలాన్ని విక్రయించేటప్పుడు దాని కిమ్మతు ౬౦౦౦౦ పౌన్లుగా నిర్ణయించినారు. అది కొన్నవాళ్లకు ఏదైనా అశుభముకలిగేటట్లయితేఅమ్మిన వాళ్లు వాపసుపుచ్చుకోనేటట్లూ, ఆనీలము వాపసు చేసినవారికి ౫౨౦౦౦ పౌన్లు అమ్మినవారు ముజరా యిచ్చేటట్లూ షరతుతో విక్రయం జరిగినది.

ఆనీలాన్ని కొన్న ఎడ్వర్డ్ డి. మిలీన్, వాషింగ్టన్ నగరములో రష్యా రాయబారివచ్చిన సందర్భంలో ఒక్కసారిమాత్రమే పెట్టుకొన్నది. తరువాత కొద్ది రోజులకే, అంటే ౧౯౧౯-వ సంవత్సరంలో విపరీతమైన అవాంతరము వచ్చినది. ఆమెకు విన్సన్ మిలీన్ అనే ఒక్క పసికందుమాత్రము ఉన్నాడు. ఆబిడ్డను ఒకనాడు దాది చిన్నలాగుడుబండిలో కూర్చోబెట్టి షికారుకు తీసుకొనిపోయినది. ఆబండి బిడ్డతోసహా ఒక మోటారుకారుకిందపడి నలిగిపోయింది. బిడ్డ స్వరూపాన్ని అయినా గుర్తించడానికి వీలులేక పోయినది.

పొగన్ పట్టణంలోనుంచి టావర్నియరు అనే ఫ్రెంచియాత్రీకుడు సీతారాముల వక్షస్థలంలోనుంచి అపహరించుకొనివచ్చిన నీలము ౧౯౧౯-వ సంవత్సరం నాటికి యింతమందిని యిన్నివిధాల నాశనముచేసింది. కొంచెమించుమించు భూగోళాన్ని అంతా చుట్టబెట్టింది. రెండుమూడుసార్లు స్వరూపము మారినప్పటికీ స్వభావముమటుకు మారలేదు. ఎక్కడికిపోతే అక్కడ ధ్వంసము చేయవలసినదే.

ఆనీలాన్ని ఎన్నివేల సంవత్సరాలనాడు ఎవరు ఏగనులలోనుంచి తీసినారో తెలియదు.

---

# జలపాతము

కపిస్థలం శ్రీరంగాచ

నా హృదయమహాబ్ధిలోని
ఆభీల వ్యథాబడబాగ్ని జ్వాలలను
శీతలశీకరాంబువుల నార్పిన
ఓ జలపాతమా!
ఏమని పాడుకోఁగలను
నీమహిమంబును?
ఆ నీనాల్గవకోనలో
భావము లెన్నియో యుబికి,
నుడిలో రాలేక, రాలేక,
క్రుంగి,
కృశించి,
నాయందే లయ మొందునే!—
నీ ఘనఘోషలో
విహగమోహనగానము లింకిపోవుచో;
అచటి పచ్చని, చల్లని
చెట్లబోదెలను
చెంతలతీవలు కౌఁగిలించుచో;
నీయెదుటంగల నాచుబండపయి
కూర్చొని,
చల్లనినీట నేనడుగు లార్చుచు,
రంగుల సంజమబ్బులతో
నీప్రతిబింబము చూచుచో;
చల్లని నీటితుంపరల
హాయిగ, హాయిగా చిలుకు
తెమ్మెరపిల్లల కౌఁగిలింతలో
నే నరగన్ను మోడ్చుచో;
నా ప్రతిరక్తనాళమున పారెడు
నీనైసర్గికరామణీయకము
వర్ణింపనే లేని
మూగకవి నౌదునె
నాజలపాతమా!
వర్షాకాలపు రాత్రిలో,
కటికి-చీఁకటిలో,
నీ చెలువంపుకోనలో,
నాపై నీవు నటించుచుండ—
నా హృదయమహాబ్ధిలో
ప్రణయమోహననౌకకు కర్ణధారినై,
నా ఊహలరాణితో సలుపు
కౌముదీవిహారణంబుల కౌఁగిలింతలో
కరఁగి,
నీరయి—
నీలో నేను
జీర్ణింపనా!...... ...
ఊహల కేమిగాని—
నా అంతర్లోకవియత్తలాన
ఘనమేఘౌఘంబులు
ఆశాచంద్రుని మ్రింగఁగా,
తన వీచీనాట్యము మాని,
నా హృదయ మల్లాడుచో
ఆ తీరాన
నీ గంభీరమనోజ్ఞగానయుత
తాండవనృత్యము చేయుచుండుమా!

లేదు. వారి సత్కృతిప్రతిభలకు నేను మిగుల నబ్బురపడితిని. వారికి సేవచేయు భాగ్యమే కాని వారితో సంభాషించు భాగ్యమప్పుడు నాకు కలుగలేదు.

౧౯౨౮-వ సంవత్సరమున రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో నేను ఇంటరుమీడియటు చదివితిని. వేసంగి సెలవులలో నేను, నామిత్రుడు ఆంధ్ర శేషగిరిరావుగారును చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి దర్శనార్థమై వారియింటికి పోతిమి. అప్పటికి నేను కొన్ని తెనుగు వ్యాసములు వ్రాసి ప్రకటించితిని గాని వానిని పంతుల వారు చూచియుండరు. మేము పోగానే సాహిత్యరస పిపాసువులమనియు, దర్శనార్థమయి వచ్చితిమనియు తెలిసికొని శ్రీ పంతులుగారు మాయెడ చూపినయాదరానురాగములకు మేరలేదు. తల్లితొడమీద గూర్చున్న పిల్లలవలె మేము వారితో నెంతో చనవుతీసికొని మాట్లాడితిమి. వివిధవిషయములను గూర్చి ప్రసంగము నడచెను. ఆధునికకవు లెవరినో గూర్చి పంతులవారి యభిప్రాయ మడిగితిమి. వా రాయాకవులనుగూర్చి యథోచితముగ ప్రసంగించుచు మొత్తముమీద ననేకులను మెచ్చుకొనిరి. సజీవులగు నితరకవుల కవిత్వము నింత యుదారముగను, నింత ధారాళముగను ప్రశంసించినవా రింకొకరు మాకు గానరా లేదనుటలో నతిశయోక్తి లేదు. నిత్యము వారిదర్శనార్థమయి యెవరో యొకరు వచ్చుచు బోవుచునే యుందురుగదా! అందుచే నానాటి సమావేశమును గాని, మమ్ముగాని శ్రీపంతుల వారు జ్ఞప్తియుంచుకొనవలసిన విశేషయోగ్యత దాని యందు లేదు గాని మాకుమాత్ర మానాడు పన్నీటిలో జలకమాడినట్లుండెను. ఆనాటి వారి వాక్యలత లిప్పటికిని మా హృదయోద్యానమున సురభిళించుచునే యున్నవి.

౧౯౩౨-వ సంవత్సరము మార్చి నెల కాబోలును, నేనప్పటికి ప్లీడరీలోకి ప్రవేశించితిని. రామచంద్రపురములో ప్రాక్టీసుచేయుచు నొకనాడు రాజమండ్రిలో కోర్టుపనిమీదవచ్చి సాయంకాలము గోదావరీ హిందూసమాజమునకు పోగా నచ్చట చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు కొందరు విద్యార్థులతో నిష్టాగోష్ఠి నడపుచుండిరి. ప్రబంధయుగమందలి తెనుగుకవులనుగూర్చి కొన్ని యుదంతములు వారు చెప్పుచు నడుమనడుమ పద్యము లుదాహరించుచు నిరర్గళమగు హాస్యరసముతో శ్రోతలను కడుపుబ్బ నవ్వించుచుండిరి. ప్రసంగవశమున "ప్రాలేయాచల కన్యకావదన సంభవత్పుష్ప సౌరభ్యమున్" అను తెనాలిరామకృష్ణుని పద్యమును చదువుచు నడుమ నేదోభాగము జ్ఞప్తికిరాకపోగా నే నందిచ్చితిని. దృష్టినిరోధముండుటచే శ్రీపంతులుగారు కంఠస్వరమునుబట్టి సాధారణముగా మనుజుల నానవాలు పట్టుచుందురు. నాది క్రొత్తకంఠస్వరమగుటచే "ఎవరువా" రని ప్రశ్నించిరి. అక్కడనున్న స్నేహితు లొకరు వారికి నాతో పరిచయము గల్పించిరి. మరునాడు నేను హిందూసమాజమందిరమున భారతమును గూర్చి ముచ్చటించుటయు, దానికి శ్రీ పంతులవారధ్యక్షతవహించుటయు జరిగెను. ఆదినము మొదలు కొని వారు నాపేరు గుర్తుపెట్టుకొనిరి. ఆంధ్రసారస్వతమునం దేమాత్ర మభిమానము చూపువారిపట్లనయిన వాత్సల్యామృతము గురియుట వారి కభ్యాసమగుటచే నాటినుండియు నేను వారి యనురాగమునకు బాత్రుడనైతిని.

ఈనడుమనే నేనును, నామిత్రులు కందుకూరి రామభద్రరావుగారును, ఎంకనూరి సత్యనారాయణరావుగారును వారి సందర్శనార్థ మొకసాయంకాలము పోయితిమి. ఆనాడు ప్రసంగవశమున పంతులవారు శ్రీకందుకూరి వీరేశలింగముపంతులగారిని గూర్చి ముచ్చటింపవలసివచ్చెను. అప్పుడు వారి యానందమునకు మేరలేదు. ధర్మరంగమున పరాక్రమనృత్యమొనర్చి ఆధునికాంధ్రచారిత్రమున క్రొత్తతేజము గల్పించిన మహాపురుషుని యాంతరంగిక వర్గమునకు జెందిన శ్రీలక్ష్మీనరసింహముగారు వారి దినచర్యను గూర్చి, కార్యదీక్షను గూర్చి, నిర్భయస్వభావమునుగూర్చి, యుద్ధప్రీతినిగూర్చి పుంఖానుపుంఖములగు నుదంతముల నుదాహరించుచు నుద్వేగముతో భాషించిరి. అప్పుడు నాలో నేను "ధన్యోస్మి" యనుకొంటిని. అసూయావిష్టమనియు, నన్యోన్య ద్వేషభూయిష్ఠమనియు పేరుగాంచిన యాంధ్ర

నాయకమండలిలో నక్కడక్కడ రత్నములవలె గుణగ్రహణపారీణులును, వీరారాధనతత్పరులును నగు నుత్తమపురుషులు లేకపోలేదనియు, వారున్నంతకాలము నాంధ్రాభ్యుదయమునకు లోటురాఁగూడదనియు నాలో నాకు ధైర్యముతోఁచెను.

ఎంతటివారి నైనను ముగ్ధులనుగాఁ జేయఁగల శక్తి శ్రీ లక్ష్మీనరసింహముగారి కున్నది. మల్లెపువ్వవలె వారిమనస్సు స్వచ్ఛమయినది. ఎవ్వరి నైనను ప్రథమమున పలుకరించుటయందే వా రనురాగరసమును చిలుకరించుచుందురు. దేశభక్తి, దైవభక్తి మున్నగు వారి యుత్తమగుణముల నటుంచఁగా ఎదుటివారి హృదయము నెంతమాత్రమును నొప్పింపకుండ నెంత పరిచయము లేనివాని నైనను నిముసములో బంధుకోటిలోఁ జేర్చుకొనఁగల మహిమ శ్రీ లక్ష్మీనరసింహముపంతులుగారి వాక్కునకు నన్నతోఁ బెట్టిన విద్య.

## ౨

## పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు

నాకు పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులుగారితోఁ బరిచయము గలిగినసందర్భము మిగులఁ జిత్రమయినది. ౧౯౨౧-వ సం.మున ఒక నాఁటి సాయంకాలము నేను పి. కారుపల్లి ఇంటికి రాఁగా శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారు నాఁడు తమ్ము లక్ష్మీనరసింహరావుపంతులుగారు చూడ వచ్చిరనియు, నూతనముగ పంతులవారు ప్రకటించిన సరస్వతియను నాటకమును తమకు సమర్పించిరనియు నెలవిచ్చి దానిని ముందుగ నన్ను జదువుమని నాకిచ్చిరి. అదివరలో లక్ష్మీనరసింహరావుగారి నాటకములను నేను చాల శ్రద్ధాభక్తులతోఁ బఠించి యానందించుచుండుటచే తక్షణమే సరస్వతినిఁగూడఁ బఠింప మొదలిడితిని. అనురాగ మెక్కువయున్న వ్యక్తులను గూర్చి మనస్సొకప్పుడు నిష్కారణముగ నపోహపడుచుండును. అదేమోగాని నాటకమును సాంతముగఁ జదువకుండఁగనే పంతులువారి నాటకములను బూర్తిగ పాడుచేసిరనియు, అందు మంచినాటకముల కుండవలసిన లక్షణ మొక్కటియు లేదనియు నాకుఁ దోఁచెను. శ్రీ పంతులవారు నా కపరిచితులని యైన నెంచక వెంటనే వారికేర నాయభిప్రాయమును తెలియపరచుచు నాటకమును తీవ్రముగ ఖండించుచు నొక యుత్తరము వ్రాసి పోష్టుపెట్టెలో వైచితిని. కాని మరునాఁడుదయమున మరల పుస్తకము నింకొకసారి చదువఁగ నాటకము సరసముగనే యున్నట్లు తోఁచెను. "అయ్యవార్లవా రేమిచేయుచున్నారనఁగ నసత్యములాడి దిద్దుకొనుచున్నా"రనినట్లు నేను వెంటనే నాయభిప్రాయము ప్రమాదజనితమనియు, క్షమింపవలెననియు పంతులవారిని వేఁడికొనుచు మరియొకయుత్తరమును వ్రాసి పడవైచితిని. ఈరెండుత్తరములు వారి కేకకాలమునఁ జేరియుండవచ్చును. "ఈవిచిత్రవ్యక్తి ఎవ"రని పంతులవా రాశ్చర్యపడి యుందురు గాని మానవప్రకృతిజ్ఞానమున నాధునికాంధ్రకవులలో ప్రధానాచార్యపదవి నధిష్ఠించు శ్రీ పంతులవారు నేనుపడిన



పానుగంటి లక్ష్మీనరసింహముగారు

తొందరకూడ అనురాగజనితమేయని గ్రహించి యాదరపూర్వకముగ ప్రత్యుత్తరము ననుగ్రహించిరి. అటుతరువాత కొన్ని దినములకు మా ప్రథమసమావేశము శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారి సమక్షమున నడచెను. శ్రీపంతులవారు నాయెడ నకారణవాత్సల్యము బ్రకటించుచుఁ దమ గ్రంథముల నన్నిటిని నా కుచితముగ నొసఁగిరి. తరువాత కొన్ని దినములవరకు మా మైత్రి దినదిన ప్రవర్ధమాన మగుచుండెను.

ఈసందర్భమున నేను చేసిన యింకొక కొంటె పని కూడ ఇక్కడ విశదీకరింపవలసియున్నది. ౧౯౨౮-వ సంవత్సరము మార్చి నెలలో ఇంటరుమీడియటుపరీక్షలు ముగిసిననుక నేను సాక్షిమీఁద విమర్శనము వ్రాసి యాంధ్రపత్రికకుఁ బంపితిని. అందు పంతులవారి గ్రంథమున నాకుఁ దోఁచిన మంచిచెడ్డలను రెండిటిని అప్పటికి నాకున్న శక్తిననుసరించి విశదీకరించితిని కాని నేను శ్రీపంతులవారిని అచిరకాలములోనే పిఠాపురమునఁ గలసికొనినప్పుడు ఈవిషయము ముచ్చటించుచు నేను వారిగ్రంథమును గూర్చి వ్రాసిన ఖండనభాగమును మాత్రమే వారికి నివేదించితిని. అప్పటికింకను నా వ్యాసము పత్రికలోఁ బ్రకటితముకాలేదు. నామాటలను విన్నవెనుక పంతులవారికి నాపై తీరని కోపమువచ్చుటలో నాశ్చర్య మేమియులేదు. "ఇప్పుడిప్పుడే నా గ్రంథములపై మీరు విమర్శనము వ్రాయవలదు. ఇంకను కొంత పాండిత్యము, లోకజ్ఞానము సంపాదించుకొన్న వెనుక వ్రాయవచ్చును" అని వారు నన్ను మందలించిరి. నాకొంటెతనమునకు నాలోనేను నవ్వుకొనుచు "నేను మీకు భట్రాజును కావలెనని కాఁబోలు మీయభిప్రాయము! అట్లెన్నఁడును జరుగదని నిశ్చయముగ నమ్ముఁడు" అని చెప్పి వారియొద్ద సెలవుపుచ్చుకొని వచ్చితిని. అదిమొదలుగ మేము మాటలను, ఉత్తర ప్రత్యుత్తరములను గట్టిపెట్టితిమి.

నాయం దనురాగముగల పంతులవారుమాత్రము నాయోగక్షేమమును పరోక్షముగ విచారించుచునేయుండిరి. తరువాత నొకనాఁడు, అనఁగా ౧౯౩౦-వ సంవత్సరము మార్చినెలలో ఆకస్మికముగ మేము శ్రీ కూచి నరసింహముపంతులవారియింటఁ గలసికొంటిమి. పంతులవారు నన్నెంతో యాదరించి తమయింటికి తీసికొనిపోయిరి. ఆనాఁడు మధ్యాహ్నము ఒంటిగంట మొదలుకొని సాయంకాల మూరుగంటలవరకు మేము ఇష్టాగోష్ఠి నడపితిమి.

పిఠాపురమునందు మాకు దగ్గరబంధువుఒకరున్నారు. వారియింటికి నేనప్పుడప్పుడు పోవుచుందును. ఎంత యర్ధరాత్రమునందు పోయినను శ్రీపంతులవారు నిద్రనుండి మేల్కొనియైన నాకు దర్శన మిచ్చుచుండిరి. నేను వచ్చెదనని చెప్పిన సమయమునకు రాక యాలస్యముచేసితినా ఈలోపుగ మాబంధువులయింటికి రెండుమూఁడు కబుర్లు వచ్చెడివి. పంతులవారికి సుమా రరువదియేనిమిదేండ్ల వయస్సు. నాకు ముప్పదియేండ్లు. అయిననేమి, వారు తమకీడుజోడు అయినట్లుగ నాతో మాటాడుచుండిరి. మేమిరువురము గలసికొనినప్పుడు గంటలు క్షణముల వలె నెగిరిపోవుచుండును. అంతటి యుపజ్ఞాశాలిని నేను జూచియెఱుఁగను. ఒకమారు వారు శ్రీపిఠాపురము మహారాజావారితోఁ గలసి యొనర్చిన ఉత్తరహిందూదేశయాత్రను గూర్చి ముచ్చటింతురు. ఇంకొకమారు వాల్మీకికవితామాధుర్యమును గూర్చి యుద్వేగముతో నుపన్యసింతురు. మరియొకమారు షేక్స్పియరు మానవ ప్రకృతిజ్ఞానమును విపులీకరింతురు. ఒకొక్కప్పుడు శ్రీరామకృష్ణపరమహంసనుగూర్చి, వివేకానందునిగూర్చి కాని వారి గ్రంథములనుగూర్చిన ప్రత్యేకోదంతము లేవైనను న్న వానిని గూర్చి కాని సెలవిచ్చుచుందురు. ఆసమయములందు జంఘాలశాస్త్రిధోరణి కొంత జ్ఞప్తికివచ్చుచుండును.

వారి శేయంశమును గూర్చి మాటాడిననుసరే రెండువిషయములు మన కద్భుతావహముగఁ దోఁచుచుండును. మొదటిది వారి ధారణాశక్తి. ఏనాఁడు చదువుకొన్నదానినైనను వారు నిలుమన్న పాటున "తూచ"లు తప్పకుండ నప్పఁజెప్పఁగలరు. రెండవది వారి ప్రతిభ. అంతటి ప్రతిభాశాలి యాధునికులలో లేఁడని చెప్పిన నతిశయోక్తి లేదు. సంస్కృతమునందు, ఇంగ్లీషునందు నున్న ఉత్తమనాటకములలో ననేకములను వారు

యొక్కయు, శ్రీరామకృష్ణ పరమహంసయొక్కయు, శ్రీ వివేకానందునియొక్కయు, శ్రీగౌరాంగ దేవుని యొక్కయు పటములు. ఒకగోడపై మరల ప్రత్యేక ముగ "శిష్యపరమాణువు" దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాసిన పద్యముతో గౌరాంగదేవుని చిత్రపటము. కృష్ణాజినము పరచిన పడకకుర్చీపై పద్మాసనముపై చుకొని, చేత తులసితావళము త్రిప్పుచున్న కూటి నరసింహముపంతులవారు నాకు ప్రథమసందర్శనమున గోచరించిన దృశ్యము లివి. ఆముఖమండలమున శాంతరసము మూర్తీభవించియున్నది. విశాలములగు నాకన్నులనుండి శ్రీరామచంద్రుని పాదారవిందముల నభిషేకించు బాష్పధార లెంతసమృద్ధిగఁ బ్రవహించియుండునో! పచ్చని దబ్బపండువంటి దేహచ్ఛాయతో పద్మాసనము వైచుకొని కూర్చున్న వారిని చూడఁగనే రామకృష్ణ మఠము నందలి సన్యాసులు జ్ఞప్తికి వచ్చిరి కాని ప్రాకృత పురుషు లెవ్వరును జ్ఞప్తికి రాలేదు. ఆగదియందు మందపవనములవలె నొకవిధమగు పవిత్రత, భక్తిసారభ్యము సంచరించుచుండెను.

నా ప్రథమసందర్శనము ౧౯౩౦-వ సంవత్సరము మార్చి నెలలో. అప్పటికి ప్రధానోపాధ్యాయపదవికి స్వస్తిచెప్పి పంతులవారు నిఘంటుకార్యాలయమునఁ బ్రవేశించిరి. పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులు గారికంటె వీరు రెండుమూఁడేండ్లు చిన్నవారయ్యు వారికంటె వయోవృద్ధులుగఁ గానవచ్చుచుందురు. అప్పటికి నేను వీరి కపరిచితుఁడను. నాగోత్రనామములు నేనే చెప్పుకొని పరిచయము గలిగించుకొనవలెనని బయలు దేరితిని. పంతులవారికి నమస్కరింపఁగ వారికెదురుగ నొక యాసనముపైఁ గూర్చుండుమని వారు సెలవిచ్చిరి. అనంతరము

నరసింహముగారు—అయ్యా, తమ రెచ్చటివారు?

నే—రామచంద్రపురమండి.

న—అక్కడ నేమిపనిచేయుచున్నారు?

నే—ప్లీడరుపని.

పంతులవారికి రామచంద్రపురములో మునసబుకోర్టున్నదని తెలియదు.

న—చెట్టుక్రింద ప్లీడరీయా?

నే—కాదు, మునసబుకోర్టులో ప్లీడరీయే.

న—అయ్యా, నేను తెలియక ప్రశ్నించితిని. క్షమింపుఁడు. రామచంద్రపురములో మునసబుకోర్టున్నదా?

నే—ఉన్నదండి.

న—మీరు బి. యె. లో నేగ్రూపు తీసికొన్నారు?

నే—తెనుఁగు గ్రూపు.

న—అయితే మీకు తెనుఁగుభాషపై నభిమానముగలదనమాట.

నే—పానుగంటిలక్ష్మీనరసింహరావు పంతులుగారి సాక్షిపై నేను విమర్శనముకూడ వ్రాసితిని.

ఈ వాక్యము ముగింపకుండఁగనే "పంతులుగారూ" అనుకేక వినవచ్చినది.

న—అదిగో లక్ష్మీనరసింహరావు పంతులవారు వచ్చిరి.

అని శ్రీనరసింహముగారు ఎదురేగి వారిని తోడ్కొనివచ్చి తామిదివరలోఁ గూర్చుండిన పడకకుర్చీపై వారినిఁ గూర్చుండఁబెట్టి తాము ప్రక్క నొక నిలువుకుర్చీపైఁ గూర్చుండిరి. "వీరిరువురికి బాల్యస్నేహమని వినుచుందును. ఇప్పటి పెద్దలవలె ఒకరినొకరు 'ఒరే' యనుకొనుట గాని, "అతిపరిచయా దవజ్ఞా" యనినట్లు నిర్లక్ష్యముగ సంచరించుటగాని లేదే" యని నాలోనే నద్భుతరసమున్నుఁడనైతిని. చాలకాలము క్రిందట చూచినవారగుటచే నన్ను మొదట లక్ష్మీనరసింహరావుపంతులవా రానవాలుపట్టఁజాలక పోయిరి గాని క్రమముగ నానవాలుపట్టినవెనుక వారియానందమునకు మేర లేదు. ఎన్నేండ్లక్రిందటనో దూరదేశమునకు పోయి "ఉన్నాఁడా లేఁడా" యను సందేహమున కొప్ప

గూడయిన కుమారుని యాదృచ్ఛికముగ తలవనితలంపుగఁ గనుగొన్న తండ్రి కెంత సంతోషముండునో "నేను ఫలానివాఁడ" నని తెలిసికొనిననుక వారి కంతసంతోషముదయించెను. వారు నరసింహముపంతులవారితో నన్నుగూర్చి ఏవేవో యనురాగపూర్వకవాక్యములు సెలవిచ్చిరి. "ఈయన మద్రాసువిశ్వవిద్యాలయమున నాంధ్రోపన్యాసకుఁడుగ నుండువాఁడు. సాహిత్యసేవ విడి లాయరుగఁ బ్రవేశించినాఁడు. ఇది మిగుల శోచనీయమే" యని నరసింహముగారితో పలికిరి. అంతట నరసింహముగారు "ఇది స్వతంత్రవృత్తిగదా. ఇందులో మాత్రము వీరు సాహిత్యసేవ చేయఁగూడదా" యని పలికిరి. అనంతరగ మిరువురును గలసి "మీకు తీఱుక యున్నప్పుడెల్ల సాహిత్యసేవ చేయవలెను." అని నన్ను కోరిరి. "మీరు నాకు గురుతుల్యులు. మీయాజ్ఞ శిరసావహించుచున్నాను." అని వారితో మనవిచేసికొంటిని. అప్పుడు నరసింహముగారు తమచే రచింపఁబడిన గౌరాంగచరిత్రప్రతి నొకదానిని నాకొసఁగుచు "మహారాజశ్రీ నంబూరి బంగారయ్యగారికి" అని దానిపై వ్రాయఁబోవుచుండిరి. "ఇది యేమన్యాయము స్వామీ? నేను మీకు శిష్యప్రాయుఁడను. 'చిరంజీవి నంబూరి బంగారయ్యకు' అనితప్ప వేరొకరీతిని వ్రాయుటకు నే నంగీకరింపను" అని పలుకఁగ వారు నా ప్రార్థన నంగీకరించిరి. అప్పటితో నా సమావేశము ముగిసెను. నాఁడు మధ్యాహ్నము మరల రెండుగంటలకు వారి సన్నిధికి నేను బయలుదేరితిని. నాతో నరసింహారావు పంతులవారును వచ్చిరి. ఈ నడుమ శ్రీ రామకృష్ణపరమహంసజీవితమును రామకృష్ణామిషనువారు విపులముగ వ్రాసి ప్రకటించిరనియు, దానిని తెనుఁగులోని కనువాద మొనర్పవలసినదనియు శ్రీనరసింహముగారిని నేనుకోరితిని. ఆదినమంతయు శ్రీ రామకృష్ణపరమహంస చరిత్రమునుగూర్చి మేము ముచ్చటించుకొంటిమి. తరువాత రెండుమూఁడుసారులు నేను శ్రీనరసింహముపంతులువారిని దర్శించితిని. ఎప్పుడు వారిసన్నిధి కేగినను నాకొక దేవాలయమునఁ బ్రవేశించినట్లుండును. వారిసంభాషణములో వినయము వెల్లివిరియుచుండును. శివుని జటాజూటమునుండి జాహ్నవీనది ప్రవహించునట్లు వారి మూర్తినుండి భక్తిరసవాహిని ప్రవహించుచుండును. ఆంధ్రదేశమున వేనకువేలు శిష్యులు వారి మూర్తిని తమ హృదయభవనములలోఁ బ్రతిష్ఠించుకొని పూజించుచుందురు. అపథవర్తనమున కున్ముఖములైన యెన్నిజీవితములను వారు సన్మార్గమునకుఁ ద్రిప్పిరో యెవ్వరు చెప్పఁగలరు? ఆధునికాంధ్రజాతీయ జీవితమునకు తేజమును, సౌందర్యమును, సౌరభ్యమును ఒసఁగూర్చిన యుత్తమపురుషులలో వీరొక్కరని నిస్సందేహముగ వచింపవచ్చును.

## ౪

ఈపురుషసింహములు మూఁడును ఇప్పుడు గోదావరీతీరమున విహరించుచున్నవి. వంగదేశమున బంకిమ్‌చంద్రుని చూచుకొని, ఇంగ్లీషులో బెర్నార్డుషాను చూచుకొని, థామస్ ఆర్నల్డు (Tomas Arnold of Rugby) ని చూచుకొని మరియు టేకాని తమజాతీయ వీరుల మాహాత్మ్యమును గ్రహించి యారాధించు సుదినము లింకను ఆంధ్రదేశమునకుఁ బట్టలేదు. ఇతరజాతులలోను, ఇతరభాషలలోను మహాకవులు, మహాపురుషులు నున్నచో నారాధ్యులు కారని కాదు. కాని మనదేశమునకూడ నంతటివారు, నంతకంటె నెక్కువవారు ఉన్నారను స్వస్వరూపజ్ఞాన మాంధ్రులకు లేకపోయినచో జాతీయాభ్యుదయమునుగూర్చి మనము నిష్పృహ వహింపవలసియుండును. విదేశస్థులపై చూపుమొగ్గరములో సగమైన నాంధ్రజాతికలంకారములుగ నున్న నాయకరత్నములమీఁదను, పురుషసింహములమీఁదను చూపవలసినదని మా వినయపూర్వక ప్రార్థన.

మానసబలసరోవరము - కాశ్మీరము V. R. C.



గయ R. N. N. R.

# అంగారకుడు - జీవవర్గము

గూడూరు వెంకటచలం

**మూ**డువందల యేళ్ల క్రిందట బ్రూనోను బ్రతికియుండగా తగులబెట్టారు రోము ప్రజలు. అతను చేసిన ఘోరనేర మేమీలేదు. "విశ్వంలో భూమి యొక్కటే కాదు ఉండేది. ఈ అనంతాకాశంలో అనేకగోళా లున్నా" యన్నాడు. అందులో భూమి అణుమాత్రం. నిజంచెప్పినందుకు ఆయనని సజీవంగా దహనంచేశారు. ఆజ్వాలల్లో దహించిపోతుంటే "నీవు ఉన్నాయనిచెప్పే తదితర ప్రపంచాల్లోకి పోతా" నని ఎత్తిపొడిచారు బ్రూనోని. ఏళ్లు గడి



విశ్వము భూకేంద్రకము కాదనుటవలన
సజీవముగ దహింపబడిన బ్రూనో.

చాయి. బ్రూనోవాక్యాలు సందేశా లయాయి. ఇప్పుడు విశ్వమంతా ఎవరైనా భూకేంద్రకమంటే విరగబడి నవ్వుతుంది. ప్రాచీనమానవుని చిహ్నాలు ఇంకా అతనిలో ఉన్నా యనుకుంటారు. ఇప్పుడు రోములో అతనిని న్యాయశాస్త్రరీత్యా హత్యచేసినచోటనే అతని శిలావిగ్రహం ఉంది. అధునాతనంగా లోవెల్ గారు అంగారకగ్రహంలో జీవవర్గం ఉందంటున్నారు. తన్నిరూపణకి తీవ్రయత్నాలు చేస్తున్నారు. కాని నవీనప్రపంచం ఆయన్ని సజీవంగా దహించడానికి యత్నించటంలేదు. ఆయన విజ్ఞానసంపత్తికి, ఆవిష్కారప్రతిభకి జోహారులిస్తోంది. అదీ మానవవికాసం!

అంగారకుని పేరు ఆగ్రహం అరుణకాంతినిబట్టి వచ్చింది. మనము సామాన్యముగా చూచినను నిప్పులా ప్రకాశిస్తూ ఉంటుంది. ఈగ్రహం భూమికంటె చాలా చిన్నది. కాని అన్నివిధాలా భూమివలెనే ఉంటుంది. ఈగ్రహం ఆత్మప్రదక్షిణానికి 24 గం. 37 ని. 22 సె. పడుతుంది. దీని అక్షం 28$\frac{3}{4}$ డిగ్రీలు వాలిఉంది. ఈ గ్రహం సూర్యునిచుట్టు తిరిగివచ్చుటకు 686 రో. 23 గం. 30 ని. పడుతుంది. ఈ గ్రహానికి సూర్యునికి దూరం 141,000000 మైళ్లు. అక్షం 4000 మైళ్లు. అంగారకగోళ ధ్రువమండలాలు నిరంతర హిమాచ్ఛాదితాలుగా ఉంటాయి.

ఈగ్రహాన్ని 1877 నుండి బాగా పరిశీలించటం మొదలుపెట్టారు. ఆ సంవత్సరంలో ఇది భూమికి సూర్యునిమధ్యగా వచ్చి భూమి కతిసమీపమయింది. ఆ సంవత్సరం ఇటాలియను ఖగోళశాస్త్రజ్ఞుడు షియాపెరిల్లీ పూర్వం ఖండాలుగా పరిగణిస్తున్న నల్లటి మచ్చలన్నీ చిన్నచిన్నద్వీపా లన్నాడు. అనేకవందల కాలువలచే ఈ ద్వీపాలు ఏర్పడుతున్నా యన్నాడు. అంతకుపూర్వం వాటి నన్నిటిని మహాద్వీపాలు, సముద్రాలు అనుకున్నారు. మళ్లీ షెయిపెరిల్లీ 1881 డిసెంబరులో పరిశీలించాడు. అప్పుడుదూడా అనుకూలపరి

ముగ నుంచుకొనలేక పోవుటవలన నాటినుండి నేటివరకు అనుభవిస్తున్నారు. కాలువలు, అంతరించిన ప్రదేశ ములు తప్ప మిగిలినవన్నియు నిర్మానుష్యములై జ్వలించు గోళమగుచున్నది.



“ఈ విశ్వమందు నేనొక్కడనేనా ఉంది. లేక అంగారకునిలో నాకు సహచరులున్నారా?”
అని ఆలోచిస్తున్నాడు మానవుడు.

మనభూమియందుకూడ జలము క్రమేణ తగ్గు చున్నది. ఎప్పటికో యొకప్పుడు మనముకూడ నీటి కొరకు త్రాహి త్రాహి అనవలసినవారమే. అంగారక గ్రహం భూమికంటె పురాతనమైనది. అందువలన నీరు వాయుమండలము తగ్గిపోయిగాని, గ్రహాంతరముల గర్భములోనికి పోయిగాని యుండవచ్చును. అందువలన ఈ తృష్ణ! పురాతనత్వముచే నాగరికత, విజ్ఞానముకూడ ఆ గోళమందు ఎక్కువయుండవచ్చును. అందుచేత యుద్ధాలు, దేశాలు, సీమలు మాయమైపోయి ఆగోళమంతా ఒక ఉత్పాతం సంభవించినాయి యుండవచ్చును. ఇట్లే మనిషి యందున్నట్టి మనుష్యునకు కొదువను ఎట్లు తగిన సమస్య, నశించిపోవుచున్నారు. కాని లోవెల్ గారు కాలువలు అత్యంత మేధావంతులగు జీవులచే నిర్మింపబడిన వనుచున్నారు. ఆయన అక్కడి ప్రతిఋతువును పరిశీలించిరి. వసంతస్థితి బాగుగా యున్నచోటనే జీవసమృద్ధముగూడ ఎక్కువగా యున్నదనుచున్నారు. ఈ కాలువలన్నియు ఉభయధ్రువములయందు భూమికి రచనాశాస్త్రకోవిని ఉన్నవి. ఈ కాలువలపొడవు లోవెల్ గారి అంచనా ప్రకారము 70,000 మైళ్లుండును. దీనిని బట్టి అంగారక గ్రహమందుకూడ మన పరిసరములే యున్నవనకొనవచ్చును. మన భూమియందు పదార్థములు తూగినవస్తువు అంగారక గోళమందు అయిదుపాళ్లు మాత్రమే యుండవచ్చును. భూమి గురుత్వాకర్షణకంటె అంగారక గురుత్వాకర్షణ తక్కువ. అందువలన మానవులకు దుస్సాధ్యమైన విపరీతభాగములు అంగారక జీవులకు సులభములగును. ఇదే భూమికంటె పెద్దదగు బృహస్పతియందు భూమికంటె కష్టము కావచ్చును. ఇంతవరకు ఆ గ్రహముల గురుత్వాకర్షణపై ఆధారపడియున్నది.

లోవెల్ గారి వాదనంతా ప్రకృతిశాస్త్రజ్ఞునికి ఊహాప్రాయం కావచ్చును. మనవంటి సామాన్యరాజ్యాయనికి ప్రాకృతిక శాస్త్రవిజ్ఞానంతో నిరూపింపబడినట్లైన ధాతువులతో జీవవర్గం ఉండిన ఒప్పకొనము. ఏతద్ధారణ ఉన్నన మేమాత్రమున్నను జీవసంచలన మున్నదని ఒప్పుకొనితీరవలెను. భూమియందుకూడ ప్రప్రథమమున ఈ ధాతుప్రపంచమందే ప్రాణమును ప్రతిష్ఠించినది. ఇదే లోవెల్ గారు మనకు చూపిస్తున్నారు. సృష్ట్యాదినుండి భూమిలో అనేక నాగరికతలు పరిపక్వముల ననుకరింపక మాయమైపోయాయి. అలాగునే అక్కడ ప్రజ్వలించుచున్న విపరీతతృష్ణలో జీవవర్గమంతా నాశనమైపోవచ్చును. వారి విజ్ఞానసంస్కృతి చిహ్నాలు విశ్వానికంతా ఒక శిథిల నాగరికతను ప్రదర్శిస్తాయి.

[ఈవ్యాసంలో ప్రకటించిన పటాలకు Educational Book Company వారికిని, George Newnes Company వారికిని కృతజ్ఞులము.]



## ౧
## (1)

ఒకరోజు ఉదయాన్నే ఆనందస్వామిజీ హరిద్వారం స్నానఘట్టందగ్గర ఆ బాలికను చూశాడు. చూపుతోనే ఆతని హృదయంలో భయంకరమైన వేదనాజ్వాల ఆవిర్భవించింది. ఆతని ఒళ్లు కంపమెత్తింది; ముగం జేవురించింది. ఆతని తపస్సు అంతర్ధానమైపోయింది. స్వామి చూపులు ఆయన ఆజ్ఞల్లోంచి తప్పుకొని స్నానం చేస్తూ అందాలముద్ద అయిన బాలికపైనే పదే పదే ప్రసరిస్తూ ఉన్నవి. ఆమె లాగు, చొక్కా, పై ఉత్తరీయం తడిసిపోయి ఆమె బంగారుపరువాలు కలించే దేహసౌష్ఠవం ప్రచురించినవి. ఆయన చూపులు కౌతుకత్వ, ముగ్ధత్వాలతో వియ్యాలంకే ఒకవినాగం, ఒకవినోదంలో నలిగే ఆమె మొగంపైన వాలినవి; ఆమె కంఠం, బాహుమూలాలు, వక్షోజాలు, నడుము, నీళ్లలో



"ఆ మెలాగు......సౌష్ఠవం ప్రచురించినవి,"

దానుడుమాతలాడు కటవిలాసంపైనా ప్రాకులాడినవి.

సుజంగా ప్రశాంతంఅయి, దివ్యతేజస్సుతో వెలుగు ఆబాలయోగిమోము వివర్ణమైపోయింది.

ఇంతలో బాలశంకరుడిలా మూర్తీభవించి



“స్నానంచేస్తూఉన్న......దా కాశ్మీరసుందరి”

స్నానంచేస్తూఉన్న ఆనందస్వామిని కనుగొన్న దా కాశ్మీరసుందరి.

(2)

ఆబాలిక? శ్రీనగరంలోఉన్న ఒకకాశ్మీర బ్రాహ్మణబాలిక. హరిద్వారంలో తలవెంట్రుకలు తీయించివేద్దామని ఆఅమ్మాయితండ్రి కుమార్తెను తీసుకువచ్చాడు. ఆరేళ్ల పసిపాపైఉన్నప్పుడే అప్పదగి గ్రుడికి బలిదారపోస్తే, ఎవరిఅదృష్టమో ఎవరిదురదృష్టమో పెళ్లయినమూడోమాసానికే రాయంటిపెళ్లికొడుకు తుపాకీమందు పేలితే బద్దలైనట్లు ఆఅమ్మాయిని ఒంటిదాన్ని చేసి, అధోగతిలోపడేసి, అట్టే పోయ్యాడు.

ఆచిన్నదానికి ఏమీ తెలియదు. తాను విగతభర్తృకనన్న విచారమూ లేదు. “అయ్యో అమ్మా! నీ ఖర్మం ఎంతకాలిందే నాతల్లీ? నీబ్రతుకు ఇంతచిన్నతనంలోనే బుగ్గిఅయిందే” అని తల్లీ వాళ్ళూ తన్నుకౌగలించుకొని అప్పుడప్పుడు ఏడుస్తే ఆమెకు అర్థమూకాలేదు; మొగుడు లేకపోయినా పెన్న బెంగా కలుగలేదు.

పదహారేళ్లు నిండి ఈడువచ్చింది; జీలంనదిలోని పద్మంలా మెరిసిపోతోంది. ఆమెమొగాన్ని వైధవ్యకళే లేదు. సౌభాగ్యదేవతా విగ్రహంలా ఉంది.

శిల్పకళాశాస్త్రానికి ఉదాహరణంగా సృష్టించారా అన్నట్లు అపరిమిత సుందరాంగియై ఆకాశ్మీర బ్రాహ్మణునిఇల్లు వెలిగిస్తూ పద్దెనిమిదేళ్లునిండేటప్పటికి మాత్రం దృష్టితగిలేట్లు ముగ్గులాలికిపోయింది.

‘నాకళ్లు పాపిష్టివి’ అని భూమిమీద తల బద్దలు కొట్టుకొన్నాడు తండ్రి బ్రాహ్మణుడు. మేనత్తవితంతువు “అబ్బే, ఈఅందం మనయింటిలో ఉంటే, అష్టపాపాలకి ఆసరువైపోతుంది. తలవంట్రుకలు తీయించేయ్” అన్నది. తల్లి కుళ్లిపోయింది.

(3)

ఆనందస్వామికి? రాజమండ్రీలో బియ్యేలో నెగ్గి, కృష్ణాజిల్లా ‘కలెక్టరేటు’లో యిరవైయేసు రూపాయలజీతానికి కుదిరి, యిరవైయేళ్లు వచ్చేసరికి రివిన్యూయిన్స్పెక్టరీచేస్తూ భీమవరంలో కాపురం ఉన్నాడు రామచంద్రరావు. పరువుకన్న వెలనాటి కుటుంబంలో ఉద్భవించి, పరువుకన్న సంప్రదాయ సంబంధం చేసికొని, యిద్దరుబిడ్డలతండ్రయి, ఏవీకష్టనిష్ఠూరాలు లేక, అందరికీ తల్లోనాలికలా మెలుగుతూ, సంసారంలో ఏమీ లోటులేకుండా కాపురం

చేస్తున్నారు. బంగారంలాంటిభార్య, పనసతొనల బొజ్జబాబులు ఇద్దరుబిడ్డలూ.

ఓరాత్రి ఏమాయగ్రహపట్టిందో, ఇంటోకంటి వాళ్లకు తెలియకుండా కటికఅమావాస్యచీకట్లలో మాయమైపోయాడు.

తెల్లవారిలేచి భార్య అతనువ్రాసిన ఉత్తరం చూసి "అమ్మో" యని గోలపెట్టి కాలవవలల శ్రీరాంపురంలో కాపురముంటున్నంచేత దగ్గరగాఉన్న యనము గుట్టు పద్దమురుగుకాల్వలో దభాలునపడింది పిల్లల మాటైనా తలపెట్టకుండా. అప్పుడే బల్లకట్టుపైన ఊళ్లోకి దాటుతూఉన్న ఆసాహిబొకడు గభీల్లునదూకి, ఈద గుటుకలువేస్తూఉన్న ఆమెను ఒడ్డుకులాగేశాడు. ఇరుగు




"గుటుకలువేస్తూఉన్న ఆమెను ఒడ్డుకులాగేశాడు."

పొరుగువాళ్లంతా మూగి అడ్డంపడిపట్టుకొని ఇంటికి తీసుకొచ్చినారు. ఆమెతండ్రికి అమలాపురం తంతి ఇచ్చారు. ఆయనవచ్చి తీసుకుపోయాడు కూతుర్ని, మనుమల్ని. వారంఅయింది, నెలఅయింది, సంవత్సరాలు అయినవి. ఎక్కడా రామచంద్రునిజాడే లేదు. కాలువల్లో పడ్డాడేమో అన్నారు. కాని ఉత్తరంలో[illegible]! అతనికి భార్యఅంటే ఇష్టం. ఇద్దరుపిల్లలూ అంటే ప్రాణం. ఎవళ్లతో తగాదాలు లేవు. ఏ కా

ర్లంటే ప్రాపకం. ఏవిధమైనకష్టాలు లేవు. "కొందరు పిరికిపందలు సంసారాలు చేస్తారు నిష్కారణంగా" అని రామచంద్రరావు ఆతనిస్నేహితులు తిట్టుకున్నారు.

(4)

ఈసంగతంతా తెలిసిన ఒక పెద్దమనిషి కుటుంబంతో కాశీయాత్రకు వెళ్లినప్పుడు "రామచంద్రరావు ఇక్కడ ఉన్నాడు. సన్యాసం పుచ్చుకొన్నాడేమో! భార్యనుతీసుకుని వీరూ, ఆతనివాళ్లూ కుటుంబాలతో రండి" అని రామచంద్రరావుమామగారికి టెల్లిగ్రాం ఇచ్చాడు. అంతా తండాలా ప్రయాణమై కాశీచేరారు.

అక్కడ రామచంద్రరావు సన్యాసుల్లో కలిసిపోయి వేదాంతం నేర్చుకుంటూ, యోగాలు అభ్యసిస్తూఉన్నాడు.

అదిచూసి ఆతనిభార్య ఏడ్చి ఏడ్చి మూర్ఛపోయింది.

ఆతని ముద్దుబిడ్డలు ఒద్దిగా నవ్వులా కళ్లుచేసుకుని విస్తుపోతూ తండ్రిని చూశారు.

ఎన్నివిధాలు ఎంతమంది ప్రయత్నించినా కాషాయాంబరాలుధరించిన ఆ క్రొత్త సన్యాసిహృదయం కరగలేదు. "[illegible]దేశం వచ్చింది. కారణం ఏమిటి? కారణం ఉండదు. తరించడానికి వైరాగ్యం ముఖ్యసాధనం!" అంటూ శంకరభాష్యం ఏకరువుపెట్టాడు.

రాతితో వండారు అతనిహృదయాన్ని. ఆయనగురువు శతవృద్ధుడు యతీశ్వరానంద రామచంద్రుని భార్యకు హృదయోపశమనం చేశారు. వారందరు తిరిగి ఇంటికిచేరారు. హిమాలయాలు వెలిస్తే ఎవరాగ్గలరు? ఆరామచంద్రరావు నేటిఆశ్రమంలో ఆనందస్వామిజీ!

## ౨

(1)

ఆబాలికను చూసినకొద్దీ ఆనందశేఖరం నరం నరం వశంతప్పిపోయినవి. ఆతనిగుండె [illegible]లుమరలా

మ్రోగుతోంది. ఆతనిమనస్సు చెప్పుచేతల్లోంచి పూర్తిగా తప్పిపోయింది. ఎప్పుడూ అట్టివిపరీతం జరగలేదు.

భయపడుతూ స్నానం పూర్తికానిచ్చి హరిద్వారంసమీపంలోఉన్న ఆశ్రమంలోకి వెళ్లిపోయాడు ఆనందజీ.

ఏమిటిది ? ఎక్కడి ఘోరపాపం ! ప్రపంచం అధోలోకంలోనికి క్రుంగిపోతున్నదా ? హిమాలయాలు విరుచుకుపడుతున్నవా ? తల భూమిపై కొట్టుకున్నాడు.

ఇన్నాళ్ల తపస్సూ భగ్నమైపోయింది. మంట కలిసింది. మూడేళ్లు గంగోత్రిదగ్గిర తపస్సుచేశాడు తాను. చదివిఉన్నదన్న 'ప్రకృతిసత్యము' మిథ్య అని అనుకోలేదాతాను.

తనమనస్సు ఆరోజుల్లో విశ్వమంతా తిరిగేది. 'శివోఽహం' అనే ధ్యానంమీద మహాయోగంవల్ల దీక్షతో చివరకు నిలిచింది. కుండలిని లేపింది. షట్చక్రాలు దాటి విజృంభించి పైకిఉబికింది. సహస్రారం దాట ప్రయత్నం. ప్రాణశక్తి. వికల్పసమాధి.

అంతా ఏకతమస్సు. అంతంలేనిచీకటి. శబ్దంలేని కటికినలుపు. ఏమీలేని ఘోరశీమూతం. దేహం కొయ్యబారింది. ఆకలివహించింది. హృదయం చేరుకుపోయి గడ్డకట్టింది. కొన్నివారాలు ఆలాగే చైతన్యరహితమై పడిఉన్నాడు. బాహ్యజ్ఞానమేలేదు. ఏమిజరిగినదో ? అంతర్జ్ఞానమూ నశించిపోయింది.

చటుక్కున ఒక్కనాడు మెలకువవచ్చిందె తనకు. గురుభాయీలు "శివోహం" "శివోహం" జపిస్తూ ఉన్నారని తెలిసింది గంగోత్రికడ గుహల్లో. మెల్లమెల్లగా పళ్లుతిన్నాడు; పాలు చప్పరించినాడు; రొట్టె నమిలినాడు.

గురుస్వామి యతీశ్వరానందజీ "మొదటిగడ్డు దాటింది, రెండవదానికి సిద్ధంఅవు" అన్నాడు. ఆతని ఆత్మ మహాశాంతంలో దిగిపోయింది. ఒకవిధమైన తేజస్సు ఆతనిఫాలాన్ని వెలిగిస్తూఉన్నది. గురుస్వామి కడ అనేకగ్రంథాలు చదివాడు. వేదాంతమహాభావాలు అవగతంచేసికొన్నాడు. అవిఅన్నీ తనకు ఇదివరకే తెలిసిఉన్నట్లు గోచరించాయి.

(2)

కైలాసగిరికడ ఒకగుహలో రెండవసారి తపస్సుకు పద్మాసనం వేసికొన్నాడు.

ఇప్పుడు అతిత్వరలో వికల్పసమాధిలోనికి పోయాడు. దేహంఅంతా వేయివిద్యుల్లతలు పాకినట్లయింది.

'శివోహం' 'శివోహం!' 'శివోహం!' అంతా వెలుగే. 'తత్త్వం సర్వం' ! 'తత్త్వమసి' !! 'అహం బ్రహ్మాస్మి' !!! 'సర్వంసత్' ! 'సర్వంచిత్' ! 'సర్వం ఆనందం' !

ఆరునెల్లు ఒకేయోగం, ఒకేసమాధి, ఒకేఆనందం ! ఓం, ఓం, ఓం!!!

ఆనందజీ కళ్లుతెరచినాడు. సంపూర్ణచంద్రమంటి లమే ఆయనమోము.

ఆయనదేహాన్నుంచి వెలుగులు చిమ్ముతున్నవి.

ఆయనపెదవులచివురుల సంతతానందహాసము. ఆయనకన్నుల్లో జ్ఞానజ్యోతిర్లతలు. "హరిద్వారంవద్ద ఆశ్రమం ఏర్పరచుకో, రోజూ స్వామిదేవాలయం ఎదుట స్నానాలరేవులో స్నానంచేసి, స్వామిదర్శనం చేసి ఆశ్రమంలోకిపోయి తపస్సుచేసుకో!" అని గురుస్వామిఆజ్ఞ.

అలాంటి తనకు ఈఅవస్థఏమిటి ?

(3)

ఆ బాలికమోము కలకలలాడుతూ ఎదురుగా కనబడుతోంది. తలతిప్పివేసి పద్మాసనం వేసికొని ధ్యానంలోకూర్చున్నాడు. ఆకాశ్మీరబాల ఎదుటకు వచ్చింది. పూలు ఫలాలు పళ్లేన పట్టుకొనివచ్చి ఎదుట నిల్చొని నమస్కరించి తనసెజ్జనే కూర్చున్నది. ఆమె ఉష్ణాంగములు తనదేహాన్ని తాకినవి. ఆమె హృదయా

లయాలు తనదేహాన్ని అదిమినవి. ఆమె తనపాలను ముద్దుకొన్నది:—

'అయ్యో!' అని ఆనందజీ చివాలున లేచినాడు. అక్కడ ఎవ్వరూ లేరు. పల్లెనూ లేదు బాలికా లేదు. తానొక్కడే. చుట్టూ శూన్యకుటీరము.

తపస్సు భగ్నమైపోయింది. జీవితం వ్రక్కలై పోయింది. మళ్లీ తాను ఎన్ని జన్మలు వెనక్కు పోవాలో! సత్ పదార్థముతో ఐక్యంఅయిపోయినవాళ్లు మళ్లీ వెనక్కువెళ్లటం ఉన్నదా? పరమశివా! తాను తన గురుస్వామి మోము ఏలాగు చూడగలడు? తాను తనకే రోతయిపోయినాడే. "దేవా, ఏమిగతి? గురూ, నన్ను రక్షించు." తల క్రిందవేసి బద్దలుకొట్టుకున్నాడు; ఏడ్చినాడు; దండం పుచ్చుకొని దేహాన్ని బాదుకొన్నాడు. కంకి, వాచి, కాయలుకట్టి ఎంతో బాధపెట్టింది.

ఆ బాలిక తనవైపు చేతులుచాచి అతిప్రేమతో చేరవస్తున్నది.

"శ్రీహరీ!" అంటూ, ఉన్మత్తుడై ఆనందజీ గంగఒడ్డునే పరుగెత్తినాడు.

"శ్రీహరీ!" అని గంగాప్రవాహం ప్రతిధ్వనించింది.

## (4)

"అయ్యో తల్లీ! నీకర్మంకాలిపోయిందే, ఏమి చేస్తాం. ఎన్ని ముక్కలు ఆగలనెంట్రుకలనుంచి రాలుతూఉంటాయో అన్ని జన్మాలు వైధవ్యం అనుభవించవలసివస్తుందమ్మా. నేను తీయించుకోలేనూ. ఊన్నా ఎవరు ఆనమ్మెనరెక్కలుమాసి సంతోషించడం" అని నిరుపమాదేవి మేనత్త యామెను బలవంతాన లాగుతూఉన్నది. తల్లి మేలిముసుగు పూర్తిగా మోము విూదికి లాక్కొని వెక్కి వెక్కి వాపోవుతూఉన్నది. తండ్రి పండితరామానంద్ కుమార్తె చేయిపట్టుకొని మంగలివైపు లాగుతూఉన్నాడు.

మంగలివాడు ఒంటి చిరునవ్వు నవ్వుతూ కత్తి నూరుకుంటూ "ఎన్నిరకాల అందాలజుట్లు యీకత్తి మింగి ఈగంగకు అర్పించిందో" అని అస్పష్టంగా అంటున్నాడు.

నిరుపమాదేవి "అబ్బా, నేను చేయించుకోలేనర్రా" అంటూ పులివగ్గిరకుతోసే లేడిలా వెనక్కుపోతూ ఎంతబలవంతాన లాగినా ముందుకు రాదు.

భర్తపోయినాడన్న దుఃఖ మేమీఎరగదు. తన్నందరు హీనంగా ఎందుకుచూసేవాళ్లో ఆబాలిక కేమితెలుసు? ఎప్పుడు వాళ్లింటిలో శ్రీనగరంలో ఆడుకుంటూఉండేది. తండ్రి భాగ్యవంతుడు. ఈ బాలికతప్ప పిల్లలెవ్వరూ లేరు. కాని తానొక గొప్ప సనాతనవాదినని అతని అభిప్రాయం.

వచ్చేకళ్లనీళ్లు వెనక్కుతరుముతూ లేనికోపంతో జేవురిస్తూ కుమార్తె రెండుభుజాలు నొక్కిపెట్టి బలవంతాన మంగలివగ్గిర కూచోపెట్టాలని తోస్తూఉండగా "స్వామీ, రక్షించు" అని ఆబాలిక కిందపడింది.

గంగఒడ్డునే విసవిస పిచ్చివానివలె వస్తూఉన్న ఆనందస్వామిజీ అక్కడకే ఆసమయంలో వచ్చాడు.

"ఎవరువారు?"

మంగలి:—ప్రభూ! బాలవితంతువుశిరోజములు గంగాదేవి కర్పించపోతూ ఉన్నారు.

ఆకాశ్మీరబాలికే చైతన్యంతప్పి కిందపడిఉన్నట్లు చూశాడు.

చివ్వునపోయి ఆమెనుపట్టి లేవనెత్తి ఆమెశిరస్సు తన ఒళ్లో పెట్టికొని "శివోఽహం, శివోఽహం" అన్నాడు. ఆమె కళ్లువిప్పింది.

నిస్సన ఆబాలిక స్వామిజీఒళ్లోనుంచి లేచి, జరిగి కూచుని, మేలిముసుగు సవరించుకున్నది.

పండితరామానంద్ స్తబ్ధుడై విస్తుపోతూ చూస్తూనుంచున్నాడు. స్వామిజీ ప్రళయకాలరుద్రునిలా గర్జిస్తూ లేచి, "ఈ కసుగాయపాపను విరూపనుచెయ్య

డానికి నువ్వెలా ఒప్పుకున్నావయ్యా? నీకు మోక్షం వస్తుంది అని అనుకున్నావా? ధర్మశాస్త్రాలు వప్పుకుంటాయనా నీఅభిప్రాయం! ఏవ్యక్తికైనా బలవంతంగా వైరాగ్యం ఇవ్వవచ్చునా? మనస్సులో లేని వైరాగ్యం జుట్టులోవస్తుందా?" అంటూ శాస్త్రంలో కబుర్లు, శాస్త్రాతీతమైన యుక్తులూ ఏకరువుపెట్టేశాడు.

హృదయాంతరాంతరాళాల్లో ఇష్టంలేక లోకానికి వెరిచి జుట్టుతీయించతలచుకొన్న పండితరామానందుడు "స్వామిజీ, క్షమించండి. నాకుమార్తె తనంతటతాను యోగినీవేషం పూన్తానన్నదాకా వేణీభరం తీయించను. కాని తమబోంట్లు ఈలాంటిబాలికలకు సంసారమందు రోత, వేదాంతవిచారం మొదలయినవి బోధిస్తూఉంటే మాసంసారాలు తరిస్తాయి స్వామిజీ!" అన్నాడు.

## 3

### (1)

ఆనందజీహృదయం తుపానునాటి మహాసముద్రమైంది. విశ్వామిత్రునకు తపోభంగం జరగలేదా? అది తాత్కాలికం అయినదే. కాని వారితపోభంగం యొక్క అంతం, ఆసుందరకాంతాపరిష్వంగంతో గాని కాలేదు. అది మహాపాపంకాదా? తన కేదికర్తవ్యం? ఒక్కనిమేషమేని ఆబాలికసుందరవదనం హృదయంలో ఉంచి మాయంకాదే? ఆదివ్యసుందరగాత్ర తన్ను ముట్టుకున్నప్పుడు తనదేహం పొందినపులకరాలు, హాయి, ఆనందం, తాను సమాధిలో పొందిన ఆనందంకన్న ఉత్కృష్టమైందో సమమైందో?

తనపాపానికి నివృత్తి ఉన్నదా?

తన యీఅధఃపతనానికి చెలియలికట్ట ఎక్కడ?

దేహంతెలియకుండా ఎన్నిదేశాలు తిరిగాడో! గొప్పస్వామివచ్చాడని చాలామంది గృహస్థులు ఆతిథ్యం ఇస్తే వంకరనవ్వునవ్వుకుంటూ "మీ అమ్మాయిల్ని జాగ్రత్తచేసికోండో!" అని మనస్సులో చాటించుకున్నాడు. కసితో, వాళ్లతో చార్వాకసిద్ధాంతం పూర్వపక్షంచేస్తే, అంతా అంతరార్థమే అని సంతోషించారు మానవులు.

అతనిమొహంలో కెరటాలుకొడుతూఉన్న మోహజలధి "పారలౌకికకాంతినిధి" అని అనుకున్నారు విధవస్త్రీలు.

ఎక్కడెక్కడో తిరిగాడు. ఏమేమో ఉపన్యాసాలుఇచ్చాడు. మాట్లాడేదంతా మాయసంసారపు విముక్తి ఉపన్యాసం. మనస్సనిండినదంతా మాయామోహప్రతీపిపత్తి.

తీర్థాలు, పుణ్యస్థలాలు, వర్తకపుపట్టణాలు, వ్యయసాయపుకేంద్రస్థానాలు, రాజధానులు, ఆరునెలలు తిరిగితిరిగి ఎక్కడతిరిగాడో, ఎలాతిరిగాడో, పరివ్రాజకత్వమో భామరూపంనిండినపరవశత్వమో, తిరిగితిరిగి కళ్లు తెరిచిచూసేటప్పటికి కాశ్మీరదేశం, శ్రీనగరంవీథిలో ఒకమేడముందు.

"స్వామీ! నమస్తే!" అని కాశ్మీరబ్రాహ్మణుడు నడుముకు తలపాగచుట్టుకుని జోళ్లువిప్పి సాష్టాంగపడ్డ దృశ్యం.

పదిమందీజేరడం, లోనికితీసుకువెళ్లడం, గౌరవం చేయడం నిముషములో జరిగిపోయింది. ఆబాలికతండ్రి ఇల్లు, ఆపండితుడు, ఆదివ్యమంగళవిగ్రహం ఎదుట సర్వాంగాలింగితభూవల అయిఉన్నది.

### (2)

ఇంటి వరుపు అయ్యాడు. తన్ని మూలమంటా కదల్చివేసే ఆబాలిక తనకు పరిచర్యచేస్తూఉన్నది.

ఏరోజు తన్నురక్షించాడాబాలసన్యాసి అని చూసిందో ఆనాటినుంచి ఆత డామెకీవితానికి ఈశ్వరుడయ్యాడు. హిమాలయ ధవళశృంగాల్లో వెన్నెలపాదాం సులను మోపుతూ నృత్యంచేసే నటేశ్వరుడే ఆబాల సన్యాసి ఆబాలికకు. ఆతనివెడదఫాలం హిమాలయ సానువైంది. తీక్ష్ణమైలోతైనల్లనై చిన్నవైన ఆతని కళ్లు తనమోక్షమార్గం చూపించే నక్షత్రాలయ్యాయి. సన్నని పొడుగాటి చామనచాయగల ఆబాలసన్యాసి

తన్ను తరింపచేయడానికి అవతరించిన కేదారేశ్వరుడు, అమరనాథుడు. ఆతనిఫాలంలో చంద్రవంక చూసుకుంది. ఆతనిబోడితలలో జటాజూటాలు నర్తించినవి. అనుక్షణం ఆబాలసన్యాసి వరదహస్తంతో ఎదుట తోస్తూనే ఉన్నాడు.

రాత్రిళ్లు చీకట్లల్లో హరిద్వారంనుంచి వచ్చినప్పటినుంచీ ఆస్వామిజీదగ్గిర నిలుచుండి తనవైపు అభయముద్ర చాచినట్లే కనిపిస్తూఉన్నది.

ఆస్వామిజీ తలచుట్టూ కాంతిపుంజము ప్రసరించినంట. ఆయన్నే తేజస్సు అలుముకుపోయింది.

సర్వకాలమూ ఆయనకు సేవచేస్తే తనజన్మ పవిత్రం అయిపోతుంది. ఆ అవతారమూర్తి మళ్లీ కనబడతాడా? ఎప్పుడూ కళ్లకు కనబడుతూనే ఉంటాడు. దేహంతో ప్రత్యక్షంకాకపోయినా పరవాలేదు.

ఆయన ఎప్పుడూ హరిద్వారందగ్గిరేనా బస? ఎంత సుందరమూర్తి!

ఆయనఒళ్లో తాను పడిఉన్నప్పుడు, అంతఒళ్లు ఆనందంతో కరిగిపోయిందేమిటి?

ఆయనమొహంలో మందహాసాలు మంచుశిఖరం మీద వెన్నెలపడినట్లు వెలిగినవేమిటి?

ఆయన మనుష్యరూపంపొందిన భగవంతుడు కాడా మరి! ఆయన్ని నిత్యమూ కొలుస్తూఉన్నా, తనకు తృప్తిఉంటుందా? ఆయనపాదాలు తాను పట్టాలి. ఆయన తనకు ముక్తినిచ్చేమార్గము బోధిస్తూ, నెత్తిమీద చేయివేసి ఆశీర్వదిస్తాడా?

దినదినమూ ఈలాంటి ఆలోచనలతో నిండిఉన్న ఆ కాశ్మీరబాలికకు "స్వామిజీ వచ్చాడు" అన్న తండ్రికేక వినబడింది. గజగజ వణికిపోయింది. కన్నుల నీరు తిరిగినవి. ఆనందం ఒళ్లంతా అలుముకుపోయింది. తనకోసం వచ్చాడా స్వామి. తనతపస్సు ఫలించిందా? తనగురువు తన్ను వెదుక్కుంటూ వచ్చినాడా?

ఆస్వామి ఇంట్లోకి వచ్చాడు. కాళ్లపై పడింది. ఆకాళ్లక్రిందమన్ను తనతలపైవేసికొన్నది.

## (3)

ఆనగరంలో ఆబాలగోపాలం స్వామిజీకి పరిచర్యచేస్తున్నారు. ఫలాలుపట్టుకువచ్చేవాళ్లు, పాలు పట్టుకువచ్చేవాళ్లు, భిక్షలకు పిలిచేవాళ్లు, మిఠాయి వంటలు వండించేవాళ్లు. ఒక్కనిముషం స్వామిజీకి తీరుబడిలేకుండా జనం ఎప్పుడూ ఆయనచుట్టూ మూగి ఉండేవాళ్లు.

సంసారంలో దౌర్బల్యం బోధించాడు. కర్మ అనేదిఏమిటి? జ్ఞానమార్గంయొక్క ఉత్కృష్టత. మానవుడుమనస్సు. మనువుమనస్సు. జీవితంమనస్సు. మనస్సుయొక్క వికల్పాలే ప్రపంచసృష్టి. ఆనందం ఏమిటి? సత్ పదార్థంఏమిటి? ఈశ్వరుడు పరాప్రకృతి. సాక్షీభూతమగు పురుషుడు, సృష్టిభూతమగు పురుషుడు, సమస్తపురుషస్వరూపుడగు పురుషోత్తముడు. భగవద్గీత పరమవాక్కు. త్రిభాష్యాలకుఉండు పరమ సంయోగం, సమీకరణం ఎక్కడ? సాంఖ్యము, ఉపనిషత్తులు, బ్రహ్మగీత అన్నీ ఒకటేచెప్పుతాయి. హఠయోగం దేహనిర్మలతకోసం. మంత్రబలిమి. పరా, పశ్యంతీ, మధ్యమావైఖరీవాక్కులు. సృష్టిశక్తి. శక్తికి మహోత్కృష్టస్వరూపమై పరమసూక్ష్మమగు ధ్వని. ఆధ్వని అక్షరసముదాయమైంది. కాబట్టి బీజాక్షరాలు. ఇంకాఇంకా, ఈలాగే జ్ఞానముద్రధరించి తీపివాక్కులతో వందలకొలది భక్తులకు బోధిస్తూనే ఉన్నాడు.

ఒకనాడు ఒకశిష్యుడు "స్వామీ, సంసారంలో ఉండి త్యజించేమార్గం చెప్పండి." అని పృచ్ఛచేసినాడు చేతులుజోడించి.

స్వామి అన్నాడు,

"ఒకనావ బయలుదేరింది. తెరచాపలెత్తారు. గాలి జోరుగా వీస్తూంది. తెడ్లువేశారు. గడలుమోపారు. పడవనడవదు. తర్జనభర్జన చేశారు. చివరకు అంతా కనిపెట్టిందిఏమిటి? లంగరే ఎత్తలేదట, ప్రపంచంలో

ఉండి ఆపాపాలన్నీ చేస్తూ మోక్షం ఎల్లాసంపాదించడం. బజారులో కూరగాయవస్తువా మోక్షం?"

రాత్రిళ్లు స్వామిజీకి పరిచర్య నిరుపమాదేవే. పరుపుపై జాగ్రొదుప్పట్లు. జాగ్రొశాలువలు. ఆయన జపానికి కృష్ణాజినంవగైరాలు. బట్టలుఉతికి ఆరవేయుట. పళ్లుబలిచి సిద్ధంచేయుట. పాలుకాచుట. కాళ్లుపట్టేది. దేహముపట్టేది.

ఇద్దరూ ఆనందంపొందేవాళ్లు. ఎప్పుడు పరిచర్య వస్తుందా అని ఇద్దరూ ఎదురుచూసేవాళ్లు. మహాభక్తితో పరిచర్యచేస్తూఉన్న కూతుర్ని చూసి తలిదండ్రులకు పరమసంతోషం అయ్యేది. వైరాగ్యమార్గంలోపడి సమస్త దుఃఖమూ మరిచిపోతుందికాదా మరి.

(4)

ఇన్నిసంవత్సరాలూ చేసినతపస్సుబలిమి ఇంకా ఉండేమో? ఆబాలిక తనదగ్గరకూర్చుండి పరిచర్య చేస్తూఉంటే తమిపట్టలేకపోయినాడు. ఆమెతో కామ సంబంధమగుసహచర్యల ఊహించుకోనటానికే స్వామిజీ భయపడినాడు. అయినా ఆతనిమనస్సు, ఆధీనంతప్పి చుక్కానితెంపుకొని భయంకరమైన సముద్రాల్లోకి దుమికిపోడానికి సిద్ధపడిఉన్న నావలాఉంది.

ఏదోవంకతో ఆమెను స్పృశించేవాడు. ఆమె



"ఆమెకు ఆధ్యాత్మికమైన......చేర్చుకునేవాడు."

కురులు దువ్వేవాడు. ఆమెకు ఆధ్యాత్మికమైనరహస్యాలు నేర్పుతూ దగ్గిరకులాక్కొని పక్కను జేర్చుకునేవాడు.

ఆమెకు స్వామిజీయన్న మోహముకాదు. స్వామిజీయే తనకుదైవము, సర్వస్వము. స్వామిజీ తనకు దేహమర్పించమన్న అతి ఆనందపూర్ణమున్నూ, అతిఅహాయికమున్నూ అయిన హృదయంతో అర్పించ కలదు. స్వామిజీ జీవంనదికి ప్రాణంసమర్పించమన్న అంతే, నవ్వుతో పెళ్లి చేయగలదు. 'నీతండ్రిని ఈకత్తి పుచ్చుకొని చంపివేయి' అని స్వామిజీ అంటే ఆలాగు చేయడానికి ఆమె ఏమాత్రం సందేహించదు; ఆబాలిక సమస్తము విడిచేస్తుందిగాని స్వామిజీని ఆమె నిమేషమైనా విడిచిఉండలేదు.

"అమ్మాయీ! ఇల్లాఎందుకునాకు పరిచర్య చేస్తున్నావు?"

"నాదైవానికి పరిచర్యచేయడం నాకు అబ్బరమా?"

"ఎవరిమట్టుకు వాళ్లే దైవము. నాఎక్కువ ఏముందమ్మా?"

"అది తెలుసుకున్నతర్వాతకదా. అందాకా గురువే పరమదైవం."

"సర్వవిధాల ఉత్కృష్టతపొందిన మానవుడే గురువుగా తగిఉంటాడు కాని నాబోటివాడు—"

"పాపం! పాపం! అల్లాఅనకండి, మీరు భగవంతుని అవతారమే!"

౪

(1)

ఆనందజీ తపస్సంతా భగ్నమైపోయింది.

ఒక విచిత్రముహూర్తాన్ని ఆనందజీ తమి ఆపుకో లేకపోయినాడు. నిరుపమాదేవి ఆతనికౌగలింతలో కరిగిపోయింది.

ఆ సంధానముహూర్తం పవిత్రమైనదో, పాపభూయిష్ఠమైనదో? ఆరాత్రియే ఆనందజీ తలవాల్చికొని

సిగ్గుచే, భయంచే వణకిపోతూ హృదయంలో పశ్చాత్తాపం దావానలంఅయి జ్వాలలు ఎగస్తూఉండగా దేహం కుమిలి బొగ్గుఅవుతూఉండగా ఇల్లువిడిచి నడుస్తూ నడుస్తూ అదేవెళ్ళిపోయినాడు.

(2)

నిరుపమాదేవి తనజన్మం పవిత్రం అయిందని ఉప్పొంగిపోయింది. భగవంతుడు ప్రత్యక్షమైన భక్తురాలులా తేజస్విని అయింది. ఆమెను ఎవ్వరూ తేరిపార జూడ్డానికి వీలులేనట్లు మిరుమిట్లు గొలుపుతూఉంది.

తండ్రి—అమ్మా స్వామిజీ ఎక్కడ?

నిరు—తపస్సుకువెళ్లారు నాన్నా!

తల్లి—ఎప్పుడు వెళ్లారు?

నిరు—తెల్లవారుగట్ల.

తండ్రి—అమ్మా, నీమొగము అల్లాప్రజ్వరిల్లుతోంది, నీకన్నులు వెలిగిపోతున్నవి. స్వామి నీకు ఏమన్నా ఉపదేశంచేశారాఏమిటి?

నిరు—(చిరునవ్వుతో ఊరకుండును.)

తల్లి—అమ్మా నువ్వు పరమేశ్వరుణ్ణిచేరే ఉమాదేవిలాఉన్నావు. స్వామివారు నిన్ను కటాక్షించారా ఏమిటి?

నిరు—(ఇంకా చిరునవ్వునవ్వుతుండును.)

తండ్రి—ఎంతఅదృష్టవంతురాలవమ్మా. పెద్దపెద్దవాళ్లు తల్లక్రిందులా తపస్సుచేసినా దొరకని మహాభాగ్యం నీపూర్వపుణ్యంవల్ల సమకూరింది.

తల్లి—నాతల్లి పరమపూజ్యురాలు.

(3)

వేగంతో తరుముకువస్తూఉన్న భయంకరమైన సింహంబారినుండి తప్పించుకుపారిపోతూఉన్న లేడిలా ఆనందజీ హిమాలయపర్వతాలల్లోకి పారిపోయాడు.

అతనికి ప్రపంచమంతా నల్లపడిపోయింది. పర్వతశిఖరం విరిగి అతనిమీద పడినట్లయింది.

స్వచ్ఛమైనహిమాలయఖండాన్ని చూచి నల్లపడి కుళ్లి ఉన్న తనజీవితాన్ని చూసుకున్నాడు!!

ఎందుకు తాను సన్యాసంపుచ్చుకున్నాడు?

బంగారంలాంటిభార్యను విడిచిపెట్టాడు.

ఊర్ధ్వరేతస్కుడని తన్నుగుట మహాసత్యమన్న తపస్సు చేసాడు.

ఆలోచించుకొని ఏడ్వడానికిన్నీ మించిపోయిందే యీదుఃఖం.

అసాధారణవేగంతో కొట్టుకునే ఈహృదయం ముక్కలైపోరాదూ? జై! ఆనందజీ పాపానికిజై!

ఒక్కఉరుకు ఉరికాడు. ఎంతదూరం ఆపర్వతాఘాతంలో పడ్డాడో! గిరగిరతిరిగాడు.

జయ్యిమని క్రింద దూరంగా ప్రవహిస్తూ పతనాల జలజలధ్వనిస్తూఉన్ననది, దేవదారుచెట్లు, కొండరాళ్లు, అన్నీ తన్నుచేరడానికి మహావేగంతో వస్తున్నవి.

ఇంక ఒక్కనిమేషంలో పదోవంతుకాలంలో తల బద్దలు, దేహం పిండి, మళ్లీ తనస్వరూపం ఎక్కడా కనబడదు.

శివోహం! శివోహం.

ఆనందజీకి ఆపతనంలోనే ఒళ్లు మైకంకప్పి స్మృతి తప్పిపోయినది.

(4)

నిరుపమాదేవి నానాటికి మహాతేజస్విని అయినది. ఆమెను తేరిచూడ్డానికి ఎవరికిన్నీ చాలకున్నది.

ఆమెమోము ప్రఫుల్లమైంది. కళ్లలో లోతులు కాంతులు సుళ్లుతిరిగిపోతూ ఉన్నవి. అరమూతలైన ఆనయనాలల్లో ఎంతదివ్యప్రేమ ప్రవహిస్తూఉన్నదో?

పాటలవర్ణవర్చస్విని అయిన ఆదివ్యసౌందర్యబాల శలాకలాఉండేది. నేడామెసంపూర్ణచంద్రుడులా అయ్యింది.

కుమారస్వామిని సర్వవిశ్వానికి అర్పించపోతూ వున్నదేవి, తథాగతుణ్ణి నెలలునిండుగా గర్భమందు దాచుకున్న మాయాదేవి. ఆమె దేవకి, కౌసల్య.

ఇంట్లో అందరికి గప్పున నెల్లడిఅయింది. గొల్లు మన్నారు. తల్లి నోరుమూసుకుంది. కూతురుమీదపడి ఏడ్చింది. "నాతల్లీ, కొంపలుముంచావే! తరతరాలకి మనకుటుంబాల్లో ముక్తిఅనేది లేకుండాచేశావే! అమ్మయ్యో! ఆసన్యాసి ముండాకొడుకేనా! చిరునవ్వు నవ్వుతావు. అయ్యో! అయ్యో!!"

తల్లివిచారం, ఏడ్పు, కంగారు నిరుపమాదేవికి అర్థంకాలేదు. పవిత్రమైన తన్ను చూసి ఎందుకుఇంత దుఃఖం. తానేమితప్పుచేసినది? స్వామి తనకుపదేశించిన మంత్రము పఠించుకొన్నది. ఆవేళ కుమార్తెను తల్లి తేరి చూడజాలలేకపోయినది.

(5)

ఇంకొకవారమురోజులకు తండ్రికి తెలిసినది. ఆయనకోపము దక్షునికి రాలేదు; వీరభద్రునకురాలేదు;

ఎంతటిదుర్మార్గుడు. పాపి! సన్యాసా వాడు? చండాలాతిచండాలుడు. క్రూరుడు. వాడితల వేయి ముక్కలుచేసి వాడిని మహామాయ వండి భోజనం చేయాలిగాక! రామారామా!

కంట నీరెట్టుకుని హోరుమని ఏడ్చినాడు. రామారామా! ఎంతటిఆపత్తు తెచ్చి పెట్టినావోయి? పవిత్రమైన తనకుటుంబానికి, వంశానికి ఇట్టికళంకమే?

కోపముతో మళ్లీ మండిపోయాడు. పాడుముండ. ఈవెధవవాడివల్లో పడింది. ఆడదానికి బుద్ధి ఉంటే మగవాడు ఏమిచేస్తాడు. వీణ్ణి ఆరోజునే బుజ్జగొరిగించవలసిందిరా దైవమా! ఆరాక్షసివెధవ దాని మీద కన్నువేసి వెధవవేదాంతాలుచెప్పి అడ్డుపడ్డాడు. ఈప్రపంచంలో ఎంతపాపంఉంది?

ఎల్లాగ తనబ్రదుకు? ఏమిటికర్తవ్యం! ఈపాడు పాపిని జీలంలో పడమంటే? విషమిస్తే?......?

లేకలేక ఒకబిడ్డ!!! చేతులార ఎల్లాగురా?... దైవమా? కుమార్తెదగ్గిరకు పోయినాడు. ఆనందమై ప్రఫుల్లమైన ఆమెమోము చూసేటప్పటికి ఆతడు గజగజ వణకినాడు. కాశిలో అన్నపూర్ణను చూసినట్లయింది. కొల్హాపురం దివ్యమూర్తి గజలక్ష్మి ప్రత్యక్షమైనట్లయినది. కాళీఘట్టపు మహాకాళి. తల్లీ, నీవా ఈపాపం చేసింది. ఇదంతా అబద్ధమేమో? తనభార్య తప్పుఅభిప్రాయం పడిందేమో?

"అమ్మా! ఏమిటిచేస్తున్నావు?"

"ఏమీలేదు నాన్నగారూ! స్వామి ప్రసాదించిన మంత్రము పురశ్చరణ చేసుకుంటున్నానండీ!"

"వాడిమొగంమంత. వాడిచ్చేదేమిటే మంత్రం, వాడితల!"

"స్వామి భగవంతుని అవతారం!"

"వాడి అవతారంకూల! నాకొంప మాపేడే! బాబూ!!"

"స్వామి పవిత్రమైన మహాఋషి!"

"అయ్యో నాతల్లీ! నిన్నూనన్నూ రౌరవాది నరకకూపంలో దింపేడే! బాబూ! రామా!! దీనికి అర్థంకాదురా?"

"మీరుచెప్పిన వెనకకథల్లో వ్యాసుడు ధృతరాష్ట్రుణ్ణి పాండురాజును ఎల్లా ప్రసాదించాడు నాన్నగారూ?"

"మ!...మ!...ప!...ఫ!..."

"జన్మంమనస్సునాన్నా! ఆత్మ! పరమతేజం అంతానిండిఉంటుంది! పాపంపుణ్యం! మనస్సేఆరోపించుకుంటుంది! నిజంగోచరింపించుకుంటే! మనస్సు వికల్పంలేకుండా పవిత్రభావంతో ఉన్నప్పుడు పాపం దేనికి నాన్నగారూ!"

"..............." తలవంచుకుని నిలుచున్నాడు తండ్రి.



“ఎవ్వళ్లూలేకుండా పురిటిగదిలోకి వెళ్లాడు.”

“స్వామి నాకు భగవంతుడు. సమస్తమూ ఆయన ప్రసాదము. నాగర్భం, వెలుగుతో నింపివేసినట్టు నాకు ప్రత్యక్షంగా ఈకళ్లకి కనుపిస్తూ ఉంటుంది నాన్నగారూ!”

“..............”

“నాకువచ్చేకలలు పవిత్రమై ఉంటున్నాయి! పవిత్రమైనది పాపంఎల్లా? నిప్పుకు అంటుఉన్నదా?

(౬)

మరునాడు కాశీప్రయాణం, కాశ్మీరబ్రాహ్మణకుటుంబం బంగాళాపత్తూ. అక్కణ్ణుంచి రామేశ్వరం వెళ్లుతూ మధుర, చిదంబరం, శ్రీరంగం, కన్యాకుమారి, అనంతశయనం, కంచి, ఉడిపి, తిరుపతి, తిరువన్నామలై, కాళహస్తి, పక్షితీర్థము, తంజావూరు, కుంభకోణం, రాజమహేంద్రపురం, జగన్నాథం, పర్ణశయనం- అన్నీ తిరిగి, అమ్మాయిపురిటికి కాళీఘట్టం చేరుకున్నారు.

ఒకపవిత్రమైనదినంలో, దివ్యముహూర్తంలో, నిరుపమానతేజానికి వెలిగిపోతూవున్న పుత్రుడు జన్మించాడు. పేరూప్రతిష్ఠా పాడుజేయడానికి పుట్టినమలినం, మహాపాపానికి చిహ్నంగాపుట్టినముద్ద, ఆశిశువును హుగ్లీనదిలో పారవేద్దామని కాశ్మీరపండిజీ సంకల్పించాడు. పురుడువచ్చినమరునాడు ఎవళ్లూలేకుండా పురిటిగదిలోకి వెళ్లాడు. కుమార్తె బాలకుణ్ణి పక్కనుబెట్టుకొని యశోదలా నిద్రపోతూ ఉన్నది.

ఆబాలకుడు తేజస్సుతో వెలిగిపోతూఉన్నాడు.

“ఓయి వెఱ్ఱిబ్రాహ్మణుడా, నీకు పిల్లలు లేరు. భగవంతుడు ఈబాలకుణ్ణి నీకు ప్రసాదించాడోయి” అని ఎవరో గంభీరస్వరముల తనచెవిలో పలికినారు.

ఆయన ఉలిక్కిపడ్డాడు.



“కుమార్తె బాలకుణ్ణి పక్కను......నిద్రపోతూ ఉన్నది.”

ఎంతమంది ఎన్నిమాటలంటారో. ఎన్నిరకాలు సృష్టిస్తారో. ఎల్లాగ ఈపసిపాపణ్ణి తనఊరు తీసుకు పోవడం. ఎంతఅపఖ్యాతి? ఎల్లాగ తలెత్తుకు తిరగడం? "దైవమా ఏదయ్యా మాదిక్కు? పరువుగా బ్రతికిన మాకుటుంబం గంగలో కలియడమే?"

అయితే పండులాంటి ఈచిన్నపాపను చేతులారా ప్రాణంతీయడమే! అమ్మయ్యో అదిమాత్రం తానుచేయలేదు.

తనహృదయం కర్కోటకంకాదు! తాను కటికివాడున్నూ కాడే! భగవంతుడా దారేది? తెన్నేది?

ఎవరికైనా పెంపకం ఇస్తే?!

ఎవరు తీసుకుంటారు?!

తానే పెంచుకోవాలా???

ఎల్లాగ????

ఎవరిపిల్లన్నో పెంచుకునేందుకు తీసుకువచ్చానంటే ఎవరేమంటారు! దిక్కులేనిపాపను దొరికిందనచ్చుగా!!!!

(7)

స్వామికి చటుక్కున మెలకువవచ్చేటప్పటికి ఆహిమాలయపర్వతం లోతులోయలో అఖాతంలో గోడలాంటి ఆకొండచరియలోఉన్న ఒకచెట్లసందులో వేలాడుతూఉన్నాడు.

గుబురుగాఉన్న ఆచెట్లు, ఒత్తైఉన్న ఆకొమ్మలు ఆనందజీని రక్షించాయి.

ఒళ్లంతానొప్పులు. తల బద్దలైపోతూఉంది. కదలలేకుండాఉన్నాడు.

తల్లిలా ఆచెట్లకొమ్మలు ఆతన్ని ఉయ్యాలలూపినవి.

క్రింద లోతుగా ప్రవహిస్తూఉన్ననది సంగీతం పాడుతూ ఆతనికి ఉపశమనంచేసింది.

"శివోహం! శివోహం!" అన్నట్లుగా ఉన్నది.

నెమ్మదిగా మహాప్రయత్నంతో కొమ్మల్లోంచి ఆచరియతలానికి దిగాడు. ఒళ్లు దులుపుకున్నాడు. తనతోపాటుపడిన మంచుగడ్డలు కరిగి ఒళ్లు చల్లగా జిమ్మి మనితడపి ప్రాణము లేచివచ్చినట్లుచేసినవి. ఆకులు, చిరు రెమ్మలు దులుపుకున్నాడు.

పైకి ఎక్కడానికి వీలులేదు. క్రిందదిగడానికి వీలులేదు. భగవంతుడు తన్నిక్కడ ఖైదువేశాడా?

ఏదిఎట్లయితే తనకుభయమేమిటి? అంతంవస్తే అంతకన్నమంచిదే. శివోహం! శివోహం!

శివ! శివ! శివ! హరిఃఓం! ఓం! ఓం!!

పద్మాసనం వేసుకున్నాడు. తపస్సులోకి దిగాడు.

* * * *

రెండునెల్లు మహాతపస్సు. రాత్రింబగళ్లు. వాయువులో వాయువు. మంచులో మంచు. మహాతేజస్సు క్రింద ప్రవహించేనది గడ్డకట్టుకుపోయింది.

ఆశీతకాలంలో అతను వణకలేదు. సర్వసృష్టీ స్తంభించిపోయింది. మహాప్రశాంతం. చిదానందం.

అంగుటిలోనిరంధ్రం పూడిపోయినది. అంతర్ముఖాన కుండలినీశ్రుతి! గురుపాదుకలు దివ్యకాంతులతో వెలిగిపోతున్నవి. షట్చక్రాలుదాటి బ్రహ్మరంధ్రంసమీపాన్ని, సహస్రార కమలనాళతీరాన్ని ఆతని ఆత్మపరాశక్తి స్థానప్రస్థానమైంది.

(1)

శ్రీనగరంలో కాశ్మీరపండితుడు రామానందలాల్జీ పెంచుకుని తీసుకునివచ్చిన కుర్రవాడు పండితునిమేడంతా వెలిగిస్తూ బాలకృష్ణునిలా పెరుగుతూఉన్నాడు.

నిరుపమాదేవి విగతక్లేశయోగినీరూపందాల్చి పరమపవిత్రయైన భాగీరథివలె ప్రవహిస్తూఉన్నది.

చుట్టాలుపక్కాలు చుట్టుపక్కలవారు రామానందలాల్జీకి కలకత్తాలో ఒకబీద కాశ్మీర బ్రాహ్మణ

కుటుంబంవారు ఇచ్చిన ఆబంగారుబాలకుణ్ణి చూచి విస్తుపోయారు.

ఏవో అనుమానాలు పడ్డారుగాని, దివ్యతేజ స్వరూపంతో తపస్వినిలాఉన్న నిరుపమాదేవిని తేరి చూడ వాళ్లకు భయమువేసిపోయింది. రామానందలాల్జీ చెప్పినచరిత్ర ఒక్కరున్నూ అనుమానపడలేక పోయినారు.

(2)

నిరుపమాదేవి అంతకన్న అంతకన్న తపస్సులో మునిగిపోయింది. శ్రీస్వామిజీ ఉపదేశించిన ఆమంత్రమే పరమమార్గము, స్వామిజీ గురువు, పురశ్చరణమే యోగము.

తపస్సులో మైమరచిపోయేది. పరవశయై కన్నులు అంతర్దృష్టిచే అర్ధనిమీలితాలూ కా, ఆపూజా గృహంలో అమ్మవారి పీఠంయెదుట కాంచనగంగా శిఖరమువలె యోగముద్రలో ఉండేది. ఆసమయంలో ఆమెలోంచి ఒకకాంతి బయలుదేరి ఆగది, ఆగదిదాటి చావిళ్లు ఇతరగదులు అంతా ఆక్రమించినట్లు ఉండేది.

ఆమెఅంశం మరీ ఉత్కృష్టమైపోయింది. ఆమె మాట మరీ తీపిపడిపోయింది.

నిరుపమాదేవి తనగురువను ఆనందజీ చెప్పిన వేదాంతపుకబుర్లన్నిటికి నిజమైనఅర్థం గ్రహించింది. ఆయనఆదేశానుసారం భగవద్గీత ఎప్పుడూ పారాయణం చేస్తూ, ఆపరమపవిత్రవాక్కులకు నిజార్థం గోచరింప చేసుకునేది.

ఆసుశీలకు కుమారుడన్న సద్గురుప్రసాదమనేభక్తే గాని, కుమారుడన్న మమతయేలేదు. పాలివ్వదు. ఇతర పరిచర్య చేయదు. రామానందజీకి ఇష్టంలేదు; భయం కూడాను. పెంపుడుతల్లిఅయిన అమ్మమ్మయే అమ్మ. ఊళ్లోఉన్న అమ్మలక్కలంతా మధ్యాహ్నం రామానందజీఇంటికి పల్లకీలమీద, పడవలమీద, నడకలమీద మేలిముసుగులతోవచ్చి నిరుపమాదేవి తననిర్మలమాధుర్య గళంతో పాడి అర్థముచెబుతూఉన్న భగవద్గీతారహస్యాలు విని ఉప్పొంగిపోయేవారు. సంస్కృతఅధ్యాత్మరామాయణం పరవశయై పాడుతూఉంటే వాళ్ల మనస్సులు ఊగిపోయేవి.

(3)

రెండేళ్లకు ఆనందస్వామిజీ మహాతపస్సంపన్నుడై చంద్రశేఖరునిలా హిమాలయపర్వతం ఎత్తులున్న బండి దిగివచ్చాడు కాశీపట్టణానికి. తలంతా జుట్టు జడలుకట్టిఉంది. గడ్డముమీసము పెరిగి ఉంగరాలు చుట్టుకొనిపోయిఉన్నది. ఆయనఫాలం దివ్యదీప్తులతో కిరణాలువిదజల్లుతూంది. ఆయనజాభ్రోగుడ్డలు చిరిగి పోయిఉన్నవి. ఆయన ఎముకలపోగు. తిన్నగావెళ్లి గురుస్వామి యతీశ్వరానందజీ కాళ్లమీదపడ్డాడు. ఆమహానుభావుడు చిరునవ్వు నవ్వుకున్నాడు. ఆశీర్వదించి "వత్సా, నీకు జరిగిన అనుభవం పరాశక్తి చిద్విలాసం సుమా! పడిలేచావు. పాపలోకం కల్లార పారకించావు. ప్రారబ్ధం విచ్ఛిన్నమైంది. హిమాలయగౌరీ శంకర శృంగం నీకు పూజాపీఠం అవుతుందిసుమా"అని సెలవిచ్చినాడు.

(4)

ఇంకరెండుసెల్లకు ఒకఉదయాన్న రామానందలాల్జీ జపంచేసుకుంటూండేవేళ ఎదుట ఆనందస్వామిజీ నిలుచున్నాడు.

పండిజ్జీ కళ్లుతెరిచేటప్పటికి ప్రత్యక్షమైఉన్న స్వామిజీని చూసి స్వామిజీని ఆనవాలుపట్టలేక కైలాస గిరిమీద సంచరించే దేవతల్లో ఎవరైనానేమోనని గజగజవణికిపోయాడు. ఆవిగ్రహంఅల్లా దివ్యమైన చిరునవ్వువేయిసువాసనలులా ప్రవహింపచేస్తూ నిలుచునే ఉన్నది. పండిజ్జీ కళ్లునులుముకొన్నాడు. శివప్రార్థనాసూక్తాలను వణకేకంఠంతో పఠింపుకోవడం ప్రారంభించాడు.

ఆనం:—పండిజ్జీ క్షేమమా మీకు?

రామానందలాల్జీ ఆగొంతుక ఒకక్షణంలో ఆనవాలు కట్టాడు.

"స్వా...స్వా...మిజీ!"

"అవును! హిమాలయపర్వతాలల్లోంచి బయలు దేరి కాశీలో గురుదర్శనం చేసికొని, మళ్లీ హిమాలయాల్లోకి వెళ్లేముందు మీదర్శనం చేసుకొందామని ఇల్లా వచ్చాను."



"ఒక ఉదయాన్ని..... ఆనందస్వామిజీ నిలుచున్నాడు"

మొదటజనించిన ఆశ్చర్యభావం మాయంకాగా మిగిలినమహాకోపంతో పండిజ్జీ.

"నాకూతురుకోసం కాదుకదా!"

"పండిజ్జీ! భగవంతుడు నన్నూ మిమ్ములనందరినీ రక్షించాలి మహాపాపంచేశాను; అనుభవించాను."

"మహాపాపంచేశావు? అనుభవించావు? ఏమి అనుభవించావు? నువ్వుసన్యాసివా, సన్యాసివా? నీబోటివాళ్లవల్ల మతానికి అపఖ్యాతి? ఛీ, రాక్షసి కొడుకా, నువ్వు మనుష్యుడవా? నా ఎదుటనుంచిలేచి పో. నీబుఱ్ఱ చితకేయగలను."

స్వామిజీ చిరునవ్వు నవ్వుతూనే ఉన్నాడు. "పండిజ్జీ, నేను మీవిషయం సలిపినఘోరదోషం, ఎట్టిశిక్షకైనా నన్ను పాత్రుణ్ణి చేస్తుంది. మీఇష్టం, వచ్చినట్లు నన్ను శిక్షించి నన్నుపాపంనుంచి విముక్తుం చేస్తే నేను తమకు సర్వకాలం కృతజ్ఞుణ్ణి."

"ఛీఛండాలుడా! నువ్వు నాఇంట్లోంచిపో! నీబుఱ్ఱవేయిముక్కలకింద కొట్టేస్తా" నని మహారౌద్ర స్వరూపంతో పక్కనున్న కఱ్ఱపుచ్చుకొని లేచి స్వామిజీపైకు దుమికాడు.

స్వామిజీ తలవంచినాడు.

రామానందలాజ్జీకాళ్లు ఎవరో పట్టుకొని లాగినట్లయింది. రామానందలాజ్జీ తలవంచి చూచునప్పటికి ఆతనిప్రియదౌహిత్రుడు, పెంపుడుకుమారుడు పాకుతూ వచ్చి "దాదా?" అనిముద్దుమాటలతో చేతులు చాచినాడు.

రామానందలాజ్జీభార్య భర్తగారికోపపుమాటలు విని ఏమిటాఅని వంటింటిలోంచి పరుగునవచ్చింది.

నిరుపమాదేవి తపస్సుచాలించుకొని తండ్రి మాటలువిని అచ్చటకువచ్చింది.

స్వామిజీ కనులుమూసికొని తలవంచిఅట్లనే నిలుచుండిపోయినాడు. అట్లనే సమాధిలో తన్మయుడై పోయినాడు. ఆతనిముఖాన్నుంచి వేయివెలుగులు ప్రసరించినవి. అక్కడనిలుచున్నవారందరికీ దివ్యసంగీత శ్రుతి వినవచ్చింది.

తనగురువు, తనభగవంతుడు స్వామిజీనిచూసి నిరుపమాదేవి పులకరించి మైమరచి, ఆయనపాదాలకడ సాష్టాంగపడింది.

నిరుపమాదేవితల్లి మేలిముసుగు సవరించుకొని తలవంచి స్వామిజీకి నమస్కారంపెట్టింది.

స్వామిజీ దేహాన్నుంచి, ఉద్యత్ చంద్రకోటి ప్రభాశాంతమైనవెలుగు ఆవిర్భవించి ఆమందిరాన్ని నింపి, గోడలలోంచి ప్రసరించి, విశ్వమంతా వలిగించింది.

రామానందునిచేతిలోంచికర్ర కిందపడిపోయింది. ఆతనిమోకాళ్లు పట్టువీడిపోయినవి. భూమిమీద కూలబడి "ప్రభూ, క్షమించు" అంటూ స్వామిజీపాదాలకడ మూర్ఛపోయినాడు. స్వామిజీ ఆమహదానందసమాధిలో నిలుచునేఉండిపోయినాడు.

౬

"శివోహం! శివోహం!"

హిమపూరితశృంగాలు, ఎత్తయిన పర్వతసానువులు, నందనవనంతో తులతూగేలోయలు, సువాసనలువెదజల్లే విచిత్రపుష్పలతలు, వివిధశాద్వలజాతులు, వృక్షాలు, దేవదారువులు, నిర్మలనీలాకాశం హిమపాతాలు, రంగురంగులకలయికలు తెలుపు, నీలం.

ఆదేవపర్వతంలోనికి చొచ్చుకుపోతున్నాడు ఆనందస్వామిజీ. ఆహేమంతపవిత్రదినము పరమనిర్మలమై, నిశ్చలమై, వెలిగిపోతున్నది.

"పరమేశ్వరస్వరూపమైన ఈమహాపర్వతపంక్తి లోకానికి తపోభూమి. అన్నిమతాలవారు ఇక్కడ ముముక్షువులు కావలసిందే. ఓహోపర్వతేశ్వరా, నీ రశ్మి లోకహృదయాన్ని కాంతితో నింపి పులకరింపిస్తున్నది. శివోహం, శివోహం" అనుకుంటూ ఆనంద స్వామిజీ అగమ్యమైనఆపర్వతభూములలోకి చొచ్చుకుపోతున్నాడు.

"శివోహం! శివోహం!! శివోహం!!!"

"కదా ద్వైతం పశ్య న్నఖిలమపి సత్యం శివమయం
మహావాక్యార్థానా మవగతిసమాఖ్యానవశతః;
గతద్వైతాభావ శ్శివశివశివే" త్యేవ విలపన్
ముని ర్న వ్యామోహం భజతి గురుదీక్షాక్షతతమా.



"ఓహో పర్వతేశ్వరా, నీరశ్మి......ఆపర్వత భూములలోకి చొచ్చుకొనిపోతున్నాడు."

# హిందూదేశము: ఎకనామిక్ ప్లానింగ్

## (India—Economic Planing)

డా. బి. వి. నారాయణస్వామినాయుడు, కొప్పర్తి వెంకటరావు

గడచిన ఐదుసంవత్సరములనుండి అసామాన్యమగు దుస్థితిచే బాధపడుచుండుటచే, ఆర్థికముగా దేనియం దేతప్పుగలదాయని ప్రపంచమునందు పలువురు తహతహపడుచుండిరి. నిరుద్యోగముచేతను, వర్తకమాంద్యముచేతను పారిశ్రామికదేశములును, తక్కువ ధరలచే వ్యవసాయదేశములును మిగుల బాధపడుచున్నవి. వ్యతిరిక్తములును, అసమర్థములును అగు అనేకకారణములు పలువురు చెప్పియున్నారు. పనికిరాని సలహాలను ఇచ్చియున్నారు. ఈ ఆర్థికదుస్థితిచే బాధపడని దేశము లేదు. ఇప్పుడు మనము చేయదగినది యేమన, గతసంవత్సరముల అనుభవములను గుర్తించి, వానినుండి నీతిని గైకొన్ని, మరల అటువంటి పరిస్థితులు రాకుండగా చూడవలయును. అది బుద్ధిమంతుని తత్త్వము. ప్రస్తుతము ఎకశామిక్ ప్లానింగ్ అనుమాట దశదిశలందును మారుమ్రోగుచున్నది. రష్యాదేశము మొదలు హిందూదేశము వరకు అదేమాట. ఈవిషయమై అనేకగ్రంథములు వ్రాయబడియున్నవి. హిందూదేశమునకు తగిన ప్లానింగు నొకదానిని తయారుచేయుట ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. దానికొఱకై ప్రస్తుత పరిస్థితులయొక్క సర్వే నొకదానిని తయారుచేయవలయును.

కష్టపరంపరలను, పరిస్థితుల మార్పులను ఎదుర్కొని సదుపాయముల నేర్పరుచుకొనునపుడు మానవుడు తనఆలోచనయం దాధారపడును. అట్టి సదుపాయములందు ప్లానింగు తప్పదు. మానవుడు గతాగతములను, మంచిచెడ్డలను ఆలోచించి, భావికి సదుపాయముల నెట్లు యేర్పరుచుకొనునో అటులనే ప్రతిజాతికి దేశమునకు చివరకు సర్వప్రపంచమునకును అట్టి ప్లానింగు ఒకటి అత్యవసరము. సకలసంపదలయందు, కడుపుమంట యిదివరకు మనము వినియుండని వింత వికారము. హిందూదేశమునందు అన్నములేక బీదలు కడుపుకాల్చుకొనుచుండ, కనడాయందు ఎక్కువయినవని గోధుమలు కాల్చుచుండిరి. ధరలు ఒకమూల తగ్గుచుండ, ప్రజలయొక్క కొనుబడిశక్తి యింకను తగ్గుచున్నది. వస్తువుల ధరలు తగ్గుటచే, కొన్నిదేశములు బంగారముపై ఆధారపడినవి. వాని సంపద స్థిరత్వమునకు చలామణి మార్పులచేతను, దిగుమతిసుంకములచేతను మరికొన్నిదేశములు వాని సంపద నభివృద్ధి చేయుటకు తంటాలుపడినవి. కాని ఈదేశముల విధానములు ఉత్పత్తియొక్కయు, ఉపయోగములయొక్కయు సంబంధముల నంతగా గ్రహింపకపోవుటచే కావలసిన ఫలితములు కలుగలేదు. అందరకు పనిని గల్పించి జీవనాధారము కలుగజేయుట, తక్కువఖర్చులతో ఎక్కువఉత్పత్తి చేయుట, ప్రజలయొక్క జీవితవిధానముల నభివృద్ధిచేయుట మొదలగునవి 'ప్లాన్డ్ ఎకానమీ' వలన పొందగలము. కాని ఈవిషయమున వివిధదేశముల వా రందరును కలసి పనిచేయవలెను. ఈసంగతి ఇదివరకే గ్రహింపబడినట్లు అంతర్జాతీయకార్మికమహాసభ, నానాజాతిసమితి మొదలగువానివలన తెలియుచున్నది. ఆర్థికవిషయములందు అన్నిజాతులు కలిసిపనిచేయనియెడల కలుగు అనర్థము లందరికిని తెలియును. కాని ప్రతిజాతియును ఉపయోగకరమైన 'పాలసీ' కలిగియుండనియెడల, అంతర్జాతీయప్లానింగుకు చాలాకష్టము కలుగును.

సోవియటురష్యావారి Five year plan ప్రపంచదృష్టిని ఆకర్షించి, ఇతరకారణములచే తప్పనిసరిగా చేయబడిన ప్లానింగు యొక్క అవసరమును గట్టిపరచినది. మొదట ఐదుసంవత్సరములనుకొనిన రష్యా

ప్లాను, నాల్గుసంవత్సరములలో అయిపోయినది. ప్రకృతి సౌభాగ్యములను ఆర్థికసౌభాగ్యముగా మార్చుట, ఉత్పత్తిని తగుమంచిమార్గమునందు పెట్టుట, జాతియొక్కయు, సాధ్యమయినంతవరకు ప్రతిమానవునియొక్కయు శాంతిసౌకర్యముల నభివృద్ధిచేయుట-యివి రష్యావారి ముఖ్యోద్దేశములు. సంఘీకరణమునందును, ఉత్పత్తిమార్గములందును అనేకసంవత్సరములు వెనుకబడిన దేశములందు ఉత్పత్తికన్న ఉపయోగము హెచ్చుగా నుండునుగాన, పరిశ్రమావశ్యకత అట్టిదేశములందు బాగుగా కన్పించుచున్నది. రష్యావారు Gos-plan అనుదానిని అవలంబించుచున్నారు. ఇందు పరిపాలన కేంద్రమునందును, అసలు ఉత్పత్తివిధానములు చిన్నచిన్న నైసర్గికవిభజనలకును చెందియున్నవి. ఇందు కార్మికులకు, వారి అధికారులకునుకూడా అమలుజరుపుటయందు ఒకేహక్కు గలదు. ఈ Five year plan అకస్మాత్తుగా వచ్చినదిగాదు. ఆరు, ఏడుసంవత్సరములు కలసి ఆలోచించగా వచ్చిన విధానమిది. ఈలోగా అనేకము చిన్నచిన్న ప్లానింగులు అమలునందు పెట్టబడినవి. చరిత్రమందెక్కడను కనుపించనంత తక్కువకాలమందు, ఇతరదేశముల ఉత్పత్తిని మించి, సోషలిజము యొక్క ఆధిక్యమును ఇతరదేశములకు చూపుట ఈప్లానుయొక్క ఆశయము. ట్రేడ్ యూనియనులయొక్కయు, శాస్త్రపరిశోధనాలయములయొక్కయు, పరిశ్రమ బ్యాంకులయొక్కయు వివిధమయిన పనులను, ఆశయములను ఏకముచేయుట ఈప్లానుయొక్క విధి. ఎలెక్ట్రిక్ పవర్ 331% ను, పెట్టుబడి 258% యును, వ్యవసాయము 55% యును, రాబడి 52% యును అభివృద్ధిచేయుట ఈప్లానుయొక్క ఆశయములు.

ఇటీవల మరల రష్యా యింకొక five year Plan తయారుచేసినది. 1937 సం. లోపుగా, ఈప్లాను ప్రకారము, ఉత్పత్తి ఐరోపామహాసంగ్రామము ముందరకన్న 9 రెట్లు అభివృద్ధిచేయుట, ఏడువేల మైళ్లు నూతన రైల్వేమార్గము వేయుట, వ్యవసాయము రెట్టింపు చేయుట, కారులఉత్పత్తి 30% ఎక్కువచేయుట, ఈ ప్లానుయొక్క యుద్దేశ్యములు. అదియునుగాక, 756,000 హార్సుపవర్ కలిగిన జలయంత్రమును నిర్మించుట (ఇది 70,000 చ. మైళ్లవరకు వ్యాపించి 160 లక్షల ప్రజలకు ఉపయోగపడును.) సంవత్సరమునకు 50,000 టన్నుల యినుము తయారుచేయుట మొదలగుపనులు చేయవలెను. ఈ విషయములందు ఇతరదేశముల ధనమును, సహాయమును రష్యాకు తోడ్పడుచున్నవి. ఇవి ఎంతవరకు రష్యాయొక్క ఉత్పత్తి ఆశయముల ఫలింపచేసి, అనేక వందల సంవత్సరములకాలమునుండి సౌఖ్యమనునది ఎరుంగక, అజ్ఞానాంధకారమున బడియున్న రష్యనుప్రజల నభివృద్ధికి దేగలవో ముందుకాని మనకు తెలియదు. కాని ప్రస్తుతము మాత్రము, రష్యను ప్రజలు తాము ఉత్పత్తిచేసిన ఆహారపదార్థములు ఇతరుల కిచ్చుచు, అర్ధాకలితో కాలము గడుపుచున్నారు. ఇతరదేశముల కార్మికు లనుభవించు సౌఖ్యములు వీరలకు లేవు. పైగా మొన్నమొన్ననే ప్రభుత్వపు అప్పుల నెగబెట్టిన రష్యాకు బదులునిచ్చుటకు యితరదేశములు నెనుదీయుచున్నవి. 'కాపిటలిజమ్' ను రూపుమాపుటకు పుట్టినవారు వారి అభివృద్ధికి దానిమీదనే ఆధారపడవలసి వచ్చినది!

వివిధములగు చిన్నచిన్న వ్యాపారములందున్న ప్లానింగును ఏకము చేయవలెను. ఈ విషయమును ప్రజలు చాలాకాలము క్రిందటనే చూచియుండిరి. బిస్మార్కు దేశీయ ఆర్థికపాలిసీయొక్క అగత్యమును గుర్తించియేయుండెను. యుద్ధానంతరము జర్మనీయందు 'దేశీయఆర్థికసంఘ' మొకటి స్థాపింపబడెను. ఇంగ్లండునందు సర్ విలియమ్ బివర్డ్జిగారు ఇటువంటి సూచననే కావించియున్నారు. 1925లో ఫ్రాంసు దేశీయఆర్థికసంఘమును నెలకొల్పెను. ఇటీవల గలిగిన వర్తక మాంద్యమువలనను, ఆర్థికదుస్థితి వలనను అమెరికాయందు అనేకములగుప్లానులు తయారగుచున్నవి.

ఈప్లానింగులయొక్క ఉద్దేశ్యములు, రష్యావారి అనుభవములమీద ఆధారపడినట్టును, ప్లానింగుకు సోషలిజమ్ తప్పనిసరిఅయినట్టును కన్పించుచున్నది. పరిశ్ర

మలు ప్రభుత్వాధీనమం దున్నప్పుడే నిరుద్యోగము తగ్గ ననియు, తగిన ధరల నిర్ణయము జరుగునని యు కోల్ గారు అభిప్రాయపడుచున్నారు. ఆయన ఇట్లను చున్నాడు." ఉత్పత్తికరమగు ఆధారము లన్నిటిని పూర్తిఉపయోగమును గుర్తించు ఏదేశీయ ఆర్థికప్లానింగయినను సరే, ప్రభుత్వమువారు పరిశ్రమాధికారులనుటు, దేశయాదాయమును పంచిపెట్టువారలనుట తప్పనిసరి. ......ఏవిధమయిన ఆర్థిక 'ప్లాన్' అయినాసరే ప్రస్తుత విధానమందు సోషలిజమ్‌ను యిముడ్చుటయేగాక, మన జీవితములయొక్క ఆర్థికఆదర్శములనే మార్చవలెను." ఏఏవస్తువుల నెంతవరకు ఉత్పత్తిచేయవలెను, ఎంతవరకు ఉపయోగింపవలెను ? ఇటువంటి విషయములందు ఏకగ్రీవమైన అంగీకారము ప్లానింగుకు ముఖ్యావసరము. రాబడిని పంచుట, ధరల నియమించుటకూడా ఈ ప్లానింగు చేసినయెడల అప్పుడు పని కష్టము. ఇటువంటి పనులకు, ప్రభుత్వము చెప్పినట్లు సరిగా నడచుకొను మానవుడు కావలెను. అనగా స్వాతంత్ర్యము లేక, మానవుడు ఆస్తి, ఆదాయము, సౌభాగ్యవిషయములందు తన దృక్పథమును మార్చుకొనవలెను. "కనుక శక్తిగలిగి నంతవరకు ప్రతిమానవుడు ఈనూతనపద్ధతుల కొప్పుకొనడు. కాని నిరుద్యోగసమస్య తాండవమాడునప్పుడు, ఆకలిబాధ ఎక్కువఅగునప్పుడు, పూర్వపుపద్ధతుల వదలి, నూతనమార్గములుత్రొక్కుటతప్పనిసరిఅగుచున్నది. ఈ ఆర్థికప్లానింగునందు లోపము లుండవనిగాదు కాని, చాలామట్టుకు లోపములు సవరించవచ్చును.

పరిశ్రమలచే ఎక్కువ ఆభివృద్ధిచెందిన ఇంగ్లాండు మొదలగుదేశములందు ప్లానింగు మిగుల క్లిష్టమయినను పైఆలోచనలకు ఎక్కువ తావొసంగుచున్నది. ఇంగ్లాండు పరిశ్రమలచే యితరదేశములకు వస్తువుల పంపి, ఆహారపదార్థముల కొనుచున్నది. తను పంపు వస్తువులు ఇతరులు కొనకుండుచో, తన ఉత్పత్తి తగ్గించుకొనవలెను. ఇంగ్లాండు స్వంత మార్కెట్టు, యితరమార్కెట్‌కన్న చాలాతక్కువ. కనుక ఇంగ్లాండు, తనమార్కెట్‌నందే అమ్ముడయి పోవు పదార్థముల ఉత్పత్తికొఱకు చూడవలెను. ఈ పద్ధతి అనేకమార్పులు చేయునుగాన ప్రభుత్వమే ఉత్పత్తిసాధనముల అధికారములను పొందవలెనని కోల్ అభిప్రాయపడుచున్నాడు. వ్యవసాయము మాత్రము కొంతకాలము ఈప్లానింగునందు రాదు.

కాని సోషలిజమ్ లేకుండగనే ప్లానింగు ఉండవచ్చునని అభిప్రాయపడువారలు గలరు. ప్లానింగు యొక్కఉద్దేశ్యము, ఉత్పత్తిసాధనముల సాధ్యమయినంతవరకు ఉపయోగించి, ఎక్కువ ఉత్పత్తిచేసి ప్రజలను సౌఖ్యమును పొందచేయవలెను. ఈఆశయము ఏవిధముగా పొందగలిగినను సరేయని వీరిఅభిప్రాయము. అమెరికాయందు కడచిన మూడుసంవత్సరములనుండి చిన్నచిన్న ప్లానింగులు అవలంబింపబడుచున్నవి. రూజ్‌వెల్టుగారి రికవరీడ్రైవ్ యిప్పుడు ప్రపంచదృష్టిని ఆకర్షించుచున్నది. దీనియందు నాలుగువిధములు గలవు:

1. పొలముల తాకట్టు మరల పెట్టి, వ్యవసాయదారుని వడ్డీభారము తగ్గించుట.

2. వ్యవసాయదారునికి ప్రభుత్వము అప్పుల నిచ్చుట. వ్యవసాయఫలములయొక్క ధరలనుమాత్రము పెంచుట.

3. కార్మికులకు కొంచెము మిగులునట్టు ఆదాయము కలుగజేసి అతనిచే స్వదేశవస్తువుల కొనిపించుట; దీనివలన స్వదేశపరిశ్రమలు అభివృద్ధిగాంచును.

౪. దేశాభ్యుదయమునకు తోడ్పడు పనుల ప్రభుత్వమువారు కలుగజేసి నిరుద్యోగమును నిర్మూలించుట.

ఆర్థికముగా ప్లానింగు ఇండియాకు ముఖ్యావసరమను విషయమును ఎవరును కాదనజాలరు. హిందూదేశమున ప్లానింగు కాపిటలిజముపై లంఘింప నక్కరయు లేదు; ప్రస్తుతనాగరకతను నిర్మూలింప నక్కరయు లేదు. అన్నములేక మలమలమాడుచు, కట్టుకొనుటకు గుడ్డలేక, నివసించుటకు వసతిలేక, ఎండకు ఎండి, వానకుతడసి యుండు హిందూప్రజలకు జీవితోపాధిని గలిగించి, వారి జీవితముల నభివృద్ధిచేయుటకు ఒక

ప్లానింగు అవసరము. ప్రకృతిసాధనములందుగాని, మానవశక్తియందుగాని హిందూదేశమునకు ఏవిధమయిన లోటును లేదు. అయిననూ హిందూదేశము ప్రపంచములో చాలా వెనుకబడియున్నది. నిజమును గుర్తించుచు ప్రొ. అన్‌స్టెరి ఇట్లు తనపుస్తకమందు వ్రాయుచున్నది.

"Here is a country of ancient civilisation, with rich and varied resources, that has been in intimate contact with the most materially advanced countries of the West, but which is still essentially mediaeval in out look and organization and which is a byword throughout the world for the poverty of its people."

హిందూ ప్రజలయొక్క దారిద్ర్యమును వారిఅధమమయిన జీవితవిధానమును గుర్తింపనివారు చాలా అరుదు. సైమనుకమిషను రిపోర్టు యిట్లనుచున్నది:

Tho low standard of living to which the mass of India's population attain is one of the first things that strikes a Western Visitor. Wants are few, diet simple, the climate is usually kind, the deep-rooted tradition tends to make the country men content wi.h things as they are. But the depth cf poverty the pervading presence of which cannot escape notice is not so easily realised." హిందదేశమున సగటున మనుజుని సంవత్సరపు టాదాయము 8 పౌను లనియు, ఇంగ్లాండుదేశమున పౌను 95 అనియు ఆకమీషన్‌వారే నిర్ణయించిరి. వ్యవసాయదారుల ఆర్థికవిషయములందు మొదట గోచరించి, పరిశోధకుల దృష్టిని బాగా ఆకర్షింపగలది వారి దారిద్ర్యమని 'ఇండియన్ బ్యాంకింగు ఎంక్వయరి కమిటి' వారభిప్రాయపడుచున్నారు. ఇంకొక ముఖ్యవిషయ మేమనగా అనేకమంది జీవనోపాధికి వ్యవసాయముపై ఆధారపడుట.

౧౮౯౧ లో ౬౧% వ్యవసాయముపై ఆధారపడిరి.
౧౯౦౧ లో ౬౬% ,,
౧౯౨౧ లో ౭౩% ,,
౧౯౩౧ లో యింకా చాలా ఉండవచ్చును.

పైగా ఋతువుల పరిస్థితులవల్లను, తగిన నీటిపారుదలవసతులు లేనందువలనను, వ్యవసాయదారుల పంటలు చెడుటవలన వారెప్పుడును అర్ధాకలితోనే కాలముగడపుట తటస్థించుచున్నది. దానివలన వారి శరీరపటుత్వము చెడి, జీవితభంగము కలుగజేయుచున్నది. తరతరములనుండి అదేవృత్తియందున్నప్పటికి, ఎకరాపై రైతు ఉత్పత్తిచేయునది చాలా తక్కువగా యున్నది. దీనికి కారణము ప్రభుత్వమువారు శాస్త్రసాధనములు వసతులు రైతుల కందియకపోవుటయే. వ్యవసాయము మన దేశమున మిక్కిలి ముఖ్యమయిన వృత్తిఅయినను, అనేక కారణములచే వ్యవసాయముపై ప్రభుత్వవ్యయము చాలాతక్కువ. జనాభా ఎక్కువ అయినను, వ్యవసాయముక్రింద ఎక్కువనేల ఉపయోగమునకు తీసుకొనిరాబడలేదు. నేలలో చీలికలు ఎక్కువ అగుచున్నది. ఋణము పెరుగుచున్నది. ప్రస్తుతము రైతుల ఋణము 100 కోట్ల రూపాయలుగా అంచనావేయబడెను. భూమియజమానులు అతిశ్వాసితముగా మారుటవలన జనులకు భూమియందు అపేక్ష తగ్గినట్లు గ్రహింపవచ్చును. ప్రభుత్వమువారుగాని, పరపతి సంఘములవారుగాని ఈ అప్పుబాధనుండి రైతును విడిపింపగల సమర్థత చూపకుండిరి. అందుచే ఎక్కువ వడ్డీలవల్ల రైతు చాలా బాధపడుచున్నాడు. పైగా సగటు పంటపై పన్నులు కట్టుపద్ధతివలన రైతుకు ఎక్కువగా భుక్తికిసైతము మిగులుటలేదు. బొత్తిగా ధరలుచెడిన ఈరోజులలో సైతము పన్నులు తగ్గింప ప్రయత్నములేదు. చాలామంది అక్షరజ్ఞానము లేనివారగుటచే వారి రాజకీయబలముగాని, ఆర్థికపుబలముగాని అభివృద్ధికిరాలేదు. విద్యావిహీనత వ్యవసాయహీనతకు

సాయము. ఆరోగ్యవిషయములందుగూడ రైతు చాలా నీచస్థితియం దున్నాడు. రైతులేక, కార్మికులు సైతము పరిశ్రమలయొక్క కీళ్లచే బాధపడుచున్నారు. వారికి కూలీతక్కువ. పని ఎక్కువ. వారుండు యిండ్లు మలినములు. అట్టిపరిస్థితులందు సంవత్సరమునకు 60 లక్షల మంది ఈదేశమున చనిపోయిననూ, సగటున మానవ జీవితము చాలాతక్కువగా నుండినను ఒకవింతగాదు.

మృత్యువు, అజ్ఞానము, ఆకలి, దారిద్ర్యము— ఇవన్నియు హిందూదేశస్థుని చుట్టుకొని, సహజముగా భాగ్యవంతమగు దేశమున అతని త్రిప్పిత్రిప్పి కొట్టుచున్నవి. నాగరకతకలిగిన ముప్పదియైదుకోట్ల జనులు (ప్రపంచమందు 1/5 వంతు జనాభా), మిగులసారవంతమై, ఏది కావలసిన అది పండించుటకు తగిన భూమి — వివిధవృక్షములచేతను, నానాజాతిపశువులచేతను నిండియున్న ఈదేశము ముడివస్తువుల పండింపగలిగియు, పరిశ్రమాభివృద్ధి లేమిచే, మిగుల కృశించియున్నది. పరిశ్రమలకు కావలసిన సమస్తసాధనములు — భూమి, ధనము, మానవశక్తియుండియుకూడ మనదేశము మిగుల వెనుకబడియున్నది. బొగ్గు, ఇనుము, రాగి, తుత్తునాగము మొదలగుపదార్థములు, లెక్కకురాని కూలీలు, దొరుకుదురు. ఇదియునుగాక కావేరిజలపాతము, పైకారా మొదలగునవి యంత్రశక్తినిచ్చి, ఖర్చులు తగ్గించును. కనుక మనదేశము పరిశ్రమలకు అన్నివిధములను తగియున్నది. దీనివలన వ్యవసాయమునకు భంగము రాదు. రాకుండగనే మనదేశము పరిశ్రమల అభివృద్ధికి వచ్చి, అభ్యుదయము కాంచకలదు. ఈపరిశ్రమలు మనదేశమందు నెలకొల్పునప్పుడు, కార్మికులకు యజమానులకు వచ్చు తగాదాల కారణములు కన్పింపకుండచేయుట మన ముఖ్యమగు విధి.

ఈపరిశ్రమాభివృద్ధివలన గలుగు లాభములు చాలా గలవు. దేశముయొక్క ఆర్థికసౌభాగ్యము నభివృద్ధికితెచ్చి, జీవితమును ఆనందింపచేయును. నిరుపయోగములై పడియున్న ప్రకృతిసాధనము లన్నిటిని వినియోగమునకు తెచ్చి కేవలము వ్యవసాయముపై ఆధారపడుటను తప్పించుటయేగాక, నిరుద్యోగమును తగ్గించును. దీనివలన ప్రభుత్వమునకుకూడా ఎక్కువ రాబడి వచ్చును. అదియునుగాక పరిశ్రమలవలన జాతీయౌన్నత్యము, జాతీయభావము, నాగరకత మొదలగునవి పెరుగును. దీనివలన దేశముయొక్క పరువు ఎక్కువకాగలదు.

కనుక హిందూదేశమునకు ప్లానింగు చాలా ముఖ్యము. కాని ఈప్లానింగు కేవలము పరిశ్రమలకే కాదు. కేవలము పరిశ్రమాభివృద్ధి దేశమును బాగుచేయ చాలదు. మనదేశమునకు వ్యవసాయము ముఖ్యమను సంగతి మరచిపోక వ్యవసాయమును అభివృద్ధికి తేవలెను. అప్పుడు హిందూదేశము అన్నివిధముల స్వయంశక్తిపై ఆధారపడి మిక్కిలి భాగ్యవంతమగు దేశములతో తులతూగగలదు.

లాండ్ ట్రాన్స్పోర్టేషన్ విషయము ఈప్లానింగునకు చాలాముఖ్యము. దేశమందు మూలమూలల పండు వస్తువులు యింకొకమూలనున్న కావలసినవారలకు చౌకరేట్లలో అందచేయవలెను. ప్రస్తుతపు పరిస్థితులు ఏమియు అనుకూలముగా లేవు. బాంకింగ్ కమిటీవారు చెప్పిన ఉదాహరణ తీసుకొనుడు. ఆస్ట్రేలియానుంచి కలకత్తాకు వచ్చు ఒకమణుగు గోధుమలకు ఛార్జి రు. 0-6-0 మాత్రము, కాని లయిలాపూర్ నుంచి కలకత్తాకు వచ్చు అదేబరువుగోధుమలకు రైలుచార్జి రూ. 1-3-3 కనుక నీటిమార్గము, నేలమార్గము సాధ్యమయినంతవరకు అభివృద్ధిచేయవలెను. వ్యవసాయదారుల ఉపయోగమునకు భూమితనఖాబ్యాంకులు పెట్టవలెను. వారికి తగువిధము నూతనపరికరముల నుపయోగించు విధానము నేర్పింపవలెను. పరిశ్రమల నభివృద్ధిచేసి వాటికి అప్పునిచ్చుబ్యాంకుల నెలకొల్పవలెను. సాధ్యమయినంతవరకు పరిశ్రమలకు సంహానిచ్చువారల నియమింపవలెను. చేతిపనులకు తగిన ప్రోత్సాహమిచ్చి పల్లెటూరివారలకు జీవనోపాధి కలుగచేయవలెను. అన్నిటికన్న ముఖ్యముగా మనవస్తువులు సకాలమున సక్రమమయిన ధరలకు అమ్ముడుచేయు సాధనముల

ఏర్పాటుచేయవలెను. సోషల్ ఇన్సూరెన్సుస్కీము ముఖ్యముగా పట్టవలెను.

ఈ ప్లానింగుకు ముందు ప్రస్తుత పరిస్థితు లెటు లున్నవో తెలుసుకొనుటకు సర్వేచేయవలెను. అందుకు **Statistics** కావలెను. ప్రస్తుతము ప్రభుత్వమువారు ప్రకటించునవి చాలామట్టుకు నిరుపయోగములు. వారు అవి ప్రకటించుటకు చాలావాటిపై ఆధారపడుదురు. పైగా అవి చాలా ఆలస్యముగా వచ్చుటచే ఉపయోగము తక్కుచున్నవి. కనుక ప్రభుత్వమువారు ఒక **Statistics Officer** ను నియమింపవలెను. ఈయనను **Director of Statistics** అని పిలువవచ్చును. ఈయన తగురీతిని వాటిని ప్రోగుచేసి సకాలమున ప్రచురించును. అదేగాక ఇతరులుకూడా వారికి సాధ్యమయినంతవరకు **Statiistics** ప్రచురింపవలెను. దానివలన ప్లానింగుకు చాలాలాభము సమకూడును.

---

# కడలి

మల్లవరపు విశ్వేశ్వరరావు

యుగయుగము లిన్ని కబళించి యుంటి వోయి—
కడలిరాయడ! నీక్షుత్తు కడవదోయి?

ఆశయమ్ములు నశియించి, ఆశలెల్ల
హతమయి, కృశించి ప్రేమ, సుస్నేతపుటెదల
వెన్ని పతితమ్ములై మున్గియున్నె నేడు
నీవదనగహ్వరాగాధనీరములను!—
కడలిరాయడ! నీక్షుత్తు కడవదోయి?

ఈయఖండభూమండల మిమిడిపోవ
నీమహాజలకాయమ్ము నింగి కెగసి
ఆదిగంతమ్ములనె మేఖలాకృతిగ సు
దీర్ఘ బాహురజ్జువుల బందీకృతమ్ము
జేసివై చెను గర్జనోచ్ఛ్వాస మెగయ!
నీసునీలాంబుఘోషయు, నీ విశాల
వక్షమున కనలెడి రోషవహ్ని, నీత
రంగమత్తతాండవనృత్యభంగి జూడ
అందని సుఖాభిలాషనో, అణచుకున్న
తీరని పరాభవమ్మునో, తీరసీమ
గడచి ముంచెత్తు నిష్ఫలాకాంక్షనో స్ఫు
రించి, ఎద భీతిభావమ్ము నించునోయి!

ఈయసీమసామ్రాజ్యమ్ము నిట్లు నీక
రాల నులిజేసివేయ నేలాభమోయి?—
కడలిరాయడ! నీఆబ కడవదోయి!

విరిగిపడు దురాకాంక్షలు నెరచుకున్న
ముఖకుహరభిత్తు లొరసి మూర్ఛిల్లిపోవ,
కారణమె లేని పగదీర్చుకోరి అంధ
శక్తి నీయమాయకలోకరక్తమెల్ల
ధవళదంష్ట్రిక లరుణిమ దాల్ప ద్రావ,
భయదనీలవిద్యుత్తుల బయలు గ్రక్కి—
యీయమావాస్యనిశ నలయించి నవ్వ
కడలిరాయడ! నీక్షుత్తు కడచెనోయి?

---

# నాటకం

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

"ఏం చేస్తున్నా వన్నయ్యా?"

"ఇదిగో యిదోయి తమ్ముడూ!"

"నోటితో చెప్పకూడదూ?"

"కళ్లతో చూడకూడదూ?"

"........అయితే, చూడకుండానే అడిగా నంటావా?"

"కాకపోతే చూసినవాళ్లకి చెప్పా లంటావా?"

"...................."

"...................."

"నాటకం చూడవూ?"

"ఏ మిస్తారు చూస్తే?"

"భేష్!"

"..... ..................."

"రాఘవాచా రోయ్ వచ్చిన నటుడూ"

"...................."

"చూడాలంటే మళ్లీ యింతట్లో దొరుకుతాడా?"

"టిక్కట్టుకోసం ఖర్చుపడే రూపాయలు కావా లంటే మళ్లీ మన చేతికి వస్తాయా?"

"నీకెంతసేపూ డబ్బుగొడవ తప్ప మరోటి లేదు."

"రాఘవాచారి యెందుకు వచ్చా డంటావ్?"

"వొక పేదవిద్యార్థికి సాయంచెయ్యడానికి"

"అలాగా?......అయితే యింటిదగ్గిర్నుంచే తెచ్చాడా డబ్బు?"

"వా! కోట్లు విలవైన ప్రశ్న వేశావ్"

"................"

"ఇదిగో, ఎక్కణ్ణుంచి మరిడీ?"

"ఇంటిదగ్గిర్నుంచే నమ్మా!"

"........కాళ్లు కడుక్కో"

"కాళ్ళాయిదగ్గిర్నుంచే వచ్చాను.....నువ్వు కష్టపడ నక్కర లేకుండా మునిసిపాల్టీ వాళ్లే యేర్పాటుచేశారు మీగుమ్మంలోను, మీ యింటికి వచ్చే చుట్టా లందరూ కాళ్లు కడుక్కోడానికి."

"ఇంకేమీ లేవుట్రా అలాంటి యేర్పాట్లూ?"

"మెరుపు దీపం కూడా సరిగా మీ గుమ్మం లోనే పడింది మొలిచినట్టు"

"ఇంకా?"

"......ఇంకేమీ తోచడం లేదు నాకు"

"...................."

"భోజనం......"

"అప్పుడే ఏమ్మా?"

"ఇదే రావడమా?"

"రావడం అయిదు గంటల బండిలోనే వచ్చాను; కాని..."

"అప్పుడనగా వచ్చి యెనిమిదిన్నర దాకా యే పెద్దగుర్రానికి పళ్లు తోముతున్నావూ?"

"రైల్లో మనిషి మీద మనిషి చొప్పున కూచు న్నాం. నిజంగా నా శరీరం అరిటి గెల కా వేసిన ట్టయిపోయింది. అంచేత కాస్త గాలి మేస్తే కాని వుండలేక యిప్పటి దాకా గోదావరి గట్టున కూచుని, వొక్క బుడగ కూడా వేసేసి—"

"మీ అన్నయ్యతో కబుర్లు చెబుతూ కూర్చో. నిమిషంలో వంట చేసేస్తాను, స్టవ్వుమీద"

"అప్పుడే మీ భోజనా లయిపోయాయా యేమిటి?"

"ఇవాళ కొత్తా, నువ్వెరగందా?"

"పాపం, మళ్లీ నా కోసం—"

"వేషాలకి పోక, కుర్చీ అలా ముందువాలోకి లాక్కుని కూర్చో"

"ఇదిగో, యిలా మాడూ. ఎలాగా శ్రమపడు తున్నావు; కనక కాస్త తొరగా—"

"ఏ మంత తొందర?"

"నాటకం చూడ్డానికి వచ్చాను. ఎనిమిది దాటిం దప్పుడే"

"మరి మా చెల్లాయిని తీసుకు వచ్చావు కాదేం?"

"పెళ్లికి నడుతూ పిల్లిని—"

"నిజమే. తుక్కకి పి ల్లొంపుహా?"

"....................."

"హూహూ........."

ఇలా అంటూ, కామేశ్వరి, గిరుక్కున మళ్లీ యింటోకి చక్కా వెళ్లింది. చుట్టం వొక విధంగా సగం చచ్చి కుర్చీలో కూలపడ్డాడు.

౨

ఇసంతా చూశాటప్పటికి విసే టప్పటికి విశ్వనాథానికి వొళ్లు రవులుకు పోయింది. అసలు రాజమహేంద్రవరం బదిలీఅయినప్పట్నుంచీ చుట్టా లంటే అతనికి డోకు పుట్టింది. పైగా, అన్ని విధాల అనాదరం చేసినా కణాయించుకునే కూచున్న చుట్టానికి ఆతిథ్యం యివ్వడం అతనికి బుద్ధి తక్కువగా తోచింది.

మధ్యాహ్నం కూడా వొక టిలాగే తటస్థించింది. నాటితో ఆధునికాంధ్రకవిపండితసభ ఆఖరు. ఆపూట అతనికి నచ్చిన కవులు తమ రచనలు స్వయంగా చదువుతారు. అంచేత కాస్త నవరైన స్థలంలో కూచోవాలని వొంటి గంటకే వెళ్లా లనుకున్నారు మొగుడూ పెళ్లామూనూ. సరిగా అలాగే బయలుదేరారు కూడానూ. ఇంతే కాకుండా ఫ్లోర్మ్లాస్కు పుచ్చుకుని అతను బరి డెక్కాడు. ఆమె యెక్కబోతోంది. ఇంకా యెక్కబోతోం దేమిటి, యీ మాట అనేటప్పటికి యెక్కనే యెక్కింది; కాని యింతలో—కొగడా వూపుతూ జట్కావాడు "తప్పుకోండి బాబయ్యా!" అన్నాడు. అది విని యెవరా అని చూడగా, బుజం మీద మూటా, వొంటినిండా చెమటవోడికలూ, సూన్యముఖంతో ఆమెమేనమామ తయారు. పైగా ఆయన బండి దిగుతూనే వచ్చి "నిన్న రాత్రి కూడా భోజనం లే" దంటూ వారికాళ్లకి బంధాలువేశాడు.

కామేశ్వరి చాలా చురుకైన మనిషే. చెయ్యవలసినపని నిమిషాలమీదే చేసేస్తూ వుంటుంది. అయినా తన భోజనం అయ్యేదాకా వుండి తరవాత ప్రత్యేకంగా చూడుంటే కొంచె మేనా ఆలస్యం కాక మాన దని ఆమెని తనతోనే కూచోబెట్టుకున్నా డతనీ పూట. అక్కడికి స్థలశుద్ధి చేసి, వంటిల్లు విడిచిపెట్టడాని కామెకి అతని అంచనా కంటే మరో రెండు నిమిషా లెక్కువే అయింది. ఎలా గేనా యీ ఆలస్యం కూడదీసుకోవాలని అతివేగంగా చీర సింగారించుకునీ, జడలో మల్లెదండ సవరించుకునీ, మొగానికి మంచు మీగడా, బట్టలికి సెంటూ రాసుకునీ, అతని చొక్కాకీ, కండువాకీ కూడా కాస్త సెంటు రాసీ, తాంబూలపు పళ్లెం చేతబుచ్చుకుని తెరలోనుంచి భామవేషం లాగ ఆమె వాకట్లోకి రాబోయేటప్పటికి మళ్లీ యీ కందారాజు సిద్ధం.

అయినా, అతను పై కేమీ మాట్లాడకుండా, అక్కస్సంతా మనస్సులోనే జీర్ణం చేసుకుంటూ రామదాసునాటకం చదవసాగాడు.

అయిదు నిమిషాలయింది. చుట్టం, జరిగిం దంతా అప్పుడే మరిచిపోయాడు. పైగా పూరికే కూచోలేక పోయాడుకూడాను.

"విశేషాలేమి టన్నయ్యా?"

"వరసపెట్టి నా పని కూడా పాడుచెయ్యాలా?"

"ఇవాళ మహాచిరాకుగా వున్నా వేమిటోయ్?"

"తెలిస్తే తెలిసినట్లు మసులుకో. లేకపోతే—"

"క్షమించు"

"........ ................"

".. ...................."

"......................"

"ఈ వొక్కటే చెప్పు, యిక నీ జోలికి రాను. మెయిలు వేళ దాకా కూచోవలసిం దేనా, నాటకం ముగిశాటప్పటికి బస్సు లే మేనా బయలుదేరతాయా?"

"నన్నే నా విడిచిపెట్టా వనుకున్నాను"

"అంటే?"

"మళ్లీ మొదలా?"

"ఏమిటో ద్వంద్వార్థంగా వుంటున్నాయి నీ మాటలు"

"నేను సూటిగానే—వొక్క అర్థంతోటే మాట్లాడుతున్నాను. రెండో అర్థం తోచవలసినసందర్భం నీలోనే వుంది."

"అదేదో కాస్త చెబుదూ నలిపి చంపకా"

"అది వూహించుకోవలసిందే కాని వినవలసింది కాదు."

"....................."

చుట్టానికేమీ బోధపడలేదు. అలా అని వూరుకున్నా బాగుండిపోను; కాని వున్నట్టుండి, నెక్కి నెక్కి యేదో-అన్నట్టు పేరుపడ్డ నటకుల ననుకరిస్తూ వానిరాగాలు మొదలుపెట్టాడతను.

"ఏమాత్రమోయి నేరం?"

"అంటే?"

"ఎంతకి వొప్పుకుని వచ్చావూ?"

"దేనికి?"

"వేషం వెయ్యడానికి"

"ఏమిటోయ్ నీ ధోరణి?"

"నీ సంగీతం చూసి నీ భాగం చింతన చేసుకుంటున్నావేమో అనుకున్నాను లే"

"అదా నాయనా, యిందాకణ్ణుంచి చిర్రాబుర్రూ. నీ చదువుకి అడ్డు వచ్చానా?"

"తెలిశాకేనా మానేవా మరి?"

"....................."

3

"మా చెల్లి యింకా వంటింట్లోనే వుందా యేమిటి మరిదిగారూ?"

"వంటింటికి తాళంవేసి అరగంటయింది; కాని మళ్లీ తియ్యవలసివచ్చింది"

"ఏం?"

"చుట్టం వచ్చాడు"

"ఎవరూ? ఏ మవుతారూ?"

"అడిగో, అతనూ. మా పింతల్లి కొడుకు"

"ఎందుకు వచ్చారూ?"

"నాటకం చూడ్డానికీ వూరూ, భోజనానికి మా యింటికీ—"

"చుట్టపు మాపులకి కాదుటండీ?"

"ఇప్పు డలాంటి సందర్భం యేమీ రాలేదులెండి"

"అయితే, చెల్లాయి మళ్లీ వంట చేస్తోం దన్న మాట. ఆ స్టవ్వు చెప్పు డెందుకా?"

"మామూలుపొయ్యిమీద వండితే, పాపం, మా వాడి కాలస్యం అయిపోతుం దని.—"

"ఇంత పొద్దు పోయి వచ్చారేం వారూ?"

"పెందరాడే రావడానికి పొయి దగ్గిర కూచోవాలా, పైపని చెయ్యాలా?"

రుక్కమ్మ విశ్వనాథంధోరణిలో కొంచెం యద్దేవాలక్షణం వుండడం గమనించి సంగతి కనిపెట్టేసింది.

"తొమ్మిది కాదుటండీ యిప్పుడూ?"

"........నాలుగు నిమిషాలే తక్కువ"

"....................."

"మరిదీ! యెసరు కాగింది, బియ్యం పొయ్యడం-"

"సేనాధిపతికి యుద్ధవార్తల్లాగ, వంట యే కాడికి వచ్చిందో యేక్షణానికాక్షణం మీ మరిదిగారికి నివేదించాలా యేమిటి చెల్లాయీ?"

"ఇదిగో, అక్కయ్యగారే? ఇంట్లోకి రండి"

"ఇక పూళ్లన్నీ చాటేస్తాను. అమ్మలక్క లందరూ నన్ను ఆడిపోసుకుంటారు, మీ కేం?"

"రావడం మానేస్తే యేం చేసినా సరే. ఏమంటారు వొదినగారూ?"

"చాటేస్తాను, చాటేస్తా డంటే చాటేస్తే మంచిదే కాదు టమ్మా చిట్టితల్లీ?"

"మనస్సులో తిట్టుకుంటూ చేరనివ్వడం కంటే గ్రహించలేని వాళ్ల కిలాగే చెయ్యాలి. కాకపోయినా మీను నన్ను లోభి అంటే న స్నేరిగినవా ళ్లేవ ళ్లేనా నమ్ముతారా? నమ్ముతారే అనుకోండి. నా సంసార భారం మోసేవాణ్ణి నేను. కష్టసుఖాలు తెలిసినవా ళ్లెవళ్లూ యింగులో నన్ను కాదనరు."

"కా దన్నా మీరు లెక్క చెయ్య నక్క ల్లేదు......పొద్దుపోయీ దాకా అల్లాటప్పాగా తిరిగి—"

"పోనీ, వీడు హోటల్లో మింగనివాడా, మధ్యాహ్నం వచ్చినవారిలాగ?"

"అలాంటివా, డయితే నాటకంకోసం అంత దూరాన్నుంచి గుంపలు దంపలు చేసుకు వస్తాడు టండీ?"

"అ దలా వుంచగా మీ రందరూ మీ మరిది గారికి, అంతకంటే నాకూ ఆచారం తక్కువ అని మాటిమాటికీ దెప్పుతూనే వుంటా రక్కయ్యగారూ!"

"నే నొకటి చెబుతా విను చెల్లీ! మన వాళ్లకి మర్యాదా, మోతాదూ తెలవవు. ఎప్పటి కేనా యిలాగే చేస్తే కాని యిది నిలిచిపోదు. "ఇంతలోకే సంసారం దిగదీస్తుందా" అని కాదు యిక్కడ ఆలోచించతగ్గది. ఆపద అస్తమానూ పొయిదగ్గిర పడి కొట్టుకోవలసిం దేనా? ఏపనిమీద పట్నం వచ్చినా భోజనానికి తయారా? వేళా, పాళా—"

"పని వుంటే గాని నేను చుట్టాల యింటికి వెళ్లను. నేను కాకినాడ వెడితే మా చెల్లెలా వూళ్లోనే వున్నా నేను హోటల్లో భోజనం చేసి తరవాత దాన్ని చూడ్డానికి వెడతాను. నిజంగా యీకాండానొరగారి యింటికి నేను వెళ్లి పదేళ్లయిందండీ. వీహూ, వీడి వాళ్లూ నెల కో మాటేనా తప్పకుండా వస్తారు"

"అవునా చెల్లీ?"

"పదిహేను రోజు లయింది వీళ్ల నాన్న వచ్చి. పొద్దున్న పెందరాడే కావా లనీ, రాత్రి తొమ్మిది దాటాక వచ్చీ, మూడు రోజులు నా యెముకలు విరిచే శారు."

"చూశావా?......ఇం కెందుకూ ఆడిపోసు కుంటా రని నీకు శెంక?"

"పెద్ద ముండావాడు, హోటల్లో తినడు" అని అప్పుడు నే నేమీ అనలేకపోయాను వొదినగారూ!"

"అలాంటివాళ్లు వస్తే కష్టపడడం ధర్మమే నండీ......వో మా టేం జరిగిం దనుకున్నారు మరిది గారూ? రెండేళ్ల కిందట బొంబాయినుంచి మాతమ్ముడు వచ్చాడు. రాకరాక వచ్చా డని బొబ్బట్లూ, పులి హోరా చేశా నాపూట. మీ అన్నగారు తాపితా కట్టుకున్నారు. మావాడు కట్టుకోబోతున్నాడు. ఇక నేను వడ్డించడమే తరవాయి. పీటలు పరిచి మంచినీళ్లు పెట్టి మావాడికోసం రెండో వెండికంచం తీస్తున్నా నినప్పెట్టెలోనుంచి. అలాంటప్పుడు యముభాళ్లలాగ ఆరుగురు చుట్టాలు వచ్చి—"

"అయ్యో!"

"అయ్యో అంటే యెద్దుపుండు కాకికినొప్పా?"

"వొకరికి యిద్దరికి కాదు ఆరుగురికి మళ్లీ వంట చెయ్యవలసిందే?...అప్పుడు మీ రేం చేశా రక్కయ్య గారూ?"

"ఏ మని చెప్పను? నా ప్రాణా లెగిరించి పోయాయి. పిండివంట అందరికీ మానేద్దా మంటే మాత్రం మజ్జిగ చాలవద్దూ? అన్నం యెలాగా తప్పదు, కూరా చారూ అయినా చెయ్యాలా?"

"బాబోయ్!"

"ఏం? బాబో యనేదానవు నువ్విప్పు డంతా అయిపోయాక-సింగారించుకోడం కూడా అయినాక మళ్లీ మడి—"

"మడి కట్టానా యేమిటి?"

"వంట చెయ్యాలనుకున్నావా - ప్రారంభిం చావా లేదా?"

"................."

"నాకు మహా చెడ్డ కోపం వచ్చింది చెల్లీ అప్పుడూ. ఎవ ళ్లే మనుకున్నా సరే, పాపం వచ్చినా పశే అని "నేను వండలేను" అని మొండికెత్తు క్కూచు న్నాను—"

"బావగారు—"

"వారూ నాలాగే సిద్ధపడ్డారు. వారి చిరాకు చూశాటప్పటికి "యే మని పోతారో బాబూ వాళ్లనీ" అని నేనే బేజారై పోయాను నిజంగా"

"మీ మరిదిగారయితే వాళ్లని తన్ని తగి లేస్తురు"

"ఆ వుపాయం నువ్వే చెప్పి వుందువు"

"చివరికి మేమూ అలా చేసినట్టే అయింది. అప్పు డేం జరిగిం దనుకున్నావ్ చెల్లీ? ఇదంతా పని కట్టాడు మా తమ్ముడు. తిన్నగా బావగార్ని చాటుకు పిలిచి "నే నో వుపాయం చేస్తాను, మీరు గప్‌చిప్‌గా వూరుకోం డన్నాడు; కాని వాడేం అఘాయిత్యం మాట లంటాడో అని నా ప్రాణాలు పీచుపీచు మంటూ- చిన్నపిల్లాడు కదా అని అలా అనుమాన పడ్డాను; గాని యేం తమాషా చేశా డనుకున్నావు మావాడు? వాళ్ల దగ్గిరికి మెల్లిగా వెళ్లి "నేను హోట లుకి వెళ్లి వస్తా" నన్నాడు. వాళ్లు "అదేమి" టని వులిక్కిపడ్డారు. "చాకిరీ జరక్క మా అక్కా, బావా హోటల్‌నుంచి తెప్పించుకుంటున్నారు భోజనం" అన్నాడు మావాడు. దానిమీద మరిదిగారూ! వాళ్లకి పై ప్రాణాలు పైనే యెగిరిపోయాయి. మొదట మొగ మొగాలు చూసుకున్నారు. తరవాత మాపుల్లో రక రకాల భావాలు చూపించుకున్నారు. చివరికి పట్టు పంచెలు బుజాలమీద వేసుకుని "మడిగా పెట్టే హోట లెక్క" డంటూ వాడివెంటపడ్డారు. తలుచుకుంటే నవ్వు వస్తోంది...అప్పు డేం చేశా డనుకున్నావు మా తమ్ముడు చెల్లీ? "నేను చాదస్తపు హోటల్లోకి రాను. వరదారావుహోటలుకి వెడతాను. మీ రలా వెళ్లి వీథి చివర అడగండి యెవ రేనా చూపిస్తా" రంటూ వాళ్లని సందు మళ్లించి నిమిషాలమీద యింటికి వచ్చే శాడు. తరవాత ముగ్గురమూ యేకబంతినే భోంచేశాం. అయితే: పొట్టలు చెక్కలయే ట్టు నవ్వుకోడమే గాని రేమీ తినలేకపోయాం"

"చేసిన బొబ్బట్లన్నీ మిగిలిపోయాయి కామోసు పాపం"

"మీ యిద్దరికోసమూ రాగా అప్పటి కప్పుడే భోజనాలు చేసేసి సినీమాకి వెళ్లిపోయారు మరి"

"అవు నవును, జ్ఞాపకం వచ్చింది; కాని మీ చెల్లాయికి ముట్టవలసింది ముట్టే పోయింది కాదూ?"

"పోం వెత్తుసు మన్నా సరే, మరే మన్నా సరే మమ్మల్ని, చెల్లాయికి పెట్టకుండా నే నేమీ తిన లేను సుమండీ"

"మన్నాడు మా అన్నగారు నన్ను కాఫీ హోటలుకి తీసుకు వెళ్లలేదు కామోసు"

"చూశావు టమ్మా చెల్లీ? మన కే మేనా- యిద్దర్లో వొక రేనా చెప్పారా?"

"చాటున యేం చేసుకుంటే లెక్కల్లోకి వస్తుం దక్కయ్యగారూ?"

"మరే. అదీ నిజమే......చివరి కే మయిందో విన్నావా? ఈసంగతి నాలుగు రోజులకే చుట్టా లంద రికీ తెలిసిపోయింది. అది మొదలు మాతో పని లేని వాళ్లు మాయింటికి రావడం మానేశారు"

"బతికారు"

"దీంతో మనకి అలాగే అవుతుందం డోయ్!"

"కావా లనే కాదూ నా కోరికా?"

"......మరి మీ తమ్ముడు వెళ్లిపోయాక కూడా మన కాలక్షేపం యెందుకండీ"

"అవు నవును. చొక్కా, కండువా యిలా తే కావూ"

"ఇంకా యెందుకు చెల్లీ స్తవ్వు ఆర్పెయ్యకా?"

"వచ్చె వచ్చె........."

"అన్నగారు సిద్ధంగావున్నారా వొదినగారూ?"

"ఇంకా—అరుగో, మాటలోనే వచ్చారు మనవాళ్లీ యింటో కూడా రెండేళ్ల నాడు మన యింటో జరిగినట్టే జరిగిం దండోయి సుమారుగాను"

"ఏమిటి తమ్ముడు గారూ?"

"చుట్టాల గోలండీ. పిల్లకి మంచీ చెడ్డా యేమీ లేవు. పట్నానికి యేం పనిమీద వచ్చినా సరే భోజనానికి సిద్ధం. వొకడు తొమ్మిదింటికే కావా లంటాడు. వొకడు వొంటి గంటదాకా మాడుస్తాడు—"

"వొకడు 'పెరుగు వడ్డించ వమ్మా వొదినా' అంటాడు. అవునా రుక్కూ?"

"పోనిస్తురూ, యేదో నోరు జారి వచ్చేసిందీ"

"అ దేమిటో చెప్పరూ అక్కయ్యగారూ?"

"ఏమీ లే దమ్మా! మా బావగారికి పెద్దమ్మమ్మ సవితి మనమడు ట. వొకనాడు వొంటిగంటకి రైలు దిగి వచ్చి పప్పూ కూరా అయిపోగా పచ్చడీ, వూరుగాయలూ, పులుసూ వడ్డించాను. అంతా అయినాక "చల్ల వద్దు వదినా! పెరుగు పొయ్య వమ్మా!" అంటూ గునిశాడు పాపం"

"మామ్మ్మ, మాతంఁడ్రే"

"మళ్లీ చిన్నాడూ, చితకాడూ కాడు సుమా. పూర్తిగా యిరవై నిండాయి. పెళ్లాంతో కాపరం చేస్తున్నాడు. వొక బిడ్డ కూడా నేమో"

"పెరుగు మొగం యెరిగిన బాపతు కాదు సుమండీ అక్కయ్యగారూ!"

"అవు నమ్మా!......అప్పు డేం జరిగిం దను కున్నారు మరిదిగారూ?......అది కూడా మీరే చెప్పండీ"

"ఆమాట చెవిని పడేటప్పటికి నాకు వొళ్లు మండిపోయింది తమ్ముడు గారూ! కాని కొంచెం శాంతించి "చల్ల అయినా నాలుగు రోజుల నాటిది రా!" అన్నాను. "అయితే వ" ద్దని చెబుతూ వాడు పులుసుతోటే భోజనం ముగించి లేచిపోయాడు"

"మనం యిలా కూచుంటే—"

"అవు నవును. ఈ మొగాళ్లతో యిదే చిక్కు. కబుర్లు కందుకుంటే యిక అంతంటూ వుండదు. నువ్వు ముందు నడు చెల్లీ!"

"ఆడాళ్లు లేచి వెళ్లాక భోజనాల దగ్గర కాళ్లు చాచుక్కూచుని మరీ మొదలేస్తారు కారూ మొగాళ్లు కబుర్లు రుక్కూ?"

"మా బాగా అడిగా రన్నయ్యగారూ!"

దీనికి జవాబు చెప్పక కామేశ్వరీ, రుక్కమ్మ వీధిలోకి వెళ్లి నుంచుని "ఇంకా రారేం మరీ?" అని గట్టిగా అడిగారు.

౫

ఇళ్లకి తాళాలు వేసుకుని నలుగురూ కల్లీబొల్లీ మంటూ బయలుదేరారు. కొంత దూరం వెళ్లాక కాళ్లకి కుచ్చెళ్లు కొంగు అడ్డం వచ్చినట్టు నటించి కొంచెం వెనక్కి తగ్గి కామేశ్వరి, పక్కవాటుగా మొగుడికి తాంబూలం అందించి మళ్లీ రుక్కమ్మతో కలుసుకుంది.

కుర్చీలు రిజర్వు చేయించుకున్నారు కనక నాటకశాల అడుగు పెట్టడానికి సందు లేనంతగా నిండిపోయినా వారి కేమీ యిబ్బంది కలగలేదు.

పెద్దపెద్ద బండల్లోనుంచి సెలయేరు ముందుకి వెళ్లేటట్టు వారు మొగుడూ పెళ్లాం, మొగుడూ పెళ్లాముగా తప్పించుకు వెళ్లి, మొగుడూ పెళ్లాం, పెళ్లాం మొగుడూగా మొదటి వరసలో మధ్య దర్జాగా కూచున్నారు.

వారు కూచున్నారు. అంతే. నాటకం మొదలయింది.

భోజనానికి లాగే నిక్కి నీలిగి వెళ్లాడు కనక చుట్టం, కుర్చీ దొరక్క లైట్ వింగు దగ్గిర గోనెసంచి పరిపించుకుని వుసూరు మంటూ—ఈదంపతుల్ని చూసి నిర్ఘాంతపడిపోయాడు పాపం మానవుడు.

---

లోకల్ బోర్డు పరిపాలనమా ?



# సైనికశాఖ – భారతీయులు

మోచర్ల కృష్ణమూర్తి

సైన్యములను భారతీయుల పరమొనర్చు విషయమున ప్రభుత్వమువారు రిపోర్టుల ప్రకటించిన ప్రణాళిక ప్రజలదృష్టిని తగినంతగ నాకర్షించినట్లుల గన్పింపదు. ఎన్నికల హడావడియందును, రాజ్యాంగ సంస్కరణల అలజడియందును ఆప్రణాళిక విస్మరింపబడియుండును కాని ఈసైనికసమస్య భారతరాజకీయ జీవితమునందు రాజ్యాంగ సంస్కరణల కేమాత్రమును దీసిపోవునది గాదు. భారతస్వపరిపాలనకు సైనికసమస్య నిజముగ నాయువుపట్టు. ప్రభుత్వమువారింతవర కవలంబించుచున్న పద్ధతులవలన ఆంగ్లసాహాయ్యము లేనిది భారతదేశ మాత్మరక్షణగావించుకొనలేని స్థితియందున్నది. భారతీయు లందుచే సైన్యములను భారతీయముగ నొనర్పవలెనని చిరకాలముగా నాందోళన మొనర్చుచుండిరి. భారతదేశము ఆత్మరక్షణ మొనర్చుకొనగల్గువరకును సంపూర్ణస్వపరిపాలన అసాధ్యమని ఆంగ్లనాయకులు రౌండుటేబులుసభలలో స్పష్టముగ దెలిపియుండిరి. భారతజాతీయస్వాతంత్ర్యమునకు పునాదియగు నీవిషయమున ప్రభుత్వమువా రేర్పరచిన ప్రణాళిక యెంతవర కాదర్శసాధకమగునో తెలియదగియున్నది.

## భారతీయుల పరమొనర్చుట అనగా,

సైన్యముల భారతీయుల పరమొనర్చుట యనగా, సైనికశాఖకు భారతీయుని మంత్రిగా నియమించుట యని కొందరు భావింపవచ్చును. కాని ఇపుడుద్దేశించిన దది గాదు. భారతప్రభుత్వమువారిక్రింద రెండుతెగల పటాలములున్నవి: ౧. బ్రిటిషు ప్రభుత్వమువారి ఆంగ్లపటాలములు, ౨. భారతీయపటాలములు. భారతీయపటాలములలో, అధికారపదవులలో చిన్నవానిని వైస్రాయికమిషను నందినవారి కొసగుచున్నారు. పెద్దవానినన్నిటిని కింగ్సుకమిషనుల నందినవారి కొసగుచున్నారు. కింగ్సుకమిషనుల నిటీవలివరకును భారతీయుల కొసగక ఆంగ్లేయులకే యొసగబడుచుండుటచే, అధికారపదవు లన్నియు నాంగ్లేయులచే నాక్రమింపబడుచున్నవి. ఆయధికారపదవులకు భారతీయులను నియమించి, సైన్యములు సంపూర్ణముగ భారతీయులచే నడిపింపబడునట్లు చేయుట, అసలే భారతీయపటాలములు లేనిశాఖలందు క్రొత్తగా భారతీయులచే నడిపింపబడు పటాలముల నేర్పరచి దేశరక్షణభారమును వహింపగల దేశీయసైనికబలము నేర్పరచుట, సైన్యముల భారతీయుల పరమొనర్చుట యనగా నిదియే. ఎవ రెట్టి ప్రణాళికల నేర్పరచినను, పై యాదర్శమును సాధించుట కవి యెంతవరకు తోడ్పడును అను విషయమునుబట్టియే వానిగుణదోషముల లెక్కింపవలసియున్నది.

## నౌకాదళము

సైన్యముల భారతీయులపర మొనర్చుటకు తాము దలపెట్టిన కార్యక్రమమునందు నాల్గంశములను ప్రభుత్వమువారు పేర్కొనియుండిరి. అందొకటి నౌకాదళమును గురించి. భారతప్రభుత్వమువారు నౌకాదళమున నిపుడు ౫ చిన్న యుద్ధనౌకలును, ఇతర చిన్ననౌకలు మరికొన్నియు, ౧౦౧౧ సైనికులును, ౧౧౭ అధికారులును మాత్రమే గలరు. నామమాత్రమగు నిట్టి నౌకాదళమునగూడ సైనికులుగ దప్ప అధికారపదవులలో భారతీయుల నింతవరకును చేర్చుకొనుటలేదు. ఇక మీద అధికారపదవులకు చేర్చుకొనబడు క్రొత్తవారిలో మూడవవంతు భారతీయుల చేర్చుకొనవలసినదని ౧౯౨౮ సం. న ప్రభుత్వమువారు నిశ్చయించిరట. ఆవిధానమువలన కడచినఆరువత్సరములలో, ముగ్గురు భారతీయు లధికారపదవులకు నియమింపబడిరి. మరి ౧౮గురు భారతీయులింకను శిక్షణము నందుచున్నారు. ఈ

యేర్పాటుల ప్రకారము 33 వత్సరములకు నౌకాదళము మన మూడవవంతు మాత్రము భారతీయము గావచ్చును. అంతే. తరువాత వత్సరములలో క్రొత్తగా చేర్చుకొనబడు భారతీయులు, అదివరకున్న భారతీయోద్యోగులలో కల్గు ఖాళీలను భర్తీచేయుటకుమాత్రమే సరిపోవుదురు. ఇక సంపూర్ణముగ భారతీయుల పరమొనర్చు నాదర్శము ప్రభుత్వమువారు సూచించిన పద్ధతివలన నెటుల సాధ్యమగునో, ఎప్పటికి సాధ్యమగునో!

## విమానదళము

రెండవది విమానదళము. ప్రభుత్వమువారి క్రింద నున్న విమానదళమున నిపుడు షుమారు ౮౦౦ విమానములు, 3౦౦ అధికారులు, ౨౦౦౦ వైమానికులు, చిన్న ఉద్యోగులు నుందురు. వీనిఖర్చునంతను భారతప్రభుత్వమువారే భరించుచున్నారు. కాని దానియందు భారతీయులకు ప్రవేశములేదు. ఇది బ్రిటిషుప్రభుత్వమువారి విమానదళముగను, తాత్కాలికముగ నీదేశమునం దుంచబడినటులను వ్యవహరింపబడుచున్నది. ఆ కారణముచే, ఈశాఖయందు భారతీయుల చేర్చుటకుగాని, ఆదళమును భారతీయముగ నొనర్చుటకుగాని వీలులేదని భారతప్రభుత్వమువారు ప్రత్యుత్తర మొసగుచున్నారు. ఇక భారతీయాశయమును సంతృప్తిపరచుటకుగాబోలు ౧౯33 లో ఒకవిమానదళమును ఏర్పరచెదమని ప్రకటించిరి. దాని బలగ మెంతయుండునో, ఎప్పటికి పూర్తియగునో ఎచ్చటను దెలుపబడలేదు. ఈదళమున మొదటి "స్క్వాడ్రను"నకు ప్రారంభముగ నాల్గువిమానములు చేర్చబడెను. ఇంతవరకు అధికారులలో ౫గురుమాత్రమే భారతీయులు. మిగిలినవారు ఆంగ్లేయులు. మరిముగ్గురు భారతీయులింకను శిక్షణము నందుచున్నారు. భారతీయులు శిక్షణమునందివచ్చినపుడు, ఆంగ్లేయాధికారుల నితరపటాలములకు మార్చి భారతీయుల నాఖాళీలలో నియమించెదరు. ఈసంఖ్య లెక్కడ, ఈదేశమునన్న రాయలువిమానదళపు సంఖ్య లెక్కడ! క్రొత్తభారతవిమానదళము దానితో నెప్పటికి సమానముగాగలదు. తా మీక్రొత్తదళమునం దేర్పరుపదలచిన మొత్తపుసంఖ్యను దెలుపకుండుటచే ప్రభుత్వమువారి ప్రణాళిక ప్రజలకు విశ్వాసము గలిగింపజాలదు. ఇపుడున్న రాయలువిమానదళమునను భారతీయుల చేర్చి క్రమముగా భారతీయుల పరమొనర్చుటకు యత్నించినచో భారతీయులకు విశ్వాసము గల్గెడిది. ఒకవైపున రాయలువిమానదళపు వ్యయమును భరించుచు, మరియొకవైపున మరియొక విమానదళమునుగూడ భరించుట కష్టము. క్రొత్తశాఖను బలపరచి అభివృద్ధిచేయుటకు తగిన అవసరముగాని, అభిలాషగాని యుండజాలదు. భారతవిమానదళనిర్మాణవిషయమున ప్రస్తుతసూచనలు భారతీయులకు కంటి నీరు తుడుచుటకైన తుద కుపకరింపజాలవు.

## సాధారణ సైనికశాఖ

ఇక సాధారణసైనికశాఖ విషయము: భారత ప్రభుత్వమువారిక్రింద ప్రస్తుతమున్న ఆంగ్లభారతపటాలములసంఖ్య ఈక్రింద నొసగబడెను. అనియన్నియు కలిసి ౯ డివిజనులుగ విభజింపబడును. అందు భారతీయపటాలములు ఆరు డివిజనులగును. ఆయారుడివిజనులలో ఒకడివిజనునకు సమానమగు పదాతులను (షుమారు ౨౫ పటాలములు), ఒక అశ్వికబ్రిగేడును (షుమారు 3 పటాలములు), వానికి సంబంధించిన అనుబంధపటాలములను, అనుచర పటాలములను వేరుపరచి భారతీయముగ నొనర్చెదమనియు ప్రభుత్వమువారిపుడు ప్రకటించిరి.

భారతదేశములోని పటాలముల సంఖ్య

(షుమారు)

| | | | |
|---|---|---|---|
| ఆంగ్ల | పదాతి | పటాలములు | ౮౫ |
| భారత | ,, | ,, | ౧౮౦ |
| ఆంగ్ల | అశ్విక | ,, | ౬ |
| భారత | ,, | ,, | ౨౧ |
| ఆంగ్ల | శతఘ్ని | ,, | ౮౦ |
| ,, | సకవచశతఘ్నులు | కంపెనీలు | ౮ |

("ఎవల్యూషను ఆఫ్ ఇండియన్ ఆర్మీ"నుండి)

పైసంఖ్యలబట్టి భారతీయుల పరమొనర్పదలచిన సైన్యమెంత యల్పమో తెలియగలదు. ఈ స్వల్ప

భాగమైనను, సత్వరముగ భారతీయముగ నొనర్చుటకవకాశ మొసగియున్నచో సంతోషదాయక మయ్యెడిది. కాని, ప్రభుత్వమువారు అవలంబింపదలచిన పద్ధతులు ఆశయసాధనమును అడుగడుగునను దూరీకృత మొనర్చుచుండెనే గాని సన్నిహిత మొనర్చుట లేదు. ప్రస్తుత మీపటాలములయందు వైస్రాయికమిషనులన్నియు భారతీయులచేతనే నిర్వహింపబడుచున్నవి. కింగ్సుకమిషనులనందియున్న పెద్దఅధికారపదవులనే భారతీయులపర మొనర్పవలసియున్నది. ఈపదవులను నిర్వహించుట కభ్యర్థులకు శిక్షణమునొసగుట కేర్పరుపబడిన డేరాడూను సైనికకలాపరిషత్తునం దిప్పటి యేర్పాటులప్రకారము ఏటేట ౫౯, లేక ౬౦ మంది మాత్రమే శిక్షితులై వచ్చెదరు. వారినందరను, ఇపు డాంగ్లేయులచే నిర్వహింపబడుచున్న పదవులకే నియమించునెడల (ఒకడివిజను పటాలములం దాపదవులు షుమారు ౫౪౦ ఉండును) ౯ వత్సరములలో సంపూర్ణముగ నొకడివిజను భారతీయులచే నిర్వహింపబడుచుండెడిది. కాని ప్రభుత్వమువా రందుకు అవకాశ మొసగలేదు. భారతీయులపర మొనర్చు పటాలములలో "వైస్రాయి" కమిషను నుద్యోగులనుగూడ తొలగించి, డేరాడూను కలాశాలయం దుత్తీర్ణులైవచ్చినవారినే ఆపదవులకు గూడ నియమించుటకు నిశ్చయించిరి. ఒక డివిజనునందు సుమారు ౬౦౦ వైస్రాయికమిషనుద్యోగు లుందురు. డేరాడూను సైనికకలాపరిషత్తు నుండి అనువర్షము వెలువడు ౬౦ మందినిమాత్రమే ఈ రెండుతరగతులకు నియమించునెడల, ౨౦ వత్సరముల వరకు ఆపదవులన్నియు భారతీయులతో నింపుట పూర్తిగాదు. ఇతరపటాలములలోగూడ "వైస్రాయి" కమిషనుల తొలగించినచో అర్థముండెడిది. అటుల చేయలేదు. ఆంగ్లేయాధికారులచే నిర్వహింపబడు ఇతర భారతీయపటాలములం దాపదవులు తొలగింపబడలేదు. ఇందువలన, పటాలములను భారతీయమొనర్చు కార్యము జాగగుటయె గాక మరియొక అనర్థముగూడ సంభవించుచున్నది. సామాన్యసైనికుడుగ చేరిన ప్రతివాడును స్వశక్తిసామర్థ్యములవలన వైస్రాయి కమిషను నుద్యోగియగుటకు వీలుండెడిది. భారతీయపటాలములలో నాయుద్యోగములు తొలగింపబడుటచే సమర్థులును, అభివృద్ధికాంక్షులును నగువారు పటాలములలో చేరుటకు వెనుకాడెదరు. ఆంగ్లేయాధికారుల క్రింద నుండు పటాలములలో చేరినచో వారు పై యుద్యోగముల నందుటకు వీలుకలదు. అందుచే వా రాపటాలములలో చేర నభిలషించెదరు. ఈవిధముగ భారతీయులపర మొనర్పబడు పటాలముల సౌష్ఠవము తగ్గుటయు, ఆకర్షణను గోల్పోవుటయు సంభవింపవచ్చును.

ఒకడివిజనును భారతీయ మొనర్చు కార్యమునకు ౨౦ సంవత్సరములకు పొడుగించుట ఎంత విపరీతముగనున్నదో చూడుడు. ౧౯౨౧ సం. న భారతప్రభుత్వమువారిచే జనరల్ షీగారి అధ్యక్షతక్రింద నియమింపబడిన ఆంగ్లసైనికాధికారులు సైన్యమునంతను ౪౨ వత్సరములలో భారతీయులపర మొనర్చుటకొక ప్రణాళికను ఏర్పరచిరి. ౧౯౨౨ సం. భారతప్రభుత్వమువా రేకగ్రీవముగ దాని నామోదించుటయె గాక, కాలపరిమితిని ౩౦ సంవత్సరములకు తగ్గించిరి. ఏలనో కాని ఆవిషయములనైన బహిరంగపరుపకుండ ప్రభుత్వమువారు దాచియుంచిరి. ఆవిషయములు తెలుపబడకపోయినను, ౧౯౨౫ సం. న నియమింపబడిన జనరల్ స్కీన్ కమిటీవారు ౨౫ వత్సరములలో (౧౯౫౨ సం.కు) సైనికబలమున సగముభాగము భారతీయుల పర మొనర్పబడవలెనని నిర్ణయించి అందుకొక ప్రణాళిక నేర్పరచిరి. అవి యెక్కడ? ఇపుడు ఒకడివిజనును భారతీయుల పరమొనర్చు ప్రయత్నమెక్కడ? భారతీయమొనర్చుకార్యక్రమము స్థితి "నానాటికి తీసికట్టు నాగంభట్టూ" అనునట్లున్నది.

## సైనికకళాపరిషత్తు

సైన్యమును భారతీయుల పరమొనర్చుటకు ప్రభుత్వమువా రొనర్చిన మరియొక కార్యము, భారతదేశమున, డేరాడూనునందు సైనికకళాపరిషత్తు (మిలిటరీఅకాడమీ) నేర్పరుచుట. ఇది ౧౯౩౨ సం. న

ప్రారంభింపబడెను. సైనికశాఖయం దున్నతోద్యోగ పదవులకు అభ్యర్థులకు శిక్షణమొసగుట కిట్టి పరిషత్తు అవసరము. ఇదివరకు భారతీయుల కాపదవు లొసగబడకుండుటచే, అట్టిపరిషత్తు ఇంతవరకును ఏర్పడలేదు. సంగ్రామానంతరము, కొలదిమంది భారతీయుల కా పదవు లొసగుటకు ప్రారంభించినను, వా రాంగ్లదేశమునకు జని సాండుహర్స్టునందు శిక్షణబడయుచుండిరి. భారతకళాపరిషత్తు నేర్పరుచుట సంతోషదాయకమే. కాని అందు చేర్చుకొను విద్యార్థులకు కల్పింపబడిన పరిమితియు, శిక్షితులైవచ్చినవారి కొసగ దలపెట్టిన హోదాయునుమాత్రము చాల అసంతృప్తికరముగ నున్నవనకదప్పదు. పరిషత్తునం దిపుడు ౬౦ మందికి మాత్ర మేటేట శిక్షణమొసగెదరు. స్కీనుకమిటీవారీపరిషత్తునందు ౬౯ మందికి శిక్షణమొసగవలెననియు, వారుగాక మరి ౨౦ మందిని ప్రతివత్సరమును సాండుహర్స్టుకలాశాలయందు చేర్చుకొనుచుండవలె ననియు సూచించిరి. అనగా ౮౯ మందికి శిక్షణముండవలెనని వారి శిఫార్సు. డేరాడూనునందు పరిషత్తునేర్పరచినపిమ్మటగూడ సాండుహర్స్టునందు చేర్చుకొనుచుందుమని రౌండుటేబిలుసభలలో బ్రిటిషుప్రభుత్వప్రతినిధులు, ఆంగ్లనాయకులు అభయమొసగి వాగ్దానముల నొనర్చిరి. కాని డేరాడూనుపరిషత్తును ౧౯౩౨ లో ప్రారంభించినవెంటనే సాండుహర్స్టులో భారతీయుల చేర్చుకొనుటను మానివేసిరి. ఈవిధముగ సైనికశిక్షణమును బడయు భారతీయులసంఖ్య చాల తగ్గింపబడెను.

ఇక హోదాలవిషయము. భారతదేశమున శిక్షితులైనవారికిగూడ కింగ్సుకమిషను లొసగబడునని భారతీయులు భావించిరి. కాని వీరికిపుడు, "ఇండియన్ కమిషను" అని క్రొత్తకమిషనును యేర్పరుచుట కిటీవల భారతశాసనసభలలో నొకచట్టము గావింపబడెను. కింగ్సుకమిష నుద్యోగులకంటె వీరికి వేతనాదికములు తక్కువ. అవి యెటులున్నను, వీరికి కింగ్సుకమిషనుద్యోగులతో సమానహోదా గౌరవములున్న జాలును. కాని అవిగూడ తగ్గింపబడెను. కింగ్సుకమిషనుద్యోగులు జనరల్ కోర్టుమార్షలునందు న్యాయాధిపతిగ నియమింపబడవచ్చును. కాని ఇండియన్ కమిషను అధికారి యెంతపెద్దహోదాలో నున్నను, తనక్రింది తెల్ల ఉద్యోగుల నేరముల విచారించి శిక్షించుట కధికారము లేదు. ఆంగ్లాధికారులక్రిందనున్న పటాలములు, ఇండియన్ కమిషనుక్రిందనున్న పటాలములు కలసి పని చేయునపుడు, సంయుక్త సైన్యాధిపత్యపదవి కాళీయగుచో, జూనియరైనను కింగ్సుకమిషనుగల ఆంగ్లేయాధికారి పైసైన్యాధిపతియగును. సీనియరైనను, భారతీయాధికారి కాపదవినందుట కధికారములేదు. ఇట్టిన్యూనతలు భారతీయాధికారులకు దుస్సహములై ఆత్మగౌరవమునకు భంగముగల్గింపవచ్చును.

ఈవిషయమున, ప్రభుత్వమువా రవలంబించుచున్న విధానమునందు రెండుభావములు ప్రస్ఫుటమగుచున్నవి: ౧. భారతీయాధికారిక్రింద పనిచేయు స్థితి ఆంగ్లసైనికులకు కల్పింపరాదను జాతీయాహంకారము, ౨. సైన్యమును సత్వరముగ భారతీయమొనర్చుట కయిష్టత. పైనుదాహరింపబడిన విషయములం దీవిషయము స్పష్టముగ దెలియుచునేయున్నది. ఇండియన్ కమిషనుద్యోగి కోర్టుమార్షలునం దుండరాదనుటయు, సంయుక్త సేనాధిపత్యములు వ్యవహారక్రమములో భారతీయాధికారికి రాకుండజూచుట, భారతీయములుగ నొనర్పదలచిన పటాలముల వేరుచేసి, వానిలో నికమీద ఆంగ్లేయాధికారుల నియమింపరాదను నియమము నేర్పరుచుట, ఇదివరకు కింగ్సుకమిషనుల నందిన భారతీయులనందరనుగూడ భారతీయులపరమొనర్పబడు పటాలములకే మార్చుట మొదలగునవన్నియు ఆంగ్లసైనికులు భారతీయాధికారులక్రింద పనిచేయ నవసరము లేకుండచేసి, వారిజాతీయాధిక్యమును కాపాడుట కుద్దేశింపబడినటుల నిరూపితమగుచున్నది.

---

# చెఱకుపంట : చక్కెరవంట

పూడిపెద్ది వెంకటరమణయ్య

ఏనాటనుండియో భారతదేశమున చెఱకు మొలకెత్తుచున్నది. దాని తీయదనము కావ్యముల కంటుకొనినది; నీతిశతకములలో నిలిచినది. అది మదనునిచేత సైతము మన్నన బడసినది. అట్లయ్యు చక్కెరవంట మాత్రము కాలక్రమమున నున్నతినందినది కాదు. దానికయి యానాడేయంత్రసాధన ముపయోగింపబడినదో, అదేసాధనము మొన్న మొన్నటివరకు నుపయోగింపబడుచున్నది. కఱ్ఱదో, యినుపదో ఒకగానుగ, దాని సెడ్లు లాగుట, చెఱకు బరువుమీద నూటికి ౫౫ లేక ౬౦ చొ. రసమును పిడిచికొనుట, ఆరసమును శుభ్రపరచుటకుగాను కొంచెము సున్నముకలిపిన చోట కలుపుట, లేనిచోట లేకపోవుట, ఆరసమును పెద్దపెనములలోబోసి ప్రొయ్యిపై పెట్టి బెల్లముగ గట్టిపడువరకు మఱిగించుట, అందలిమడ్డి తేర్చి తీసినచోట తీయుట లేనిచోట లేకపోవుట ఇదంతయు వట్టిదండుగపని యగునుగదా. రసములోని చాలభాగము పిడుచుట చాలక పిప్పిలోనుండి పోవును. దానిని సంపూర్ణముగ పిడుచు బల మీగానుగకు చాలదు. ఈవచ్చిన రసములో కలసియున్న చక్కెరకూడా మిక్కిలిగ మరగబెట్టుటవలన బెల్లపుమడ్డిలో చెదరిపోయి పోల్చరాకుండును. ఇట్లువండిన బెల్లము, చెఱకుకఱ్ఱల బరువునుబట్టి నూటికి ౯ మొదలు ౧౧ వరకును దిగుబడియగును. ఆబెల్లము నట్టే కొంత పరిశుభ్రపరుపబంపుదురు.

సంయుక్తరాష్ట్రిలలో, ముఖ్యముగ, రోహిల్కండు, ఔదులలో వెడల్పుపెనములలో ఎఱ్ఱవాకు చక్కెర తయారుచేయుదురు. అది అతి శీఘ్రముగ నంగడిలో చెల్లిపోవుచున్నది. ఏమనగా దాని గౌరవర్ణము కనులకింపుగ నుండును. అంతేకాక, దాని కొకవిధమయిన కమ్మదనమును గలదు. ఈపరిశ్రమ చిన్న పెట్టుబడితో సాగించుకొనదగిన గృహపరిశ్రమయే యనవచ్చును. రెండుమూడువేల పెట్టుబడితో దినమునకు ౧౦, ౧౫ టన్నుల చెఱకుకఱ్ఱతో పనిచేయవచ్చును. ఇక్కడ మూడుపాత్రముల గానుగలు తైలబలమున (Oil Engine) నడిపింతురు. ఈగానుగవలన కఱ్ఱబరువుపైని నూటికి ౭౦ వరకు రసమును పిడిచికొనవచ్చును. ఆరసమును శుభ్రపరచుటకుగాను, అందు, చాకలికారము, సున్నము, అడవిబెండరసము మున్నగునవి కలిపి మాలిన్యమువిరచి తేర్చుదురు. అప్పుడా తేటరసమును వేరుచేసి అట్టేఉంచి పేరుకొననిత్తురు. లేదా ఆరసమును తేర్చకుండగనే దొంతులుగ బెట్టిన పెనములలో మరగించి పైకితేరిన తెట్టెను తెడ్డతో త్రోసి తీసివేసి తగినపాకము వచ్చినతరువాత దానిని అనువైన పాత్రలలో నింపి ఒకవారము దాని నట్టే విడుతురు. అప్పుడాసగముచిక్కబడ్డ రసములో చక్కెరరవ తేర్పడును. అప్పు డీసగము పేరుకొన్న పాకమును యంత్రమున తిరిగే జల్లెడలో పోసి చాలవడిగా త్రిప్పుదురు. ఈవడిగా తిరుగుటవలన చక్కెరరవ లాజల్లెడ కన్నములలో నిలచిపోయి, మిగిలిన రసము పైకి కారివచ్చి దానికొరకమర్చినపాత్రలో బడును. దానిని మడ్డియందురు. అట్లు జల్లెడలో నిలువరించిన చక్కెరను నీటితో కడిగి తీసి చక్కగ నెండబెట్టి సంచులకెత్తుదురు. ఈవంటను 'కన్సారీ' వంట యందురు.

మడ్డి తిరుగ పెనములలో పైతీరున బెట్టి వెనుకటివలెనే చేసిన అందు ౨౫, ౩౦ దినములలో చక్కెరరవలు పొడసూపగలవు. దానినికూడ జల్లెడ యంత్రమున త్రిప్పిన రెండవ చక్కెరపంట వచ్చును. ఇక్కడకు మిగిలిన యీమడ్డినీటిని, పొగాకుతో 'గుడాకు' మొదలగునవి చేయుట కుపయోగింతురు. పిప్పిచక్కెర ప్రొయ్యిలోనికే పనికివచ్చును. ఇట్లు కూర్చుకొన్న చక్కెర నూరుటన్నుల చెఱకుకఱ్ఱకు నాలుగుమొదలు ఆరుటన్నులవరకును కిట్టును. ఈదిగుబడి వాడుకచేసిన యంత్రసాధన ప్రాశస్త్యము, పనివాండ్ర చాకచక్యమును బట్టిఉండును.

ఇది ఉత్తరహిందుస్థానమున జనామోదము బడసి దినదినాభివృద్ధి నొందుచున్న పరిశ్రమ. ఏమనగా నీ చక్కెర ఇప్పుడువచ్చు తెల్లచక్కెర కేమాత్రమును తీసిపోక పోటీగ నిలబడగలదు. కాని ఈపరిశ్రమలో యంత్రముల ప్రాశస్త్య మొకడుగావలెను. మరుసవేళల కలిగే చక్కెర నష్టము నరికట్టవలెను.

ఇప్పుడిప్పు డారితేరిన శాస్త్రవేత్తలును, రసాయనతత్త్వవేత్తలును పెట్టుబడిదారులకు తోడయి, మంచిమంచి చక్కెరవంటయిండ్లను, సూటియైన పరికరములను సేకరించి తెల్లని చక్కెరను సులభసాధ్యముగ జేసికొనుచున్నారు. ఈవిధానవివరము లన్నియు ముందు వ్యాసముల దెలుపబడును.

చెరకు పండించు దేశములలో మిగుల ప్రాతవానిలో ప్రాతదయ్యును, మనదేశము నేడు మంచి పద్ధతులతో చక్కెర వండుటయందు క్రొత్తపూజారి యయినది. నేటికిని మనదేశము, లక్షలకొలదిటన్నుల చక్కెర జావాద్వీపమునుండి దిగుమతిచేసికొని తాను వాడుకచేసికొనుచున్నది. ఇప్పుడు ౧౫ సంవత్సరముల వరకును దొరతనమువా రీపరిశ్రమ విషయములను తమ చేతులలోనికి తీసికొని, చక్కెరవంటను మనకలవరచుటకు సాయముచేయుచున్నారు. ఈయవకాశము దొరకబుచ్చికొని, సంయుక్తరాష్ట్రములలోను, బీహారులోను పెట్టుబడిదారులు దడదడ చక్కెరవంటశాలలను నెలకొల్పుచున్నారు. ఆప్రాంతముల దేశముమొత్తమున నూటికి ౬౦ వంతుల చెఱకుపండును.

ఆపండిన చెఱకును శాలలకు తెచ్చికొనుసాధనములు కూడ వారికి చాలగలవు.

మనరాజధానిలోమాత్ర మీచక్కెరవంట పరిశ్రమ వెనుకబడి యున్నది. ౧౯౩౩-వ సంవత్సరము వరకును మనరాజధానిలో నెల్లికుప్పంవద్దమాత్ర మొక కర్మాగారమును, సామర్లకోటవద్ద నొకబెల్లము శుభ్రపరచు యంత్రమును నెలకొనినవి. కాని ౧౯౩౪ లో హాస్పేటలో ౪౦౦ టన్నులు, మైసూరులో ౧౦౦౦ టన్నులు, ఏటికొప్పాకలో ౫౦ టన్నులు, బొబ్బిలిలో ౧౫౦ టన్నులు, తుమ్మపాలలో ౫౦ టన్నులు, కిర్లంపూడిలో ౮౦ మొ. ౧౨౦ టన్నులు, ఉయ్యూరులో ౮౦౦ టన్నులు, చక్కెరవండగల శాలలు తల సూపినవి. దక్షిణ హిందూదేశమున పోదనూరులో ఒకటి (౫౦ టన్నులు) మరియొకటి ఉత్తరార్కాడులోనూ నెలకొల్పు ప్రయత్నములు జరుగుచున్నవి. ఇటుపయిని కొలదిలోనే హిందూదేశము తనకుకావలసిన చక్కెర తానే పండించుకొని వండుకొను నేర్పాటుల చేసికొనుచున్నదని, చక్కెరవంటయందునిపుణుడయిన ఆర్.సి. శ్రీవాస్తవగారు చెప్పియున్నారు. కాలక్రమమున మనదేశమునకు తాను వండినచక్కెర నన్యదేశీయులకు తినిపింపగల శక్తికూడ గలుగగలదు. అప్పుడు, సింహళము మలయాలు ఆమె కంగళ్లుకాగలవు. ఇది హిందూదేశపు మొత్తపుకథ. దక్షిణహిందూదేశముమాత్రము ఇప్పటికి అక్కడవాడుకయే చక్కెరలో నూటికి ౧౦ వంతులయిన వండుకొనలేకున్నది. ఆచక్కెరవంట నిచట యభివృద్ధిచేసికొనుటకు కావలసినన్ని యవకాశములు గలవు. ఇప్పటి వర్తకమాంద్యమువలన చెరకు వ్యవసాయమే కృషికునకు సులభసాధ్య మనిపించుచున్నది. దానివలన వానికి ఎకరమునకు ౨౦౦ లేక ౨౫౦ రూప్యములు చేకూరును. ౧౫౦ మొ. 300 టన్నులవర కాడగల పెన్నెనిగానుగలు నెలకొల్పవచ్చును. వానిని సహకారసంఘ పద్ధతిని స్థాపింపవచ్చును. కాని ఇప్పటిస్థితినిబట్టి చూడ దక్షిణహిందూదేశము (మిక్కిలి ఆకలిగొనియుండుటవలన) తనకు కావలసినదానికంటె నెక్కుడుగ చక్కెరను వండి ఉత్తరహిందూస్థానముతో చక్కెరవిక్రయమున పోటీపడవచ్చును. దానివలన క్లిష్టపరిస్థితు లేర్పడి విననసహ్యములయిన తగవు లేర్పడునేమో! అందువలన దక్షిణహిందూస్థానపు చక్కెరపంటభావిదశ చక్కగ నాలోచించి, కలవని పునాదులపై నీపరిశ్రమను నిలిపి పనిచేయవలయునేగాని అడుదుంబుడుదుమ్మని పరుగెత్తి పడిపోవనీయరాదు.

పరిశోధనావశ్యకత :

తక్కినపరిశ్రమలు తమ ముడిపదార్థములను సృష్టియొసగినట్లె గ్రహింపవలెను గాని చక్కెరమాత్ర మట్లుగాక తనకు కావలసిన చెరకురకమును తానే సృష్టిచేసికొనగలదు దీనికి వ్యావసాయికపరిశోధనము చాలవరకు కావలయును. అనగా ఎక్కువరసముతో బూరటించిన చెఱకుపంటకు ఉపాయము కనిపెట్టవలెను. ఇప్పటి పంటకాలమునకు తక్కువకాలములో పండించు నుపాయము కనిపెట్టవలెను. చెరకురసమున నిప్పుడున్న మాలిన్యములను మొదటనే తగ్గించు నుపాయము లారయవలెను. ఇంతవరకు, కోయంబత్తూరున చెరకుపెంపకపు శాస్త్రాగారమున పనిచేసిన డా. బార్బరును, వానితరువాత రా. బ. వెంకటరామన్ గారును, చేసినపరిశోధనములు విదితములే గదా. కాని అవియన్నియు ఉత్తరహిందూస్థానపు చెఱకుపెంపకమునకే యుపకరించునవి. ఇప్పుడు మనయాంధ్రదేశమున కనువయిన చెఱకువ్యవసాయపు పరిశోధనలు చేయవలసియున్నవి. ఇందు ముఖ్యమయినది చెరకాటకాలము ౧౫౦ దినములవరకు పొడిగించు నుపాయములు కావలెను. కోయంబత్తూరు చెరకు జగద్విఖ్యాతి నందినది. ఇది హిందూదేశ వస్తుసౌభాగ్యమును హెచ్చించినదని ఇర్విన్ ప్రభువే చెప్పియున్నాడు.

మరియు చక్కెరవంటలో కూడ, ఇప్పటి పెట్టుబడిని తగ్గించి తక్కువధరలలో దానిని సాగించు నుపాయములు కనిపెట్టవలెను. ఇందులకు వృక్షశాస్త్రజ్ఞుడు, రసాయన శాస్త్రజ్ఞుడు, చక్కెర-పాకశాస్త్రజ్ఞుడును కలిసి పనిచేయవలెను. ఇందు మొదటి యిరువురును, ఎక్కువచక్కెరనిచ్చెడిచెఱకును పండించు సాధనముల నొసగవలెను. మూడవవాడు చక్కెర ఆటలోనూ, వంటలోనూ కూడా తక్కువనష్టముతో కల చక్కెర నంతనూ గ్రహించుసాధనముల కనిపెట్టవలెను.

ఇందుల కారితేరిన శాస్త్రజ్ఞులు కావలెను. వీరి యాజమాన్యమున చక్కెరవంటశాలలు దినదినాభివృద్ధి నొంది పనిచేయవలెను. ఇందుకుగాను శాస్త్రజ్ఞులను తరిఫీదుచేయుటకు కాన్పూరులో నొకవిద్యాశాల గలదు. అది చక్కెరపాకమును, ఉత్తరహిందూస్థానమున కనువయినట్లే నేర్పుచున్నది. (ఇప్పుడున్న చక్కెరవంటశాలలలో నూటికి ౯౦ ఆప్రాంతములవే యగుటవలన.) ఇప్పుడు వాల్తేరున క్రొత్తగ తెరచిన శాస్త్రకళాశాల యందు కూడ చక్కెర-పాకజ్ఞులను తయారుచేయుదురట. బెంగుళూరులో గత సంవత్సరము స్థాపించిన యీ శాస్త్రకళాశాల కొంతకాలముమాత్రము పనిచేసి కొందరు విద్యార్థులనుమాత్రమే తీర్చి తిరుగ దానిని మూసివేయుదురట! దానిస్థితికి తగిన సౌకర్యములు తక్కువయట! ఆసౌకర్యములను కలిగించి దాని నెప్పుడును తెరచియుంచవలదా ?

మనయాంధ్రు లీపరిశ్రమ నభివృద్ధినొందించికొని, తీపదిగడీయకుండ నుందురుగాక !

రాబోవు వ్యాసమున తెలుగు చెఱకువిషయము కొంతవ్రాయుదును.

---

# వ్యాపారనీతి

గ. సత్యనారాయణ

జపానులో తయారయ్యెడి వస్తువులన్నియు కారు చౌకగా విదేశములలో నమ్ముడు పోవుచున్నవి కనుక జపానుదేశీయులు చేయుచున్నంత వర్తకమును మఱియేయితర ప్రాక్ప్రతీచీదేశమును చేయజాలకున్నది. అది ఇంగ్లాండుకును, తత్సామ్రాజ్య దేశములకును, ఇతర పాశ్చాత్యదేశములకునుగూడ తన సరుకును గొంపోయి ఆయాదేశములలో తయారయ్యెడి వస్తువుల కంటెనుగూడ చౌకగ నమ్మచుండుటచే వాటి పరిశ్రమలు పతనములై అవి గగ్గోలు పెట్టుచున్నవి. బంగారుప్రమాణముల నెత్తివేసినను, స్టెర్లింగు ఖరీదు తగ్గించినను గూడ అవి జపానుదేశపు సరుకుతో పోటీ చేయలేకున్నవి. జపానుతో బాహాటముగ పోటీ చేయలేక పాశ్చాత్యదేశములు జపానుదేశముమీద కొన్ని అపకీర్తికరములగు అపనిందలను ప్రచారము చేయుచున్నవి. జపానుదేశములో కూలులు బహుస్వల్పముగ నిత్తురనియు, బాలురను, బాలికలను స్త్రీలను ప్రయోగించి కూలిపనులలో నలగగొట్టి, శల్యావశిష్టులనుజేసి, ఉత్పత్తికగు వ్యయమును తగ్గించి లాభముల నెక్కువగా కొట్టుకొనుచున్నదనియు తెగవ్రాయుచున్నారు.

ఈ అపనిందలయొక్క సత్యాసత్యములను విమర్శించుట మన కర్తవ్యమైయున్నది. ఇట్లు విమర్శన చేయుటవలన జపానువారు తమ సరుకుల నెవిధముగా అంత చౌకగా తయారుచేయుచున్నదియుగూడ మనకు స్పష్టముకాగలదు. జపానుదేశపుసరుకు కారుచౌకగా నుండుటకు ప్రధానకారణము వారు తమ సరకు నత్యధికముగ తయారుచేయుట. యంత్రపరిశ్రమలలో ఉత్పత్తి సరుకు హెచ్చుచున్న కొలదియు, నిర్మాణమునకగు వ్యయము తగ్గుచుండునని యెల్లరెఱింగిన సూత్రము. జపానుదేశములో నున్నన్ని ఫ్యాక్టరీ లింకేదేశమునను లేవు. పెద్దపట్టణములలోనేకాక చిన్నచిన్న నగరములలోగూడ ననంతమగు ఫ్యాక్టరీలున్నవి. జపానుదేశమెల్లయు ఒక యెడతెగని ఫ్యాక్టరీలనగరమువలె నుండును. ఈ ఫ్యాక్టరీలన్నియు విద్యుచ్ఛక్తిచే నడుపబడును గనుక విద్యుచ్ఛక్తి అతిచౌకయై పల్లెటూళ్ల వారు కూడ కొనుక్కొని ఉపయోగించగలుగుచున్నారు.

జపానుదేశపు వస్తువులు కారుచౌకగనుండుటకు రెండవకారణము వారు రద్దుపదార్థములను వ్యర్థముచేయక ప్రయోజనములోనికి మార్చుటయైయున్నది. జపానులో రద్దుపదార్థమే లేదు సరిగదా అమెరికా మొదలగు ఖండములనుండి రద్దయిన యినుపముక్కలు, ఇతరలోహములముక్కలు మొదలగునవి చౌకగా దిగుమతిచేయబడి బలిష్ఠమగు లోహములుగను, పరికరములుగను మార్చబడును. దినదినమును అనేకపాతలోహముల స్టీమరులు, రద్దుప్రత్తిస్టీమరులు జపానురేవులలో దిగుచుండును. ఇట్టి చౌకపదార్థములతో తయారయ్యెడి బలిష్ఠమగువస్తువులకగు ఉత్పత్తి ఖరీదు తక్కువయై చౌకగా నమ్ముడువోవుటలో ఆశ్చర్యము లేదు.

జపానుదేశపుసరుకు కారుచౌకగ నుండుటకు మూడవకారణము దేశములో పరిశ్రమదారులలో పరస్పరము పోటీలేకుండుట. ఒకొక్కరకము ఫ్యాక్టరీవారు అంతస్థితిలో ఉన్న ఒకొక్కపరిశ్రమలో ప్రావీణ్యమును సంపాదించి పనిచేయుదురేకాని ఒకరిమీది కొకరు పోటీకి పోయి హిందూదేశములోవలె సర్వులను నాశనముకారు. దీనికిసాయము శ్రమను తగ్గించునట్టియు, కాలమును కూడికచేయునట్టియు అనేకము వెఱవులు ప్రతీఫ్యాక్టరీలోను గలవు గనుక ఫ్యాక్టరీలలో పనిచేయుట యనిన కూలివారి కతిసంతోషముగ నుండును. ఇవియన్నియు జపానీయులకుమాత్రము తెలిసిన ప్రత్యేకవర్తకరహస్యములు. అన్యదేశీయుల నీ ఫ్యాక్టరీలలోనికి రానిచ్చి ఈరహస్యములను వారు ప్రక

టింపనోల్లరు. ఈమధ్యను మైసూరు సంస్థానపు జడ్జీగా రగు ఎ. యస్. ఆర్. చారిగారు జపానుపరిశ్రమాధికారుల ప్రత్యేకపు టనుజ్ఞతో కొన్ని ప్రత్తి, పట్టు, పోర్సిలేను, అగ్గిపెట్టెలఫ్యాక్టరీలను దర్శించి అచ్చటి సౌకర్యములను, రద్దులేమిని చూచి ఆశ్చర్యమునొందిరి. టాయోదానగరమునందలి ఇనుపసరుకు అంతర్జాతీయ ప్రఖ్యాతినిబడసినది. వీటిని తయారుచేయునది ఆనగరమునందలి ఉక్కుకంపెనీవారే.

ఇక కూలివారిని కష్టపెట్టుట, కూలులు తక్కువయిచ్చుట అనునది యెంతవరకు నిజమో పరిశీలింతము. జపానుదేశపు శీతోష్ణస్థితి తక్కిన దేశములలోకంటె యెక్కువకాలము పనిచేయుట కనుకూలమగుటచేతను, పని సులభతరముగ నుండుటచేతను కూలీలు ఎక్కువకాలము సంతోషముగ పనిచేయ గలుగుచున్నారు. జపానీయులు స్వయముగ శ్రమశీలురును, అంతశ్శుద్ధిగ పనిచేయువారును నగుటచేత వారు శక్తివంచనలేక మనస్ఫూర్తిగ పనిచేయుదురు. వారిపని నమ్మకమైనది. వారు సరిగా జేయుచున్నారో లేదో చూచుటకు పైని తనిఖీ ఉద్యోగస్థులుండ నవసరములేదు. ఈఖర్చులు వారికి కలిసివచ్చును. వారికి మద్యపానము, జూదము, క్రీడాపరాయణత్వము మొదలగు వ్యసనము లెవ్వియు లేక యెంత కష్టపడి పనిచేసిన అంత సంతోషముగనుందురు. అశనిగాతితిండ్లుతిని అనారోగ్యమును కలిగించుకొనరు. దాంభికవేషములును, అతివ్యయకరములగు సాంఘికాచారములును వారికిలేవు. వారికోరిక లల్పములు. వారిభవనమునకు కొంచెము సొమ్ము చాలును. అచ్చటి స్త్రీలు నగలు దాల్చనేదాల్చరు; దాల్చినను ఇనుముతో చేయబడిన సున్నితములగువానిని ధరింతురు. ఈకారణములచేత కూలులు చాలవని సమ్మెకట్టులుకట్టు పద్ధతు లాదేశమున లేనేలేవు.

పరిశ్రమదారులు కూలివారి సౌకర్యముల నన్నిటిని మిక్కిలి శ్రద్ధానురాగములతో పరికింతురు. పనిచేయుటకు కావలసిన యుడుపులెల్లను వారి కుచితముగ నొసగబడును. స్త్రీపురుషులకు ప్రత్యేకగదులు, పడకసౌకర్యములు నుచితముగ నొసగబడును. వారికగు మందుఖర్చులు, క్రీడారంగములు, నెలకు రెండుసారులు సినీమాప్రదర్శనములు యజమాను లుచితముగనే ఒసగెదరు. ప్రతిఫ్యాక్టరీలోను ఒకవంటశాల యుండును. దినమునకు నాలుగుసారులు (౧౦ సెనులు లేక రు. ౨-౮-౦ లు పుచ్చుకొని) భోజనము నొసగుదురు. జబ్బుచేసి పనిచేయనప్పుడుకూడ కూలినిత్తురు. బాలబాలికలకు వలయు సౌకర్యములెల్లను ఫ్యాక్టరీ యజమానులే కూర్చుదురుగనుక వారికి వేరే ద్రవ్యావసరమే లేదు. నాలుగైదు సంవత్సరము లేఫ్యాక్టరీలోగాని పనిచేసిన కన్యయైనను,యువకుడైనను తనఖర్చులుపోగా మిగిలిన ద్రవ్యముతో వివాహముచేసుకొని ప్రత్యేకముగ కాపురమును పెట్టుకొనవచ్చును. ఇట్టిద్రవ్యమును యజమానులు కూలివారిపేర బ్యాంకులలోనైనను వేయుదురు; వారి తల్లిదండ్రులకైనను పంపుదురు. కూలివారినిగూర్చి యిట్టిశ్రద్ధ మరి యేయితర పాశ్చాత్య దేశమునందైనను, రష్యా కార్మిక ప్రభుత్వమునందైనను తీసుకొనబడ లేదు. కనుక జపానుకూలీలుకూడ మిగుల శ్రద్ధాభక్తులతో పనిచేయుచు కమ్యూనిష్టుల విపరీత సిద్ధాంతముల కెఱగాకుండుటలో ఆశ్చర్యము లేదు.

బాలురను బాలికలను పనులలోపెట్టి నలగగొట్టుదు రనెడిది వట్టికల్ల. కొన్ని యేండ్లు బడిచదువులేనిదే యెవ్వరుకాని యేపనిలోకాని ప్రవేశింప వీలులేదు. వార్తాపత్రిక లమ్ముటకైనను అక్కడ బాలురుపయోగింపబడక పెద్దవారే నియోగింపబడుదురు. అయినను జపానీయులు సహజముగ పొట్టివారుగనుక ౧౬, ౧౭ సంవత్సరముల యువకులును యువతులునుగూడ ౧౨, ౧౩ సంవత్సరములవారివలె కనిపింతురు. ఈకారణము వల్లనే విదేశీయులు జపానీయులు బాలబాలికలచే పనిచేయింతు రను దురపవాదను ప్రపంచమంతటను అల్లగలుగుచున్నారు.

జపానుసరుకు చౌకగనుక వ్యర్థమైనదనియు, వేగము రద్దుఅగున దనియు మరియొక అపకీర్తిని విదేశీయులు వ్యాపింప జేయుచున్నారు. జపానువారు గట్టి సరుకును, సాధారణసరుకునుగూడ తయారుచేయుదురు.

విదేశీయులు చెల్లించగల యెక్కువ తక్కువఖరీదులను బట్టి గట్టి లేక సాదాసరుకులు వారు ఎగుమతిచేయుచుందురు. దేశదేశములకు రకరకములకు సరిపడునట్లు వారు వస్తువులఖరీదుల నిర్ణయించి ప్రకటించి యొట్టిసరుకులకు ఆర్డరులువచ్చిన అట్టిసరుకులను పంపుచుందురు. మన దేశమునకు కొన్నిగట్టిసరుకులు రావన్నచో మనవర్తకులు వానికి ఆర్డర్లు పంపకుండుటతప్ప జపానువారి లోపముకాదు. విలువగల గట్టిసరుకు చాలామట్టుగ అమెరికా మున్నగుదేశముల కెగుమతి యగును.

జపాను యజమానులవిషయములో ఇంకొక ముఖ్యమగు విషయము గమనింపదగియున్నది. అనవసరముగా ఇతరదేశములతో పోటీపెట్టుకొని, కొన్ని సరుకుల యుత్పత్తిలో తమపోరుగువారికి నష్టము తెచ్చి తామ నష్టముపోరు. జపానువారు మోటారుకారులకు సరిపోయిన వివిధాంగములను తయారుచేయుదురే యైనను వాటి నతికి కారులను తయారుచేసి వ్యాపారము చేసే నియమము పెట్టుకోలేదు.

అమెరికా సరసముగరేటుల కితరఖండముల కెగుమతి చేయుచున్నను, వారు పోటీకి దిగకుండుటయే కాక, తాము తమకు కావలసిన కారుల నచ్చటినుండియే తెప్పించుకొందురట. ప్రత్యేకపు టంగములను అమెరికా అమ్మకుండుటచేత వారు తయారుచేసి యెగుమతులను సాగించుచున్నారు. జపానుకు మరియొక్క ముఖ్యమగు ఉత్పత్తినీతి కలదు. విదేశీయులగు పేదలకు సంసారులకు దైనందినావశ్యకములైన చౌకపదార్థముల నెక్కువగాను, శ్రీమంతులగు భోగపరులు మాత్రము కొనుకొనగల విలువపదార్థములను తక్కువగాను అక్కడ తయారగుచుండును. వేయింటికి వేయిమందికిని కావలసినబట్టలక్కడ యెక్కువగను, వేయింటికొక్కరు మాత్రము కొనుకొనగల మోటారులు తక్కువగను తయారగును. ఈ విషయమున ఫ్రాన్సు కిది సరిగా వ్యతిరిక్తమైన సూత్రము నవలంబించుచున్నది.

ఇంతకును జపానువారి శ్రమశీలమును, ఉత్సాహమును నిరుపమానములు. ఒకసారి వ్యాపారనష్టము వచ్చినను, అగ్నిపర్వతములు, వరదలు, యెండలు, తుపానులు, సుడిగాలులు మొదలగు వానివలన తరుచుగ నష్టములు వచ్చినను వారు నిరుత్సాహము నొందక, శాంతముగ కష్టపడి కలిగిన నష్టమునంతటిని బాపుకొందురు. దివాలా, ఓడిపోవుట అనునవి వారి జాతకములో లేవు. ఇందుకొక్కటే నిదర్శనము: ౧౯౨౩ లో కలిగిన భూకంపమువలన టోకియోనగరము నేలమట్టమైనది. కాని యేడేండ్లు తిరగకుండా ఆస్థానముననే అంతకంటె సుందరము, విశాలమునగు టోకియో నగరమును నిర్మించిరి. ఇట్లే మరియెన్నో నగరములు, ఫ్యాక్టరీలు, కట్టడములు పునర్నిర్మింపబడినవి. న్యూయార్కు తరువాత నేడు ప్రపంచములో టోకియో వంటి సుందరనగరము లేదట. వేకువప్రొద్దు మొదలు సాయంకాలమువరకు ప్రతిపల్లెయును పట్టణమును పనివాండ్రతోను, పనులతోను, యంత్రముల ధ్వనులతోను, శకటముల చలనములతోను కలకలలాడుచు ఒకపెద్ద తేనెపట్టును, తేనెటీగలను జ్ఞాపకము చేయుచుండును. కనుకనే జపాను నేడు ప్రపంచమునగల దేశములలో నెల్ల మిగుల పరిశ్రమవంతమై, పేరుపొందిన పారిశ్రామిక దేశముల నన్నిటిని తలదన్నుచున్నది.

# కెనగీగుహలు

డి. అణ్ణాజిరావు

బొంబాయివద్ద ప్రాచ్యం అనేకులు బౌద్ధులు ఉండేవారు ప్రతీతి — ఈ రాజ్యానికి ప్రాంతాల్లోని కొండల్లో ... బౌద్ధగుహలు ఇప్పటికీ ఉండేకారణం వల్ల. ఇటువంటి గుహలలోకెల్లా బొంబాయి-పూనామార్గంలో ఉండే కార్లీ గుహలు చాలా పురాతనమైనవనిన్నీ, అక్కడ ఉండే బౌద్ధమతసంబంధమైన చిత్రాలు మొదటి రకమైనవి ... ప్రసిద్ధమైనవనిన్నీ పేరు. చెడిపోకుండా ఉండే గుహలు కొంచెం తక్కువైతే అనేక గుహలలోకల్లా ఈ కార్లీ గుహలు చాలా ముఖ్యమయినవి. ఈ గుహలకు ఇంత పేరు



౧. చైత్యగుహ

అన్నిటిలోకీ ఎత్తయినది. దీనిఎత్తును ప్రక్కను నిలువబడియున్న వ్యక్తినిబట్టి ఊహించుకోవచ్చును. వసారాకు రెండు స్తంభములు కలవు. దానిపయి నయిదు కన్నులు గల రతి తెర యున్నది.

రావడానికి కారణం మహిమాహం కాదు. వీటిని చూచినట్టయితే యిందలి శిల్పము చాలానిర్దుష్టమైనదని సులభముగా తెలియగలదు.

ఈగుహలకు తరువాత అజంతాగుహలు చాల ప్రఖ్యాతిగన్నవి. ఇవలు విహారములు, చైత్యములు ఉన్నవి. బౌద్ధమతము ప్రారంభించినకాలమునుండి అది మనదేశములో అంతరించిపోయినకాలమువరకు అనగా ఎనిమిదువందల సంవత్సరములచరిత్ర అంతా యిక్కడ కళగా చిత్రితమై ఉంది. ప్రాముఖ్యములో వీటికి తర్వాతని ఎల్లోరాగుహలు. ఇక్కడ మూడురకాల చిత్రాలు ఉన్నవి. బౌద్ధమతానికి సంబంధించిన గుహలు పన్నెండు, బ్రాహ్మణమతానివి పదిహేను, జైనులవి అయిదు, ఉన్నవి ఇక్కడ.

వీటితర్వాత ఎక్కువ ప్రసిద్ధిగాంచిన గుహలు కెనగీగుహలు. ఇక్కడ ఉండేవన్నీ బౌద్ధమతానికి సంబంధించినవే. బొంబాయికి ఆరుమైళ్లదూరములో ఉండే ఎలిఫెంటాద్వీపములో ఉండే ఎలిఫెంటా గుహలలో బ్రాహ్మణమతానికి సంబంధించిన గుహలు ఈ కెనగీ గుహలకు తర్వాతివే, ప్రాముఖ్యములో. ఇప్పటికికూడా అక్కడ ఉండే శివాలయములో పూజాపురస్కారాలు, ఉత్సవాలు జరుగుతున్నవి. శివరాత్రినాడు గొప్ప ఉత్సవాలుకూడా జరుగుతున్నవి ఈనాటికీ. ఇవేగాక లెక్కలేనన్ని చిన్నగుహలు బౌద్ధమతము తాలూకవీ, బ్రాహ్మణ మతమునకు సంబంధించినవీ ఉన్నవి ఇక్కడ.

కెనగీగుహలు బొరివిల్లికి ఈశాన్యములో ఆరుమైళ్ల దూరములో ఉన్నవి. ఇవి చాలాపెద్దవి. ఈబొరివిల్లి బొంబాయికి షుమారు ౨౧ మైళ్లదూరములో బి. బి. అండు సి. ఐ. రైలుమార్గములో ఉన్నవి. తులసీసరస్సుకు ఇవి ఉత్తరముగా రెండుమైళ్లదూరములో ఉన్నవి. రైలుస్టేషనుదగ్గరనుంచి యీగుహలకుపోయే

దారి వంకరటింకరగాను, చాలయిరుకుగాను ఉంది. చాలభాగము ఈదారి అరణ్యమధ్యంలో ఉంది. అయినప్పటికి దారియంతా చాల మనోహరమయినది గనుక ప్రయాణం విసుగుపుట్టించకుండా హాయిగా ఉంటుంది. ఇక్కడ సుమారు నూటికి పైగా ఉన్నవి గుహలు. "దట్టమయిన అడవిలో, పర్వతమయప్రదేశములో వీటిని మలిచినా"రని 'ఫర్గూసను' గారు చెప్పినారు. ఈ గుహలుఉండే కొండలు చెట్లు చేమలు లేకుండా బోడగా ఉన్నవి. కాని వీటికి దగ్గిరేఉండే యితరకొండలంతా అరణ్యమయము లయినవి. కొన్నిచోట్లలో కొండమీదినించిఉండే మంటిదిబ్బలు వర్షాకాలములో కరిగి కొట్టుకుపోగా స్వాభావికమైన గుహలు ఏర్పడ్డవి.

ఈ గుహలలో ఉండే శాసనాలలిపి వేరువేరుగా ఉంది. అందువల్ల ఇవన్నీ ఒక్క కాలమునాటివి కావని ఊహించవలసివస్తుంది. వీటిలో అనేకములు విహారములు. ఒకొక్క విహారానికి ఒకగది, ముందు వసారా ఉన్నవి. కొటిలో శిల్పాలు చిత్రింపబడి



౨. చైత్యగుహాయందలి కుడ్యశిల్పములు

ఉన్నవి; శాసనాలుకూడా ఉన్నవి. పెద్దపెద్దవిహారాలలో గొప్పచిత్రాలు ఉన్నవి. అచటి శాసనాలు చాలపాతకాలంనాటివి. అవి క్రీ. పూ. రెండు-నాలుగు శతాబ్దాలవి. ఒకచిన్నగుహలో యజ్ఞశ్రీశాతకర్ణి శాసనం ఉన్నది. ఇతడు 'ఆంధ్రభృత్య' జాతివాడు. ఇతడెప్పటివాడో యిప్పటికింకా తేలలేదు. కొన్నిచోట్ల మహాయానకాలమునాటి శిల్పము కనబడుచున్నది. ఇక్కడిశాసనాలు క్రీ. శ. ౯-౧౦ శతాబ్దుల నాటివి.

బౌద్ధమతమునకు సంబంధించిన గుహలు రెండు తెరగులు. కొన్ని విహారములు: అవే మఠములు. కొన్ని చైత్యములు: అవే దేవాలయములు. ఈదేవాలయములలో ముఖ్యమైన పర్వదినాలలో మాత్రము పూజలు జరుగుతాయి. కెనరీగుహలలో చైత్యమొకటి యున్నది. ఇది చాలాముఖ్యమైనది. తక్కినగుహలన్నీ విహారాలే.



3. చైత్యగుహాసన్నిధినున్న బౌద్ధస్తూపము; నాతిశిథిలము

శిల్పశాస్త్రాలలో ఏకొద్ది భేదముమాత్రమో తప్ప యిక్కడి చైత్యము కార్లీలో ఉండే చైత్యాలకు ప్రత్యక్ష ప్రతిబింబమనే చెప్పవలసి ఉన్నది. అనేక శతాబ్దాలనుండి ఎండకు ఎండి వానకు తడిసిన కారణం వల్ల యీచైత్యము ముందటిభాగము చాలావరకు శిథిలమైపోయింది. ఆకారణంవల్లనే శాసనాలుకూడా చాలావరకు పాడైపోయినవి. ఈచైత్యము చాల గొప్పది. దీని నిడివి ౮౦ అడుగులు, వెడల్పు ౪౦ అడుగులు; లోపల ప్రదేశము ౫౦ అడుగుల ఎత్తున కమానులు కలిగియున్నది. అష్టముఖములు కలిగిన ౩౪ స్తంభాలు ఉన్నవి. స్తంభాగ్రములలో వాటి శిరోగ్రములూ, అన్నీ కార్లీచైత్యములో వలెనే ఉన్నవి. వెలుపలి గోడమీది శిల్పమంతా కార్లీచైత్యములో వలెనే ఉన్నది. కాని కెనరీగుహలలోని శిల్పము కార్లీగుహలలోని శిల్పముకంటే మేలురకముకాదు. ఇక్కడ బుద్ధుని విగ్రహాలు పెద్దవి రెండున్నవి. వీటి ఎత్తు ౨౩ అడుగులు. పాదాలు ప్ర- కింపడనే యని ప్రతియొక్కరిని ఆకర్షించుచున్నవి. ఈవిగ్రహాలలో ఒకటి బాగా ఉన్నది. (చిత్రము ౪) ఇంకొకటి చాలావరకు చెడిపోయినది. చైత్యమున కంటే చాలాకాలమునకు పిమ్మటనే వీటిని నిర్మించినట్లు వీటి శిల్పము తెలుపుచున్నది. ఈవిగ్రహాల శిల్పమువంటి శిల్పము, రీతి మొదలయినవి తరువాత ఎక్కడా కనుపించ లేదు. ఈశిల్పము శాతకర్ణికాలమునాటిది. ఇక్కడి వసారాకు రెండు స్తంభాలు, గోడకు ఆధారముగా ఉన్నవి. పయిన అయిదుద్వారాలు ఉన్నవి. (చిత్రము ౧)



౪. చైత్యగుహావద్దనున్న వసారాయందలి బుద్ధవిగ్రహము. ప్రక్కను నిలువబడియున్న వ్యక్తులనుబట్టి దానియెత్తు నూహించుకొనవచ్చును.

ఈచైత్యగుహకు ఈశాన్యమున దర్బారను మరియొక గుహ గలదు. చైత్యాలయమున చైత్యమునకన్న పెద్దది కాని చైత్యమే ప్రధానమైనది యీ గుహలన్నిటిలోను. దీనినిడివి ౮౭ అడుగులు, వెడల్పు ౪౨ అడుగులు, ఎత్తు ౯ అడుగులు మాత్రమే. ఇచట గోడలమీద చిత్తరువు లతివిచిత్రమైన వనేకమున్నవి. (చిత్రము ౨.)

ఒకేపర్వతములో మలచబడిన యీగుహలు అనేకరకములుగా ఉన్నవి. ఇవి అక్కడక్కడ కొండల హెచ్చుతగ్గులలో అంతస్థులుగా ఉన్నవి. వీటి కొకదాని కొకదానికి కొండపైలోనే మార్గాల నేర్పరచడానికి మెట్లు మలచబడినవి.

ఇంతేకాక, ఇక్కడ శిథిలము లయిన స్తూపాలు మొదలయిన వనేకం ఉన్నవి. చైత్యగుహాసమీపములో మాత్ర మొక స్తూపము చెడిపోక నిలిచియున్నది. (చిత్రము ౩) ఈస్తూపానికి పైన కప్పుప్రక్కన గట్టి రాతిగోడలు కట్టబడినవి.

చూపర నాకర్షించు విశేష మిచట ఇంకొకటి యున్నది. అనేక గుహలవద్ద, ఎక్కువలోతు లేకుండా, విశేషము వెడల్పులేని నీటితొట్లు ఉన్నవి. రాళ్లలో

వడియగట్టబడిన నిర్మలోదకము ఈతొట్లలో ఎప్పుడూ ఉండును.

చరిత్రలో ఈప్రదేశానికి చాలా ప్రాముఖ్య మున్నది. ఇపుడు జనులు విశేషముగా అచటికి విందులుచేసికోవడముకొరకే పోవుచున్నారు. ప్రతి వారముస్నూ ఎవరోఒకరు రిచటికి కాపనిమీద పోవుచునే యుందురు. రైలుస్టేషనుదగ్గరనుంచి యీగుహలదగ్గరకు ఎడ్లబండ్లు పోవుటకు వీలుంది. కాని దారి అడవి గుండా ఉంది. పైగా చాలఇరుకైన మార్గముగాన అక్కడికి పోవువారు నడిచే పోవచ్చును.

---

# నాటకోపన్యాసములు*

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

౧

'కావ్యేషు నాటకం రమ్యమ్' అని మన పెద్దలు తలఁచిరి. అందుకు తగినట్లు సాహిత్యమునకు నాటకములు చదువుట పరమావధిగా భావించిరి. కాళిదాసకవీశ్వరుఁడు ఊరక చదువుటకంటె నాట్యము 'దేవతలు కన్నులతోఁ గుడిచి క్రోలవలసిన యజ్ఞ'మని పొగడెను. ఎన్నో విధములుగా రుచులు వేఱు వేఱుగాఁగల జనుల నందఱిని తన ప్రక్కకీడ్చుకొని తృప్తిపఱుచు కళ యిదొక్కటే యని యతఁడు చాటెను. ఇంతటి మహత్త్వము తక్కినయన్ని కళలకంటె దీని కెక్కడిది?

నాకుఁ జూడఁగా కారణమిది: ఇదియొక కళగాదు. అన్ని కళలును ఏకీభవించి చేసిన మూర్తి యిది. వాచికము, ఆంగికము నైన యభినయమే యీ విద్యలో కేంద్రస్థానము నాక్రమించినను తక్కినవన్నియు దాని పోషణకు పనికివచ్చును. ప్రతికళయందును కొంత విశిష్టమైన మేలిమి కలదు; అట్టి కొదవయుఁ గలదు. ప్రతికళయును కొన్ని భావములను జూపి మఱికొన్నిటిని మీరే యూహించుకొనుఁడని తనకుచేతఁగాక మనకు వదలి పెట్టును. చిత్రకర్మలో వ్యక్తియొక్క పలు వన్నెలు స్పష్టముగాఁ జూపవచ్చును గాని దాని ప్రక్కలు, వీపును చూపలేము. జుట్టును జూచి మొగమో మొగమును జూచి జుట్టో ఊహింపవలసినదే కాని రెంటిని ఒకతూరి పటములో వ్రాసి ప్రదర్శింపలేము. విగ్రహరచనలో వస్తువుదశదిక్కులును చూపవచ్చునుగాని వస్తుభేదమునకును భావభేదమునకును ముఖ్యసాధనములలో నొకటి యగు వర్ణభేదమును జూపలేము. పై రెంటియందును క్రియారూపమగు చలనము చూపుట యసాధ్యము. వీనికంటె కవిత్వమందు వస్తువుయొక్క అంతరంగ బహిరంగములు క్రియలు చిత్రింపవచ్చునుగాని దానికి మూలమైనపదార్థము శిల, మన్ను, వన్నె మొదలగువాని వంటి ప్రత్యక్షద్రవ్యముగాక సంకేతరూపమైన భాష యగుటచే స్పష్టతయనుగుణము పైవాని కన్న నిందులో తక్కువ. కాబట్టి తక్కిన కళలయందు దక్కరలేనిదిమాత్రమే కాక వికారముగాఁ గూడ పరిణమించు అతిశయోక్తి కవిత్వమునందలంకారబీజమై వెలకెక్కినది. ఉన్నదున్నట్లుగా కొలతచేసి చెప్పినచో కవిత్వమునకు ప్రాయశః తేజస్సే యుండదు; వస్తువును మన హృదయములో ప్రతిబిం

* ఈ యుపన్యాసములు రెండును బళ్లారిలో కడచిన అక్టోబరు ౨౦, ౨౧ తేదులలో, మునిసిపలు హైస్కూలువారి యాజమాన్యమున జరిగిన కృష్ణమాచార్యశ్రీనివాసరాయల స్మారకోత్సవసందర్భమునఁ జేసినవి.

బింపదు. అతఁడు గట్టివాఁడని, క్రూరుఁడని చెప్పినఁ జాలదు. రాక్షసుఁ డనవలెను. ఆ రెండుగుణములును అప్పుడే మనకు కొంత యర్థమగును. కవిత్వమందును పద్యములో నున్న భావసంగ్రహము, బలము, అచ్చుకట్టు గద్యములో నుండదు. గద్యమున నున్న విస్తరము, ధారాళత పద్యమందు సాధ్యము కాదు. మఱియు కవిత్వము గద్యరూప మైనను, పద్యరూపమైనను దాని మూల వస్తువు సంకేతరూప మగు భాషయగుట చేత, బయటి ప్రపంచమునఁ గానవచ్చు పదార్థములకన్నిటికిని సంకేతము లింకను ఏభాషలోఁగాని యేర్పడియుండవు గావున, అంతరంగమగు భావములందలి సూక్ష్మసూక్ష్మతరభేదములకు సంకేతము గల్పించుట యసాధ్యముగనుక కవిత్వము చాలదూరము పోఁజాలదు, చాలలోఁతుకును దిగఁజాలదు. కాఁబట్టియే ఒకవస్తువును విస్తరముగా వర్ణింప వలసివచ్చినప్పుడు మాటలుచాలక మనము కష్టపడుదుము. వేఱొకవస్తువును ఎరవుతెచ్చుకొని దానివలె నిదియున్నదని సాదృశ్యమును శరణుచొత్తుము. ఒకభావము తీవ్రముగా నున్నప్పుడు దానిని భాషారూపమున వెలువరింపలేక నోరుమూసికొందుము. తెలుచితిమా నత్తి తప్పదు. పైసూక్ష్మసూక్ష్మతరభావములను సంగీతకళ ప్రదర్శింపఁగలదు. కాని పై యన్నిటికంటె స్పష్టత దీనిలో చాలతక్కువ. ఈసంగతి కీభావ మర్థమని భాషయందున్నట్లు సంకేతమైనను దీనికిలేదు. అభినయకళలో నచేతనముల, అందును మనుష్యుల భావములను, క్రియలను స్థూలసూక్ష్మభేదములతో ప్రదర్శింపవచ్చునుగాని అచేతనప్రపంచమును, దాని భిన్నరూపములను వెలువరించుట యసాధ్యము; అస్పష్టము.

ఇట్లు ప్రతికళయు తనయందలి కొఱంత నెఱుఁగును గావుననే తన ప్రధానధర్మమైన అనుకరణమును చక్కఁగా నెరవేర్చుటకు ఇతరకళల సాహాయ్యము నపేక్షించును. చిత్రకర్మయు,విగ్రహరచనమును ఒకటికొకటి తోడుపడును. కవిత్వమునకు సంగీతమును, అభినయమును తోడుపడఁగలవు. సంగీతమునకు కవిత్వమును, అభినయమును పుష్టినీయఁగలవు. ఇట్లే అభినయము తక్కినయన్నికళల సాహాయ్యమును గోరును. ఒక సందర్భమును అభినయింపవలసినవాఁడు దానికివలయువస్తువులను ఇల్లు, వాకిలి, అడవిమొదలగువానిని కృత్రిమముగా తయారుచేసుకొని, వన్నెలు వేసి, వేసికొని బహిరంగములను మనయెదుటఁబెట్టును. అంతరంగమును వెలువఱుచుటకు అభినయమునకు తోడు భాషను సహాయముగాఁ గొనును. దానినింకను తీవ్రముగా ప్రదర్శింపవలయునేని పద్యమో, పాటయో యుపయోగించును. ఇట్లు సర్వకళాసమ్మేళనముగావుననే నాట్యము 'భిన్నరుచేర్జనస్య బహుధాఽప్యేకం సమారాధనం'* అను బహుమతిని బడసినది. ఏకళయందైనను కొం

* మాలవికాగ్నిమిత్రము. అం. ౧. ప. ౪.

చెమో గొప్పదో పరిచయమును, అభిరుచియుఁ గలిగినఁ జాలును దానిమూలమున మనలనానందపఱుచుటకు నాటకమునందవకాశమున్నది. అన్నికళల పరిచయముగలవారిమాట చెప్పఁబనిలేదు.

ఒక వస్తువునందలి భిన్నభాగముల వేర్పాటు శాస్త్రము. భిన్నపదార్థముల నొకచోటఁజేర్చి చేయుకూర్పు కళ. ప్రాచీను లీ తత్త్వమును చక్కఁగా గమనించిరి కావుననే ఇంకను లోఁతుగా దిగి అట్టి భిన్నకళల కూర్పుచే ఇంకనుపరిపూర్ణమైనకళను సృజింపఁ బ్రయత్నించిరి. అదేనాటకము. మనవా రింత కంటెను సాహసమైన పని యొకటిచేసిరి. పై యభినయముజతకు కవిత్వము, సంగీతము మొదలగువానివలె తాళలయప్రధానమగు నృత్తమునుదానినిగూడ చేర్చుకొనిరి! పాత్రము అభినయించునపుడు పాటకుతోడుగ 'తోంతతఝణ' లతో ఆడును. ప్రాచీనతరమగు నాటకపద్ధతుల పరిశేషమనఁదగిన దొంబిదాసర్లఆటలలో ఇదియింకను నిలిచియుండుట మన మెఱుఁగుదుము. రసభావములు ప్రధానముగా చూపవలసినచోట ఈ మొగుర్లాటలు అస్వాభావికములని యందఱును సందేహించుట సహజము. చాల పూర్వకాలమందే యీసందేహము కలిగినది. కాని సందేహము కలిగినవెంటనే దేనినిగాని తటాలున వదలుట ప్రాచీనపద్ధతికాదు. అది ఇప్పటి మనసంప్రదాయము. నృత్తము అస్వాభావికమైనను అభినయమునకు మెఱుగు నిచ్చుననుట ఆకాలమువారి కనుభవగమ్యమై యుండెను. రుజువు చేయలేకపోయినమాత్రమున అనుభవసిద్ధమైనదానిని తిరస్కరించుట అన్యాయము. కావుననే "లాస్యతాణ్డవభేదేన నాటకాద్యుపకారకమ్" అను దశరూపకసూత్రమునకు వ్యాఖ్యానముచేయుచు ధనికుఁడు "నృత్తస్య శోభాహేతుత్వేన చ నాటకాదా వుపయోగః" అనిమాత్రము వచించి యూరకొనెను. అస్వాభావికమగు పదార్థము శోభాహేతు వెట్లగును? దమయంతీద్వితీయస్వయంవరవార్త విన్న నలచక్రవర్తి కుల్లికుములవలయునా, నవ్వి నాట్యము త్రొక్కవలయునా? అట్టినృత్య మట్టిచోట్లఁజూచి సంతసించువారికి పదార్థముల యానురూప్యజ్ఞానము కలదని చెప్పవచ్చునా? 'అరగజ' మును అన్నముతో కలిపి భుజించుచు నాలుకచేదైనను 'ఆహా! ఎంత ఘుమ్మనుచున్నది!' అని మెచ్చుకొనువారిది రుచియా, పిచ్చియా? నాటకము జనులజీవితమందలి యవస్థల యనుకరణమేతప్ప వెఱ్ఱి వెంగళయ్యచేష్టకాదుగదా!—ఇట్లు ప్రశ్నించుట అనుభవరసికులదృష్టికాదు; వివేకప్రధానులగు విమర్శకుల దృష్టి. మొదటిది హృదయమును నమ్మినది. రెండవది మెదడు నాశ్రయించినది.

ఈవివేకదృష్టి బలిసిపోవుచుండుటచేత నే మనలో నాట్యమునకు సహాయముచేయుచుండిన కళలు ఒక్కొక్కటిగా ఊడిపడి పోవుచున్నవి. నృత్తము నాటకమును వదలి

పోయి ఎన్నో నాళ్లాయెను. మావివేకమెక్కడ కొల్లఁబోయిన మా కేమి యని పామర జనులుమాత్రము దాని నింకను వదలక పట్టుకొని యున్నారు. ఈవలవారును చాల వఱకు దానిని వదలిపెట్ట నుపక్రమించి నారు. అది మన సహవాసదోషము కొంత, వారి కన్నిటియందువలె దానియందును కాల వశమునఁ గలిగిన యనుత్సాహము కొంత. ఎప్పుడు తాళలయాశ్రయమగు నృత్తము చే విడిచిపోయెనో అప్పుడు దానివెంటనే దాని వంటివగు పాటలును మఱుఁగుపడెను. సంస్కృత నాటకములలో ఎందును పాట లున్న సూచనయే కానరాదు. రత్నావళి మొదలగువానిలో 'ద్విపదీఖండము', 'చర్చరి' మొదలగు గీతఖండము లొకటిరెండున్నను అవి నృత్తగాన సన్నివేశమువలన వచ్చినవి గాని పాత్రములయభినయమునకు సహజ ముగా తోడుపడినవి గావు. తుదకు త్ర్యస్ర గతిలోనో, చతురస్రగతిలోనో తాళమార్గ ము ననుసరించి విధింపఁబడిన నాందినిగూడ సంస్కృతనాటకకర్త లొక వృత్తముగా మార్చుకొనిరి. ఇటీవల మనము ఇంకను ఈవివేకదృష్టిని తెగఁబెంచుకొనుచున్నాము. ప్రాచీను లెట్లో చంపక నిలుపుకొన్న పద్యములనుగూడ ఇప్పుడు అస్వాభావి కము లని నాటకములనుండి తీసివేయు ప్రయత్నములు చేయుచున్నాము. ఇఁక పాటలమాట చెప్పఁబనిలేదు. శ్రీధర్మవరము కృష్ణమాచార్యులును, కోలాచల శ్రీని వాసరాయలును తమనాటకములలో పాటలు కుప్పలుగా నించియున్నను వానిని పామర జనప్రీతికే చేయవలసివచ్చె నని 'పండితుల' క్షమాపణ కోరుకొన్నారు. పై స్వభావవాద మునే ఇంకను సాగఁదీసి తీసి తుదకు స్త్రీ పాత్రములను స్త్రీలే వహింపవలయునని చెప్ప వలసినస్థితికి దిగినది మన కళాభిరుచి!

ఈ స్వభావవాదమునకు తోడుగా కళా స్వాతంత్ర్యవాద మొకటి కలదు. దీని ప్రకా రము ప్రతికళయును స్వతంత్రముగా వర్తింప వలయును గాని యితరకళలకు పరాధీనమైన బ్రతుకు బ్రతుకరాదు. అప్పుడే దాని పరి శుద్ధియు, పరిపూర్ణశక్తియు బైలుపడును. అట్లు గాక మిశ్రణము చేసితిమేని యేకళయును స్వశక్తిని సంపూర్ణముగాఁ జూపలేకపోవును. నాటకములవిషయమున ఈవాదము నాశ్ర యించువారిలో వేఱువేఱు అంతస్తులుగలవు. పాటలు వలదనువారు కొందఱు; పద్యములు తిరస్కరించువారు మఱికొందఱు; ఇంక కొందఱు పద్యము లున్నను వానిని రాగ ముతో పాడక గద్యమువలె చెప్పవలె నను వారు; వేఱుకొందఱు వేషములు, వన్నెలు, తెరలును అక్కరలే దనువారు; అసలు మాటలే కూడదనువారును లేకపోలేదు. మూఁగనాటకములగు 'కథకలి' మొదలగునవి యీవాదపు పరిణామములే. ఇది కేవలము ఆధునిక దృష్టి కాదు, ప్రాచీనులలోను ఇట్టి యభిప్రాయములు కలవనుట కాధారము

లున్నవి. కాని పాశ్చాత్త్య సంస్కారముచే మనలో నిప్పు డిది బలమగుచున్నది.

ఈ స్వాతంత్ర్యవాదము నుగూర్చి మన మెక్కువ తంటాపడవలసిన పనిలేదు. ఎందు కనఁగా: పరస్పరసహాయమే సృష్టిలోని మూలతత్త్వము. కూర్పు కళాధర్మము. అట్లుండఁగా ఈవాదము గట్టిగా నిలుచుటయెట్లు? కత్తిమీఁది సామువలె, ఏకాక్షర కవిత్వము వలె, స్వతంత్రకళలో భావప్రదర్శనము చేయుటకు తనుకులాడు కళావంతుని సామర్థ్యము మనము మెచ్చుకొనవచ్చును గాని మనకు దానిచేత పూర్ణతృప్తి కలుగుననుట నిజము గాదు. పలువన్నెల చిత్రమునకున్న విలువ ఒంటివన్నె చిత్రమున కుండదు. అర్థముగల కీర్తనలకున్న గౌరవము తిల్లానాలకుండదు. పదిపాత్రములను పదుగురభినయించుటకుబదులుగా ఒక్కఁడే యభినయించెనేని వానిది గొప్పశక్తియే కాని మనకు రక్తి తక్కువ. కావున ఈవాదమునకు బలము చాలదు. సాధ్యమైనంతవఱకు ప్రతికళయు స్వతంత్రముగా నుండవలయునందురేని యెవరును కాదనరు. కాని ప్రతికళకును అసాధ్యములైన ప్రమేయములు కొన్ని కలవనియు, వానినట్లే వదలుటకంటె ఇతరకళల తోడ్పాటుతో సాధించుట ధర్మమనియు అంగీకరింపకతప్పదు.

ఇప్పుడు ముఖ్యముగా నాటకప్రపంచమును తలక్రిందుసేయుచున్నట్టిది స్వభావవాదము. ఇది అందఱికిని అర్థమగును. న్యాయమని యెక్కువకష్టములేకయే తోఁచును. ప్రపంచమున జరుగుచున్నవి,జరుగవచ్చునట్టివియైన అవస్థల ననుకరించుటయేకదా నాట్యకళ! కాఁబట్టి రంగస్థలమున వ్యక్తులు చేయు పనులు, ఆడుమాటలు, వేయువేషము లు-అన్నియు సహజముగా నుండవలయును. కావుననే మన నిత్యవ్యవహారములో లేని ఛందస్సు, సంగీతము మొదలగునవి రంగము మీఁదకి వచ్చుట కధికారము లేదు. మగవారెంతకష్టపడినను వారి స్వరూపము, స్వరము, నడక మొదలగునవన్నియు భిన్నములు గావున స్త్రీపాత్రమును సహజముగా ప్రదర్శింపలేరు. కావున స్త్రీపాత్రములు స్త్రీలే ధరింపవలెను. కృత్రిమములైన యవయవములతో ఆఁడపాత్రమును అవకతవకగా అభినయించువానినిజూచి కథానాయకుఁడు 'ప్రియురాలా!' యని కౌఁగిలింపఁబోవుటయెట్లు? పై రెండును నాదృష్టిలో స్వభావవాదముయొక్క యిప్పటి ప్రబలపరిణామములు. చిల్లర మఱి కొన్ని కలవు కాని ప్రకృతము వానిని విస్తరింపక యీరెంటినిగూర్చి మాత్రము కొంత చర్చింతును.

ఈస్వభావవాద మింతప్రబలముగా నున్నను మనము కొంత విమర్శించిచూచితిమేని నిలువక సడలిపోవును. ప్రకృతియందలి పదార్థముల భావములను, క్రియలను అనుకరించుటయే నాట్యమని ప్రాచీనులును అంగీకరించిరి. 'అవస్థానుకృతి ర్నాట్యమ్' అనియే వారును నిర్వచించిరి. నాట్యమొక్కటేకాదు,.

కళాసామాన్యపు మూలవస్తువుననుకరణమే. ఉండునది, ఉండవచ్చునట్టిది, ఉండవలయునట్టిదియు నగు వస్తువును బ్రదర్శించుటతోడనే కళలన్నియు మొదలుపెట్టును. కాని సంపూర్ణముగా ఏవస్తువునైనను అనుకరించుట యసాధ్యము. ఒక మల్లిపూవును కాగితము, వస్త్రము మొదలగువానిని కత్తిరించి చేయవచ్చును; లోహములతో పోతపోయవచ్చును; మ్రాను,దంతము మొదలగువానిని చెక్కి చేయవచ్చును; పటముపై వన్నెతో వ్రాయవచ్చును; వ్రేళ్లుమలచి చూపవచ్చును; దానిపై పద్యము వ్రాసి వర్ణింపవచ్చును. కాని యిన్నిటిలో దేనియందుఁగాని తుదకన్నియు కలిపి చూచినఁగాని నిజమైన మల్లెపూవునందలి వన్నె, స్పర్శము, కొలఁత, సుగంధము, రూపము మొదలగు సర్వాంగములును మనమనుకరించినట్లగునా? రంగస్థలముమీఁద ఒకఁడొకనిని పొడిచి చంపు సన్నివేశము వచ్చినప్పుడు నిజముగా పొడిచి చంపినచేతప్ప వాఁడు చంపినట్లగునా, వీఁడు చచ్చినట్లగునా? ఇట్లు అసాధ్యము, అనర్థదాయకమును అగుట యట్లుండఁగా సంపూర్ణానుకరణము కళపని కనావశ్యకముగూడ. ఎందుకనఁగా, కళాకార్యము వస్తువుయొక్క విశిష్టస్వరూపమును—ఇది ఫలానిదని గుర్తించుటకుఁ గావలసిన ముఖ్యధర్మమును—మన భావనావీథిలో ప్రతిబింబింపఁజేయుటయేతప్ప దాని యంగోపాంగముల జ్ఞానమును మన మెదడునకంటించుట కాదు. అనఁగా అంగవర్ణన అక్కరలేదని కాదు. అంగసామాన్యముల వర్ణన మక్కరలేదనుట. కాని అంగవిశేషవర్ణన మత్యావశ్యకమే. ఎందుకనఁగా అంగియందలి విశేషధర్మమును, అంగము విశేషధర్మము తెలుపును; పుష్టిచేయును. చిత్రించినజంతువు గాడిదకాదు, గుఱ్ఱమేయని పింపవలసినప్పుడుపొడుగైన, కుచ్చైన తోఁక చూపవలసిన విశేషాంగములలోనొకటి. కాని ఆతోఁకలోని వెంట్రుకలన్నియు లెక్కపెట్టి చూపవలసినపనిలేదు. మఱియు అనుకరణము కొన్ని సందర్భములందు మూలవస్తువునకు విరుద్ధమైనగుణము గలదియుఁ గావచ్చును. మల్లెపూవు తెల్లనిది. కాని దానిని నల్లరాతిలో చెక్కవచ్చును. హిమాలయమువంటి సర్వోన్నతపర్వతమును అంగుళముచోటిలో ఇమిడించి చిత్రింపవచ్చును. శ్రవణబెళగొళములోని గోమతేశ్వరునిది అరువది యడుగుల యెత్తున్నను మనుష్య విగ్రహమే. సిద్ధముగా తీర్చిన, యేరిన స్వరముల యల్లికను వ్యవహారములో ఎవరును ఉపయోగింపరు. కాని సంగీతము విన్నప్పుడు మనకు శోకము, సంతోషము మొదలగు ప్రకృతిసిద్ధములగు భావములు తలచూపును. ఇంతేకాదు, వస్తువుయొక్క అంతరంగతత్త్వమును చక్కఁగా భావనచేయఁగల శిల్పి కలిగెనేని, మనము సామాన్యముగ ఆవశ్యకములని, ముఖ్యము లని తలఁచు బైటియంగములుగూడ నిరర్థకములనిపించును. మైసూరు సంస్కృతపాఠశాలలో కొన్ని యేండ్లక్రింద

వేణీసంహారనాటక మభినయించుట నేను చూచితిని. చుట్టును సభ్యులు కూర్చుండి యుండఁగా నడుమ నాలుగు బెంచీలు వేసి రంగస్థల మేర్పఱిచియుండిరి. నియతకాలమునకు సరిగా నలుగురు విద్యార్థులువచ్చి రంగస్థలమున కుర్చీలపైఁ గూర్చుండిరి. వారిలో దోవతి, షర్టు, ఉత్తరీయము, క్రొత్తగా చేసి కొన్న అర్ధభద్రాకరణముచే తళతళలాడు తల, విభూతికట్లఫాలమును గల్గి సామాన్యశరీరముగల యొకవిద్యార్థి తనవలెనే ప్రక్కన కూర్చున్న మఱియొక విద్యార్థిని చూచి 'ప్రియే!' యని సంబోధించెను. వాఁడును 'ఆర్యపుత్ర!' యని ప్రత్యుత్తర మిచ్చెను! రెండుమాటలాడులోపల మొదటివాఁడు భీముఁడనియు, రెండవవాఁడు ద్రౌపదియనియు మే మెఱిఁగి నవ్వఁజొచ్చితిమి. కాని మఱి రెండు నిమిషములలో మా నవ్వంతయు మాయమయ్యెను! ఒక్కపల్చని బడుగైనను భీముఁడు గావచ్చుననియు,చీర యేకట్టకున్నను స్త్రీపాత్రము నభినయింపవచ్చుననియు నాకర్థమైనది. భీమపాత్రము వహించినవాఁడు ఇంక కొంత స్థూలకాయుఁడుగా నుండియుండెనేని, ద్రౌపది నభినయించినవాఁ డొక చీరగట్టుకొనియుండెనేని, మనకు మొదలు గలిగిన ఆయింతనవ్వును రాకయుండును. బహిరంగముల ఫలమింతే. మన చిత్తవృత్తిని వస్తువిశేషమగు అంతరంగమువఱకు ఈడ్చుకొనిపోయి విడిచి తాము వెనుకఁబడును. కళావంతుని ముఖ్యమగుపని ఆ చిత్తవృత్తిని ఆ చోట ఏకాగ్రముగా నిలుపుటయే.

కాఁబట్టి కళకు అనుకరణముసాధనము. సాధ్యము చిత్తైకాగ్రత. దాని ఫలము శాంతి. కడచిన తృతీయాంధ్రనాటక కళాపరిషత్తులో అధ్యక్షత వహించిన శ్రీతాడిపర్తి రాఘవాచార్యనటశేఖరుఁడు 'మనశ్శాంతినిబడయుటకు నాటకములు ముఖ్యసహాయకములనుట నాకిప్పు డనుభవమునకు వచ్చినది' అని చెప్పిన మాట చాల విలువగలది. నాటక మొకటే కాదు, అన్నికళలును అంతే. శాంతియనఁగా సోమరితనము కాదు; ఏకాగ్రత. అవిదిత వేద్యాంతరముగా ఏదేని యొకవస్తువునందు చిత్తము నిల్పఁగలుగుట. బహుభేదములచే భిన్నమగు ఈప్రపంచమునందు అభేదానుభవమును సంపాదించుట. ఇట్టి అవస్థ ఆనందమయము. ఆనంద మనఁగా సుఖము కాదు. సుఖము ఇంద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము. అనఁగా ఆత్మకెక్కువ సంబంధించినది. మంచి కంచువంటి శారీరమును విన్నప్పుడు సుఖము చెవులకుఁ గలుగును. అందు వివిధభావములను ప్రదర్శించి రాగాలాపన చేయునపుడు కలుగునది ఆత్మానందము. అట్లే నాటకములలో వింత వింత వన్నెల తెరలు, తళతళలాడు చీరలు, సొమ్ములు ఇత్యాది 'పుస్తము'లను చూచి నప్పుడు కనులకు సుఖము గలదు. శృంగారాదిభావములను విరివిగా నటు లభియించు

నప్పుడు ఆత్మ కానందము మనకుం గలుగును. సుఖము ఆనందముయొక్క మిత స్వరూపము. మఱియు చంచలము. సుఖమే దుఃఖమును అగును. చలికాలమున వేడి వేడిగా ఒక గిన్నెండు కాఫీ త్రాగుటలో సుఖ మున్నది. అదే రెండవగిన్నెకు ఉదాసీనమై మూండవ గిన్నెకు అసహ్య మగును; ఇంకను మించిపోయిన విషమగును. ఆనంద మట్టిది కాదు. సంపాదించుకొనంగలకొలంది అనుభవింపవచ్చును; అనుభవించుకొలంది ఆశ లూరును; అమేయ మగును. కాంబట్టియే ఇట్టి యానందమునకు హేతువగు శాంతికై పూర్వకాలపు మహర్షులు వేకారిచేసిన 'ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః' అను ఘోషణ ఇప్పటికి వేదమువల్లించువారినోట మిగిలి యున్నది.

శాంతిని సాధించు వస్తువు లయము. సంగీతగాండ్ర వ్యవహారములో లయమను మాట విన్నాము. అక్కడ ఆపేరునకు సంగీతమునం దాటపాటలకై యుపయోగించు కాలపు తునకల పరస్పర సామ్యము అర్థము. నడకకు మూలమగు కాలమాత్రలలో ఏమాత్రమును భేదము, ఎగుడుదిగుళ్లును ఉండక ఒకటేగత్తుగా నికరముగా వర్తించుట. కాని యీలయ శబ్దమునకు కాలఖండసామ్య మనిమాత్రమే అర్థమును సంకోచింపక 'సామ్యము' అనియే సామాన్యమగునర్థమిచ్చి చూచితిమేని మన జీవితమందు ఈపోలిక యెంతప్రబలమైన పదార్థమో గమనింపంగలము. సామ్యము లేనిచోట వైషమ్యము. మనకు వైషమ్యమువలె మనస్సును కలంతపెట్టి నొప్పికలిగించు ధర్మము వేఱులేదు. ఇంటిముందఱ కంబములు రెంటిలో-ఒకటి యింకొకదానికంటె పొడవుగానో, లావుగానో ఎక్కువతక్కువగా నుండెనేని ఎంత మనసు కంటగించునో వేఱుగా చెప్ప వలయునా? శరత్కాలమున చీంకటిరాత్రులలో ఆకాశమును జూచిన యెవరికింగాని 'ఇన్ని నక్షత్రములును ముత్యాలముగ్గు పెట్టినట్లు ఏదైన నొక లయప్రధానమగు ఏర్పాటులో నుండక, కళ్లములో గాలికి చెదరిన జొన్నలవలె చెల్లాచెదరుగా ఏల విసరిచల్లినట్లున్నవి?' అను వెత కలుగకుండునా? సామ్యమున్నచోట చక్కందనమును, వైషమ్యమున్నచోట వికారమును మన మనుభవింతుము. ఇట్లేలయగును? ఇది స్వభావమింతే. సృష్టియందే మన మేవస్తువుయొక్క నిర్మాణమును పరీక్షించినను అందు ఈ సామ్యము విశేషముగాం గానవచ్చును. మన కాళ్లు, చేతులు, కన్నులు మొదలగువానిని పరస్పరము పోల్చి అవి యెట్లు సమముగా తీర్పంబడినవో చూడుండు. తుదకు ఒకచేతిలోని ఐదువ్రేళ్లును ఒక్కొక్కటి యొక్కొక్కతీరున విషమముగా నున్నను అదేరీతినే వ్రేళ్లను ఇంకొకచేతియందును అమర్చి సృష్టికర్త సామ్యము నిర్వహించియుండుట మనము చూడంగలము. ప్రకృతిలో వైషమ్యము లేదని కాదు, కలదు. మఱియు సామ్య



[illegible]ము                                        K. M. L.



మిశ్ర ప్రకృతి                                        P. R. R.



వీథి

(పైనుంచి.)

K. M. L.



విపరీతవ్యక్తులు

(పైనుంచి.)

K. M. L.

మును వైషమ్యమును 'సమతూకము'గానే యున్నవేమో! కాని యెట్లయినను ఆ వైషమ్యమును తొలఁగించవలె ననెడు ఆశయు, సాధ్యముగానిచోట దానిని తొలఁగి దూరముగా నుండవలెనను ఆత్రము మనుష్యులకు-పశు, ప్రాణిసామాన్యమునకు - గలదు. ఒకటికన్న నెక్కువ పదార్థములు సమానముగాఁ గనఁబడినప్పుడు వానియందలి భిన్నబుద్ధి చాలవఱకు నశించి మనసు నెమ్మదిపడును. ఇది లేనిచోట కృత్రిమముగా నైనను కల్పించి యానందింతుము. చెట్టుకొమ్మలు లయశుద్ధి లేక యెగుడుదిగుడుగా వంకరటింకరగా పెరిగినచో కత్తిరించియైనను చక్కఁజేసి కన్నులు తృప్తిపఱుచుకొందుము. ఈలయము పదార్థముల జాతి, గుణము, క్రియ మొదలగు నన్నిటియందును వ్యాపించి అనంతమై అమేయమైన బలముగల మూలధర్మము. సౌందర్యము, సౌమనస్యము, ఆనురూప్యము, అభిమానము, స్నేహము-అనుభావములకెల్ల ఇదే ఆధారము. దీని ననుభవించునపుడు మనము సృష్టిమూలతత్త్వమునే స్పృశింతుమేమో! దీని మహత్త్వమును గమనించుటయందే మనుష్యప్రయత్నము లన్నియుఁ బ్రవర్తించిన ట్లున్నది.

ఈ సహజమగు లయాభిమానమును వెలువరించు మానవప్రవృత్తులే కళలు. కావుననే వానికి అనుకరణము బీజమైనది. సృష్టిలో వైషమ్యమిశ్రముగా నున్న లయవేగము చాలక, ఉన్నది కొంత, ఉండవచ్చునది కొంత, ఉండవలసినది కొంత చూచి, ఊహించి, కల్పించి, అనుకరించుట కళాధర్మము. అనుకరించుటకు మనము గ్రహించిన ప్రతివ్యక్తియందును రెండుభాగములు గలవు: వెలుపలి రూపక్రియాదులు, లోపలితత్త్వము. వీనిలో బహిరంగముల ననుకరించుట అంతకష్టము గాదు. ప్రాయపువాఁడు ముసలివాని వేషము వేయవలసినప్పుడు తెల్లగడ్డము, వంగినడపు, కాళ్లచేతుల వణఁకు మొదలగువానితో ఆ పని చేయవచ్చును. కాని ముసలివారి అంతరంగములగు మఱపు, హృదయ దౌర్బల్యము, సుకుమారత, పక్వమైన వివేకము, ఇంకను ముదిరినచో అవివేకము — మొదలగువాని ననుకరించుటయే కష్టము. అప్పుడే మనకు ఆ ముసలివ్యక్తితోడి లయము పూర్ణముగా సిద్ధించును. కాఁబట్టియే కళలలో బహిరంగాభినయము చేయువానికంటె అంతరంగమందలి భావభేదములను విరివిగా ప్రదర్శించునవియే యెక్కువ మనల నాకర్షించును. జాతిలో పాత్రమును తొలుచువానికంటె ప్రతిమను తొలుచువానిపనికి గౌరవమును, వెలయు నెక్కువ. కారణము మొదటిదానిలో అంతరంగచర్చ లేదు. రెండవదానిలో అంతరంగదృష్టి తప్పనిది. కాకున్నచో దానిని మొద్దుబొమ్మ అందుము. తక్కినకళలన్నియు అంతరంగ బహిరంగముల రెంటిని కొంతకు కొంత వెలువఱుచునుగాని సంగీత మొక్కటి

కేవలము అంతరంగమునే ఆశ్రయించినది. పాశ్చాత్త్యసంగీతపద్ధతిలో ఉఱుము, తుపాను, సముద్రతరంగముల కోలాహలము—మొదలగువాని ననుకరించు బహిరంగరచన కలదని విన్నానుగాని మనపద్ధతిలో అట్టిదేదియు లేదు. కాఁబట్టియే సూక్ష్మములైన తీవ్రము, లైన ప్రాణిభావభేదములను గానము చూపఁగలిగినట్లు ఏ యితరకళయు చూపలేదు. మఱియు ఏడ్పు, నవ్వు, ప్రేమ, ప్రార్థన మొదలగు భావములను విచిత్రరీతుల వివిధగతుల వెలయింపవచ్చును గాని ఏడ్చువారెవరో, స్త్రీయో, పురుషుఁడో, చిన్నయో, పెద్దయో, ఏజాతియో, వస్త్రములున్నవో, దిగంబరమూర్తియో, ఎందు కేడ్చునో—ఏదియు చూపవీలులేదు. ఇందుచేతనే తక్కిన యన్నికళలకంటె దీనియందు స్పష్టత తక్కువ యంటిని. ఇట్టివానిని స్పష్టపఱుపవలె నన్న కవిత్వమును, అభినయమును గానమునకు తోడుగావలయును. * ఇట్లే భావప్రదర్శనమందు అభినయమునకు కవిత్వమును దానికి సంగీతమును సహాయము గాకున్నచో పూర్ణభావలయము మనకు సిద్ధింపదు. భరతుఁడు అయోధ్యానగరము నంతయు నిదానముగా నొకమాఱు కలయఁజూచి చేతులెత్తి వేలవేసి తల వంచుకొని కన్నులు మూసికొన్నాఁడనుకొందము. అతని ఆ భావము స్పష్టముగా మనమనస్సులలో రూపుగొనవలయునేని 'అన్న లేక శ్మశానముగా నున్నదే ఈపాదూరు కన్నులతో ఎట్లు చూడఁగలను!' అని చెప్పక తీఱదు. ఇట్లు గద్యముగాఁ జెప్పుటకన్న

'మా రాఘవుఁడు లేమి
మసణమైతోఁచు నీ
పాదుూరు కన్నెత్తి
చూడఁగలనె!' †

అని యిట్లు పద్యముగా లయమధ్యమందు బిగించినప్పుడు భావమునకు బిగువెక్కువ. దీనికి తోడుగా శ్రుతిరాగలయములతో పాడినచో భావమింకను కేంద్రీకృతమగును. దానికి తోడు తాళలయసహితమైన పాటయే యయ్యేనేని మేలు కాదా? మనప్రాచీను లింకను లోఁతుకు దిగి నృత్తమునుగూడ చేర్చిరని వెనుకనే విన్నవించితిని. ఏల కారాదు? భావములను తీవ్రపఱచుశక్తి శ్రుతిరాగతాళలయముల నాశ్రయించిన సంగీతమునకున్నదఁట, అక్షరమాత్రాలయమును జూపు పద్యరచనకున్నదఁట, నృత్తమునకు మాత్ర మేల లేదు? కావ్యములలో పద్యములు చదివినప్పుడు, కచ్చేరీలలో పాటలు విన్నప్పుడు ఆయాభావములు మనలో నుద్రేకించుట లేదా? అట్లే నృత్తమునకును శక్తికలదు గాని మనము దానిని చక్కఁగా పరీక్షింపలే దంతే. మృదం

* భావములేని వట్టివాద్య సంగీతమందును, అంతకన్న నెక్కువగా అభినయమున కవకాశములేని గ్రామఘోషుల పాటలందును మనకుగల యతృప్తి స్పష్టమే.

† భ. కృ. గారి పాదుకాపట్టాభిషేకము.

గము మొదలయిన వాద్యములను పాటకచ్చేరీలలో వినునప్పుడు వాయించువాని జుట్టు ఎగుర్లాడుట చూచి నవ్వుచుందుము; ఆడుచున్న భోగముసాని అంగసౌష్ఠవములపై దృష్టి యుంతుము. అట్లుగాక కొంతప్రయత్నించి ఆలయపునడక ననుసరించిపోవుచు దానిచే మన మనస్తత్త్వముపైఁ గలుగు పరిణామములను పరీక్షించుకొంటిమేని కాలమాత్రాలయప్రధానములగు ఆకళలకు ఎంతసత్తువ కలదో మనలో సహృదయులందఱును గమనింపవచ్చును. రుచియైన భోజనము గమగమలాడునట్లు ముందు తెచ్చిపెట్టినను ఆఁకలిలేనివానికి కాఁబట్టనట్లే తత్త్వము కొంతయెఱిఁగి హృదయమును సంస్కరించుకొని తయారుగా నుండనివానికి ఎటువంటి కళయైనను బూడిదలో హోమమగును. కావున కళాస్వరూపమును విమర్శించునపుడు అది స్వాభావికమా కాదా అను విషయమును కేవలము బహిరంగములచేత, బహిరింద్రియములచేత నిర్ణయింపక అంతరంగమును, హృదయమును సమ్యక్ పరీక్షించినపక్షమున ఇప్పటి స్వభావవాదమెంత తేలికయైనదియు మనకుఁ దెలియఁగలదు.

కాని మనలో నృత్తము నశించినది. కాళిదాసాదుల కాలముననే అది అంతరించినది. దానిని మరల పామరజనులను జూచి నేర్చుకొనినయైన పునరుద్ధారము ఎప్పుడు చేయఁగలమో, చేయనేలేమో తెలియదు. కావున నాటకవిషయమున దానినిగూర్చి చర్చించుట ఇప్పటికి వట్టిసిద్ధాంతపుమాట; వ్యవహారపుమాట కాదు. కావున దాని నట్లుండనిత్తము. మనలో ఇంకను చావక బ్రతికినవి పద్యములు, పాటలు. పాటలుగూడ మనలో నాటకప్రపంచమునుండి విడివడియుండెను. ఏ పార్సీకంపెనీవారి పుణ్యాననో మరలవచ్చి అతుకుకొని అల్లాడుచున్నవి. వానినిగూడ త్రోసివేయు ప్రయత్నములు జరుగుచున్నవేయను కడుపుచిచ్చుతో మీకింత గందరగోళము మనవిచేయవలసితిని. కాని నాటకములందు పాటలను, పద్యములను చక్కఁగా, యథోచితముగా నిర్వహించు కష్టమెఱుఁగకపోలేదు.

ఇందు మొదటికష్టము నాటకము రచించు కర్తది. నాటకమందు ప్రధానమైనది అభినయకళ. అందు సాత్త్వికము, ఆంగికము, ఆహార్యము అను త్రివిధాభినయమును గూర్చి కవి కేమియు అధికారము లేదు. అతఁడు సృష్టిచేయునది వాచికాభినయమునకు పనికివచ్చు భాషమాత్రమే. ఆ భాషను పద్యములుగా ఎప్పుడు రచియింపవలయును; ఏపద్యము లేచోట్ల వాడవలయును, దానిని పాటగా నెట్టె సన్నివేశమందు కూర్పవలయును, ఏరాగములో, ఏలయములో-ఇత్యాదివిషయములను చక్కఁగాభావనచేసి రచించిపెట్టుట వానిపని. కాని ఆవివేచనాశక్తికలవారు నాటకకర్తలలో నూటి కొక్క రుందు రంతే. తక్కినవా రందఱును ఇచ్చవచ్చి

నట్లు కలిపికొట్టి వ్రాయువారే. ఎవరో, యే చోటనో వ్రాసిరని సమయము దొరికినప్పు డెల్ల అమ్మ, అయ్య అని పాదములను ముగించుచు అసహ్యము లైన సీసపద్యములు గుప్పించువారు కొందఱు; త్యాగరాజుకీర్తనలను అచ్చుగొట్టువారు కొందఱు; పారసీమట్లకు ప్రతిపదములు వేయువారు కొందఱు; జావళ్లకును, జట్కా సాహేబులవరసలకును అక్షరమును జోడించువారు కొందఱు. ఇంతే కాని వెనుకఁజెప్పిన మాటకును పాటపద్యములలోని యెత్తుగడమాటకును పొత్తు కుదిరినదా యనినైన విచారించి కూర్చువారరుదు. ఇఁక రాగతాళములు రసభావములను పోషించుచున్నవా యని విమర్శించు మాట చెప్పఁ బనిలేదు.

ఇఁక రెండవ కష్టము నటులది. వారి కేమైన కొంతసంగీతము అ ఆ ఇ ఈలు వచ్చియుండెనా అమరకోశమున మాత్రము నిలిచియున్న హాహా హూహూ గంధర్వులు సాక్షాత్తుగా మనయెదుట ఆవిర్భవించినట్లె కచ్చేరిలకు మొదలుపెట్టి తబలా హార్మోనియమువారితో స్పర్ధకు నిలిచి రసరంగమును రణరంగముగా మార్తురు. కవి, కథ, పాత్రములు వీనిగతి యేమేటఁ బోయినను వారికి చింత లేదు. అభినయవిద్యయందసాధారణ చాతుర్యము గలిగి ఇప్పటి కర్ణాటకనటుల కనేకుల కాదర్శప్రాయుఁడుగా పరిణమించి అర్హతకుఁ దగిన మహాప్రఖ్యాతినందిన వరదాచార్యునివంటివారియందే ఈ గుణము ముదిరి అసహ్యముగానుండెడిది. ఇఁకసామాన్యులమాట యేల? మాటకుఁ దగినపాట యొకవేళ కవి వ్రాసినను దాని రాగలయముల విలువ నెఱిఁగి తగినంతనియమముతో, స్వరభేదములతో పాడి రసభావములను పోషించుశక్తిగల నటు లిప్పుడే కాదు ఎప్పుడైనను కొందఱే. నేనుజూచిన నటులలో— నేను చాలమందిని చూడలేదనుమాట సత్యము—ఒక స్థానం నరసింహారాయలకే యీ రహస్య మర్థమైనట్లు తోఁచినది.

ఇఁక మూఁడవకష్టము మనది: అనఁగా చూచు సభ్యులది. నాభార్య యింటిలో ఎట్లు డ్నునో నలుని భార్యయు నట్లే యేడ్వవలయునే కాని ఒక కన్నీరుబొట్టుగూడ ఎక్కువగాఁగాని, తక్కువగాఁగాని కార్చరా దని తలఁచువారిని, స్వభావమను పదార్థమునకుఁ గల లోఁతును దిగిచూడకయే ఇది స్వాభావికము, అది అస్వాభావికము అని నిర్ణయించుకొన్నవారిని, తమ హృదయతత్త్వమును బరీక్షింపక యెవరో చెప్పిన అపసిద్ధాంతములనే పట్టుకొని అల్లాడువారిని రంజింపఁజేయుట చాల కష్టము. మనవారికి పద్యములు, పాటలు రుచింపవని కాదు. కవిత్వమును వారు మెత్తురు; పాటకును పరవశులు కాఁగలరు. కాని నాటకములందీ రెంటికిని దేవునిసాక్షిగా చోటీయఁగూడ దని మొండిపట్టు పట్టుదురు. ఇది రుచిలోపముకాదు, అభిప్రాయ లోపము.

ఇఁక నాటకములందు పై రెండు ఉండవలయు నను వారు కొందఱితో మఱియొకకష్టము. వారి పాలిటికి ప్రాసయమకశ్లేషాది పూర్ణములై నాట్యమును కొంతప్రొద్దట్లుండనిచ్చి నిఘంటువులను చూచునట్లు చేయఁజాలినవే పద్యములు.

అరయరే తరుణి నిర్ఝరిణులార ప్రమత్త
కరిణులార విభీతహరిణులార ...*

ఇటువంటి పద్యములు వ్రాసినందుకు కవిని, ఆప్రాసములట్లే చెక్కు చెదరక యెత్తి పాడిన నటుని వారు 'బలే' యందురు. పాటలందును ఇట్లే.

ఇట్లనుటచే పద్యములును, పాటలును నాటకప్రపంచమునుండి బహిష్కారము చేసిన బాగేమో యనిపించుట సహజము. కాని యిట్టికష్ట మెందులో లేదు. నాటకకళకు మూలవస్తు వగు అభినయములో లేదా? భావము తీవ్రముగా నున్నచోట జాలి మొద్దులవలె నిలుచుకొనువారు లేరా? సామాన్యభావమునకుఁగూడ పంచప్రాణము లెగిరిపోవునట్లు, రక్తనాళముల బిగఁబట్టి, పండ్లుగొఱికి, మొగము సిండ్రించుకొని, పెం డ్రుకలు గుంజుకొని, కనుగ్రుడ్లు తేలవేయువారు లేరా? వన్నె వేసికొనుటలో మొగమంతయు తెగఁదిక్కిన తామ్రపు చెంబువలె వికారము చేసికొనువారు లేరా? సదుపయోగశక్తి లేక దురుపయోగశక్తి గలిగియుండినయెడల ఏవస్తువునైనను జెఱుపవచ్చును. ఒకకవిత్వ సంగీతములను మాత్రమేనా? అట్టిచో మొదటిశక్తిని వృద్ధిచేసికొని రెండవదానికి వదలుటకు ప్రయత్నము చేయుట ధీరగుణముగాని అసలుపదార్థమే వదలుట కళావంతులవంటి తపస్వులకు తగనిపని. మరల నొకమాఱు నామనవియేమనఁగా: స్వభావము అనునది అమేయము, అగాధము. దాని మేరయింతేయని యెఱుఁగ నెవరితరమును గాదు. మఱి సాధ్యమైనంత దానిలోఁతును జూచుటయే కళలపని. కాలుపెట్టి చూడని యెడల అది అంతరగంగకప్పినబావివలెఁ గానవచ్చును. అంతకే మోసపోరాదు.

మధ్యవర్తివివేకులు కొందఱు ఈసందర్భమున ఒక కోమటితీర్మానము చెప్పుదురు; ఏమనఁగా: '† గంభీరములు, తేలికమైనవి యని రూపకములు రెండువిధములు. మొదటి తరగతిలో పురాణకథలను, చరిత్రకథలనుబట్టి వ్రాసిన నాటకములు చేరును. సాంఘికనాటకములు రెండవతరగతివి. అనఁగా సమకాలీన జీవితము నాశ్రయించి వ్రాయఁబడినవి. గంభీరనాటకములలో పద్యములు, పాటలు ఇష్టమున్న వేసికొనుఁడు. కాని రెండవతరగతివానిలోమాత్రము అవి అసందర్భములగును.' అని. అసలీవిభాగమే నా కర్థము కాలేదు. నేటిజీవితము రేపటికి చారిత్రము, మర్నాఁటికి పురాణము. ఇది కేవలము విభాగ

* ఘ. కృ. గారి చిత్రనళీయము, అం. 3, ప.3.

† Tragedies and Comedeis.

ప్రియులగు విమర్శకులకు, లాక్షణికులకు తృప్తికరమగునేమోకాని రసికులకు నిరర్థకము. రసము గల్గింపఁగల సన్నివేశములు నిన్న మొన్నటివలె నేఁడును గలవు. రసము ననుభవించి యానందించు సత్త్వమును మనకుఁగలదు. ప్రాచీనులకును, మనకును ప్రమాణములో భేదమున్నది. వారు పూటకు రెండు సేర్ల అన్నము భుజించిన మనము పావుసేరు భుజింతుము. కాని ఆఁకలివిలువ యిద్దఱకును ఒకటే. ఆకాలపుతల్లులు నూర్లకొలఁదిబిడ్డలను గనిన మనతల్లులు నలుగు రైదుగురు పిల్లలఁ గంద్రురు. కాని మాతృవాత్సల్య మొకటే. వారు నమ్మిన విషయములను మనము నమ్మకపోవచ్చును గాని నమ్మిన విషయములందు మనోబల మొక్కటే. బహిరంగములలో భేద ముండవచ్చును గాని అంతరంగమందు లేదు. అదియే కళావస్తువుజీవనముగదా. అది యొక్కటి సృష్టిలో నుండు వఱకును, ఏకళగాని స్వతంత్రముగా, సంపూర్ణముగా దానిని అనుకరింపఁజాలదనుట సత్యములలో సత్యము. కాఁబట్టి ఆధునికసమకాలీనజీవనమందలి తత్త్వమును కేవలము మాటలు అభినయము వీనితోనే నిర్వహింపఁగలమనుట నాకుఁ జూడఁగా అర్థములేని అహంకారము. పాటలు పద్యములును ఇందు చేరుట అస్వాభావికమనుట మనస్వాభావజ్ఞానమింతయనియే తెల్పునుగాని వేఱుకాదు. కనుక సమకాలీనజీవితము నాశ్రయించిన నాటకములు 'తేలిక'గా నుండవలసినపని లేదు. అవియును గంభీరములే యగును. గంభీరమగు భావరసములను గ్రహించి కూర్పఁగల్గినచో, ఇఁక తేలికగానుంచు నాటకములు లేవనికాదు. తేలికనైన విషయములు ఏకాలమందును గలవు. వానిని గ్రహించినప్పుడు నాటకములు తేలికకాకమానవు. మఱియు, కవులకు నటులకును తెలివిలేకున్న రెండును తేలికయగును. ఎన్నియో పురాణచరిత్ర నాటకములఁజూచిన నాకు నవ్వు వచ్చును. వానిలో పనికిమాలినచోట్ల పద్యములు, పాటలు నించియుండుట చూచి, వానిని చక్కఁగా పాడలేని నటులనుజూచి దుఃఖము వచ్చును. అది యట్లుండె.

(సశేషము)

# నానాదేశములకు ఒకే కరెన్సీప్రమాణము యుక్తమా, అయుక్తమా!

చల్లపల్లి అప్పారావు

ఈ కాలమున ఆర్థికవిషయములలో దేనిని గురించి ముచ్చటింతుమన్నను, పెనుభూతము వలె ప్రపంచమంతయు నావరించియున్న వర్తకదుర్దశను గురించి కొంచెము చెప్పకతప్పదు. ఇట్టిదుస్థితి రానున్నదని యేజ్యోతిష్కుడును యెక్కడను వ్రాసిగాని, చెప్పిగాని యుండకపోయినప్పటికి, వచ్చినతరువాత ఆర్థిక శాస్త్రవేత్తలందరు దీనికి ముఖ్యకారణము లేమై యుండునా యనిమాత్ర మాలోచించిరి. కాని చాలమంది భిన్నాభిప్రాయములు తెలిపియుండిరే కాని అందరు నేకగ్రీవముగా, మూలకారణ మిదమిత్థమని మాత్రము తెలుపజాలరైరి. కొందరు సరకులయొక్క ఉత్పత్తి పెచ్చు పెరిగిపోవుటచేతననియు, కొందరు వెండిబంగారములు రెండును యుద్ధానంతరము ప్రత్యేకముగా అమెరికా, ఫ్రాన్సు దేశములయందే నిండియున్న కారణముచేతననియు, మరికొందరు తమతమ దేశములలో గవర్నమెంటువారు దూరాలోచన లేక యవలంబించిన కరెన్సీపరిపాలనావిధానముచేతననియు అనేకవిధములుగ నిర్వచించియున్నారు. ఏది యెటులున్నను ఆర్థికవేత్తల దృష్టిపథమున, యీదుస్థితికి కారణాన్వేషణము ప్రస్తుత మంతముఖ్యముగా గోచరించుటలేదు. మనుజునకు వ్యాధిసంప్రాప్తమైనప్పుడు ఆరోగము ఏకారణముచే సంక్రమించెనాయని తదేకదీక్షగా దీర్ఘాలోచనచేయుచు మందువాడకుండుట సమంజసము కాదు. ఆవిధముగనే మనశాస్త్రజ్ఞులందరు ఈ ఆర్థికదుస్థితి మొత్తముమీద నైన తెలియపరచబడిన మూడవకారణమువల్ల వాటిల్లినదిగ ఎంచి తన్నివారణమునకు అనేకవిధములుగ మందుల నేర్పాటుచేయుచున్నారు. అట్టి యౌషధములలో "అన్నిదేశములకు ఒకే కరెన్సీప్రమాణము ఏర్పాటు చేయుట" అనునది యొకటి. ఈవిధాన మెంతవరకు పాటింపదగినదో విచారించిచూతము.

ప్రస్తుతము ఆయాదేశములలో అమలులోనున్న కరెన్సీప్రమాణములు మన కీవిచారణయందు ఆధారభూతములు. ప్రపంచములో లేని క్రొత్తకరెన్సీప్రమాణ మొకటి సృష్టించిపెట్టవలెనన్నచో హాస్యాస్పదముగ తోచకమానదు. కనుక ముఖ్యముగా ప్రపంచవర్తకవ్యవహారసరళిలో చలామణీకాబడే కరెన్సీప్రమాణములనే మనము పరిగణించినయెడల సరియైనజవాబు దొరకును.

అయితే యేదేశమందయినను కరెన్సీప్రమాణము వలన ముఖ్యోద్దేశమేమియో మనము తెలుసుకొనవలసియున్నది. సరియైన కరెన్సీపరిపాలనావిధానముండెనేని, ధరలుపడిపోకుండ నిలుకడగనుండుట, దేశాంతరవర్తక వ్యాపారము హెచ్చుగనుంట, దేశమునకు లాభముకల్గుట, ప్రజలు తద్వారా సంపదలుగడించి సౌఖ్యవంతులగుటయు జరుగవలసియున్నది. ఈ ప్రయోజనములు సిద్ధించునంతవరకు కరెన్సీపరిపాలనావిధానములో నేదియోలోపమున్నదనియే యెంచవలసియున్నది. కాబట్టి మనము అన్నిదేశములకు ఒకే కరెన్సీ నిర్ణయించితిమేని అది మూడువిధములుగ ప్రయోజనకారియై యుండవలయును. లేనియెడల అట్టిదానికి ఆవశ్యకతయే కనబడదు. పైమూడు ప్రయోజనము లేవి యనిన, ౧. దేశములోపల వస్తువులధరలు సర్వకాలములయందు నిలుకడగనుండుట, ౨. దేశములయందున్న కరెన్సీలలో ఒకదానికిని ఇంకొకదానికిని గలమారకపు రేటు హెచ్చుతగ్గులు లేకుండ స్థిరముగనుండుట, ౩.

దేశాదాయములు ఒకేమాదిరిగ, నష్టములు కలుగకుండ, లాభించుచుండుట, అనగా ప్రజలకు వర్తకవ్యాపారములలో కల్గులాభములుగాని, కూలిజనులకువచ్చు జీతములుగాని, వ్యాపారసాహసముగాని, పెట్టుబడ్లుగాని తగ్గకుండ నవనవోన్మేషముగా దేశము పరిఢవిల్లుచుండుట. అట్టిమహదైశ్వర్య సంపన్నమైనప్పుడే దేశము సుభిక్షమనియు, సౌఖ్యవంతమనియు చెప్పవలసియున్నది. కనుక మనకు పై ప్రయోజనము లన్నియు పూర్తిగ సమకూర్చి నిర్వహింపగల కరెన్సీప్రమాణమేమైననున్నదాయని ఆలోచించవలయును. ఉండినచో ప్రతిదేశమువారును తగినయొడంబడికలు చేసుకొని తద్విధానము నవలంబించుట ముఖ్యకర్తవ్యమైయున్నది.

ప్రపంచకములో ప్రస్తుతము ఆర్థికవేత్తలదృష్టికి నాటినవి మూడు కరెన్సీప్రమాణములు: ౧. అమెరికా ప్రమాణమగు డాలరు; ౨. ఇంగ్లాండు ప్రమాణమగు స్టర్లింగు; 3. బంగారము. మొదటిరెండింటికి బంగారముతో లంకె విడిపోయినది: అనగా సదరు రెండుకరెన్సీలకు బంగారము మారకము నీయవలసినబాధ్యత తొలగిపోయినది. అందువలన డాలరుస్టర్లింగులు రెండును తమనికరమయిన బలాబలములు చూచుకొను నవకాశము లభించినది. ప్రపంచమునకంతకు ఒకేకరెన్సీ వుండవలెనన్నచో పయిమూడింట నేదియో యొకటిమాత్రము అయివుండవలెను. అంతియగాక వాటిలో నేది పయి మూడుప్రయోజనములను నెరవేర్పగలశక్తిసామర్థ్యములు కలదో అదియే యింటర్నేషనల్ కరెన్సీగా వ్యవహరింపబడగలదు.

అమెరికాలో డాలరు బంగారుప్రమాణమునుండి తొలగినదిలగాయితు రూజువెల్టుమహాశయుడు అనేక కరెన్సీశాసనములను అమలులోనికి తెచ్చినాడు. ఆయన ఆశయము మొదటినుండియు తనదేశములో వస్తువుల ధరలు తగ్గకుండ నిలుపుదలచేయుటయే. ఆవిధానమున అమెరికాఅధ్యక్షుడు దిగ్విజయముగాంచిన మాట సత్యమే కాని పయినతెలియపర్చిన మూడవప్రయోజనము సంపాదించినట్లు కనబడదు. ఇప్పటికిని అమెరికాలో నిరుద్యోగము హెచ్చుగనున్నదని మనము వార్తాపత్రికలలో చదువుచునే యున్నాము. మరియువర్తకవ్యాపారమింకను విరివిగ సాగుటలేదు. లాభములు అంతకంటె లేవు. బ్యాంకురేటున్నూ తగ్గచున్నట్లు కనబడదు. ఇంతవరకును రూజువెల్టుగారు డాలరు రేటును తగ్గించి ధరలు సాధ్యమయినంతవరకు హెచ్చుచేయ బూనినాడేకాని, పయిన తెలియపరచిన మూడవప్రయోజనమునకు దృష్టి మరల్పడయ్యె. అంతవరకు డాలరుకు తగిన అర్హత లేదనియే మనము చెప్పవలసి యున్నది. అయితే ఇకనుంచి రూజువెల్టుగారు తక్కిన రెండు ఉద్దేశములను నెరవేర్ప నుద్యమించి అందు ధరలు నిలుపుదలచేయుటయందువలెనే విజయముగాంచెనేని, ఆనాడు డాలరుకు ప్రపంచమునకంతకు కరెన్సీ ప్రమాణముగా నుండు తాహతు కలదని చెప్పనోపును. కాని రూజువెల్టుగారు దేశీయాదాయములను నిల్కడగా నట్టి విధానమును నిర్వహింపగలడా యని సందియమయ్యెడును. ప్రపంచకములో నున్న బంగారము మొత్తములో సుమారు ముప్పాతిక భాగము అమెరికాలో మూలుగుచున్నది. దీనికితోడు అమెరికావారికి తమ సరకులను విడుదలచేసి వీలైనంతవరకు మరింతబంగారము ముడ్డచేసి తమకోశాగారములను బలపరచునుద్దేశము పెల్లుపెరుగుచున్నది. ఇట్టియభిప్రాయ మున్నచో చాలాదేశములకు బంగారము లేదు కావున, చాలాదేశములవారికి అమెరికాసరకులు అవసరము లేకయే గడపుకొందురు. అమెరికాకు యెగుమతుల సౌకర్యము లేకపోయినచో, నిరుద్యోగ నిర్మూలనముగాని, వర్తకలాభములుగాని, కూలివాండ్ర వేతనములు పడిపోకుండుటగాని లభించుట దుర్లభము. కనుక అమెరికా యేనాడు తనలాభము, తనభాగ్యము, తనబంగారము అను స్వార్థపరత్వము వీడి యెవ్విధము చేతనయినా యుద్ధఋణముల సమస్యను సక్రమముగా పరిష్కరించునో ఆనాడు పరస్పర ప్రయోజనము లేర్పడి ప్రతిదేశమువారికిని బాగుపడుటకు సాధ్యమగును. యుద్ధఋణములసమస్య ఆయుధవిసర్జనసమస్య తేలిననే కాని తేలదనుమాట మనకు తెలిసినవిషయమే. ఆయుధవిసర్జనసభ ఒకచెంత ఆర్భాటముగా జరుగుచున్నప్పటికి యింతలో కాలము వృథాపోవుననే భీతితో కాబోలు

దేశదేశములవారును ఆయుధములను (Armaments) హెచ్చించుపద్ధతులకయి కోటానకోట్లు పైకము వెచ్చించుచున్నారు. ఇట్టి పరిస్థితులలో రూజువెల్టుగారికి పయినచెప్పబడిన మూడవప్రయోజనము సిద్ధికావనియే యూహింపదగియున్నది. కనుక డాలరుకు ప్రస్తుతసందర్భములలో యింటర్ నేషనల్ కరెన్సీ ప్రమాణ మబ్బునటులు తోచదు.

ఇక బంగారుప్రమాణ మెంతవరకు సమంజసమో ఆలోచింతము: చాలమంది శాస్త్రజ్ఞులు దీనినికూడ పనికిరాదని త్రోసివైచిరి. ప్రపంచములో మొత్తము మీద అయిదారు దేశములకంటె బంగారుప్రమాణము మీద నిలబడియున్నవి యెక్కువ లేవు. అవియును ప్రాముఖ్యము జెందిన దేశములు కావు. అందువలన దేశాంతరవ్యాపారధరలు నిర్ణయించుటకు ఆదేశములు ఆధారభూతములు కావు. ఎక్కువవ్యాపారసంబంధము గలదేశములన్నియు బంగారుప్రమాణమునుండి ముందే తొలగిపోయినవి. మఱియు బంగారునకు స్వతస్సిద్ధమయినదోషములు కొన్ని కలవు. బంగారముయొక్క ఖరీదు సార్వకాలికమైననిల్కడ పొందనేరదు. కోడిగ్రుడ్డుఖరీదు శాశ్వతముగానున్నంతకాలమయినను బంగారపుధర శాశ్వతముగా నుండనేరదని ఫిషరు (Fisher on money) అను ఆర్థికశాస్త్రజ్ఞుడు నుడివియుండెను. ప్రపంచములో నిలవవున్న బంగారము చాలాభాగము అమెరికా ఫ్రాన్సు దేశములలో నిండియున్నదనుట సర్వవిదితము. తిరిగి అన్ని దేశములవారును తమతమశక్తిసామర్థ్యముల కనుగుణముగా బంగారమును పంచుకొని నిలవయుంచుకొనినగాని నలువంకలనుండి వర్తకవ్యాపారము విరివిగసాగదు. అట్టిపద్ధతికి అమెరికా ఫ్రాన్సు దేశములవారు తమబంగారపుముద్దలను ఖరీదుకు ఇతరదేశములవారికి అమ్ముటకు యిష్టపడవలెను. అది యెంతవరకు విశ్వసనీయమో చదువరులే తెలిసికొనదగినది. అంతియకాక బంగారమును ప్రమాణము చేయవలయునన్న [illegible] కాలాతీతమగును. గబ్బిలమువలె వ్రేలాడుచున్న యిండియావంటి దేశముల కీవిధానము సరిపడదు. ప్రస్తుతకాలమునకు కావలసిన వర్తకావసరములకు బంగారము డీకొనలేదు. పూర్వముకంటె పెక్కురెట్లు త్వరితముగా విద్యుచ్ఛక్తియంత్రములచే నుత్పత్తిచేయు సదుపాయము లేర్పడినవి. అందువలన పెట్టుబళ్లకుగాని, యంత్రసామగ్రికిగాని, సరకులు తయారుచేయుటకుగాని కోట్లకొలది పైకము కావలసియుండును. అట్టిఅవసరమును బంగారము తీర్పజాలదు. బంగారము ఉత్పత్తియగు దేశములుకూడా చాలతక్కువ. అన్ని దేశములలో బంగారము దొరకిననాడే దీనికి కొంతలాభము కలుగును. వీనిఅన్నిటికిపైగా నింకొకపెద్దకారణము కలదు. దేశప్రభుత్వములవారికి బంగారమునందు అనాదిసిద్ధమయిన అభిమానమొకటి నాటుకొనియున్నది. బంగారమే సకలైశ్వర్యములకు మూలహేతువనియు, అదియే పరమప్రాప్యవస్తువనియు సంప్రదాయమొకటి చరిత్రాత్మకమైయున్నది. అందువలన ప్రతిదేశమువారికిని బంగారము నిలువచేయుదు మను అభిలాష మెండుగనున్నది. ఇంతవరకును ఆ యభిప్రాయము మారు సూచనలు కానరావు. యుద్ధ మను ప్రసంగము వినినకొలది యీ నిలవజేయుబుద్ధి మఱింత హెచ్చుచున్నది. అయితే మనము తొలుత ఆదర్శములుగా తీసుకొన్న ప్రయోజనములు మూడు బంగారు ప్రమాణమువలన నెరవేర్పబడు ననుటలో సందియము లేదు. కాబట్టి ఆప్రయోజనములకంటె నెక్కువ నష్టదాయకములగు పయిదోషములుండుటచే బంగారుప్రమాణము నానాదేశములకు పనికిరాదని సిద్ధాంతీకరింపవలసియున్నది.

ఇక స్టర్లింగును గూర్చి సావధానముగా విచారింతము. డాలరువలెనే స్టర్లింగును బంగారుప్రమాణము నుండి తొలగిపోయినది. అమెరికావలె ఇంగ్లాండు మేటి ఋణదాత కాదు. అయితే రూజువెల్టు మహాశయునివలెనే బ్రిటిషుగవర్నమెంటువారు ఇంగ్లాండు బ్యాంకువారి సలహాసంప్రదింపులతో కొన్ని నూతన విధానములు అమలులోనికి దెచ్చి ఆర్థికదుస్థితియొక్క కష్టములలోనుండి తప్పించుకొన ప్రయత్నించుచున్నారు. ఇంగ్లాండువారికి కొన్ని దేశములనుండి బాకీలు రావలసియున్నప్పటికి వారు అమెరికాకు ఇవ్వ

వలసినబాకీదార్లయి యుండుటచే అమెరికావారి కున్నంత నిర్భయముగాని, స్వేచ్ఛాస్వాతంత్ర్యములుగాని ఇంగ్లాండువారి కుండనేరవు. వారికి కావలసినది స్టర్లింగుయొక్క రేటు వడుదుడుకు లేకుండా స్థిరముగ నుండుటయే. అమెరికావలె నింగ్లాండువారికి బంగారమునం దమితమయిన అభిమానము లేదు. ఉండవలసిన అవసరమున్నూ లేదు. సర్వకాల సర్వావస్థలయందు ఇంగ్లాండు ఇతరదేశముల సరకులమీద ఆధారపడి యుండవలసినదే. స్వయంసమృద్ధిగా నుండుదేశము కాని కారణమున అమెరికావలె ఇంగ్లాండు పేరాస కలిగి యుండుట అసంభవము. బంగారము కొల్లకొలది నిలవ చేయగలశక్తిగాని, విదేశపుసరకులపై సుంకములువిధించు సాహసముకాని బ్రిటిషుప్రజల కుండుటకు వీలులేదు. కనుక బంగారమునుండి కరెన్సీకి సంబంధము త్రెంపివైచుటచే వారికి లాభమేకాని నష్టముకాదు. అందుకు ఫలితముగా వారిదేశములో ధరలు నిలకడగ నుంచుటకు సాధ్యమయినంతవరకు దేశాదాయమును వృద్ధిపొందించు మార్గము లవలంబించుటకు వీలుకలిగినది. స్టర్లింగు బంగారుప్రమాణముమీద నున్నప్పు డెట్టిస్థితియో యిప్పుడు నట్టిస్థితిగనే యున్నది. కనుక బంగారునుండి తొలగిపోయినందువలన నష్టము కనిపించలేదు. ఇక డాలరు స్టర్లింగు మారకపురేటు చంచలస్వభావము గనకుండ శాశ్వతముగా నుండుటకు బ్రిటిషు గవర్నమెంటువారు మారకపు సమానీకరణనిధి (Exchange Equalisation Fund) యేర్పాటు గావించినారు. ఇంగ్లీషు ఆర్థికశాస్త్రజ్ఞుడగు కీన్సు (Keynes) మహాశయుడు ఈ పద్ధతివలన చాలాసౌకర్యముగనున్నదని వక్కాణించియున్నాడు. ఈరేటు మారకుండ జూచునంతవరకే యింగ్లాండువారికి బంగారమునం దభిమానము గాని తక్కినవిషయములలో బంగారముతో లంకె వారి కవసరము లేదు. అందువలన తమతోబాటు స్టర్లింగు కరెన్సీకి సంబంధము కలుపుకొనుదేశములకయి యింగ్లీషువారు వెదకులాడుచున్నారు. ప్రాపంచిక ఆర్థికమహాసభలో బ్రిటిషుప్రతినిధులు ఈవిధానమునే పురస్కరించుకొని కొన్నిదేశములను తమతోబాటు మూటగట్టుకొనియున్నారు. తీర్మానములను పెట్టినప్పటికి పెద్దదేశములవారికి రుచింపకపోవుటచే ఆయుద్యమ మంతటితో ఆగిపోయినది. ఇప్పటికిని ప్రతిదేశమువారును తమతమ కరెన్సీలను స్టర్లింగుకు ముడిపెట్టి ఒకశాశ్వతమైన సంబంధమును (ratio) కల్పించినచో పయిన తెలియజేసిన మూడుప్రయోజనములు ప్రతిదేశమువారికిని సిద్ధించి సౌఖ్యము చేకూరును. ఈవిధానమునకు ప్రతిదేశమువారును సమకట్టుదురా, లేదా యను సంశయముతప్ప మిగతా అడ్డంకు లేమియు లేవు. కాబట్టి పయిసందర్భమునుబట్టి ప్రస్తుతము పరిపాలింపబడుచున్న స్టర్లింగు కరెన్సీకి ప్రపంచమునకంతకు కరెన్సీప్రమాణము కాగలశక్తిసామర్థ్యములున్నవనియు, డాలరుగాని, కేవల బంగారముగాని వీలైనవికావనియు సారాంశము తేలుచున్నది.

ఇట్టి ఆశయము విశ్వమానవసౌభ్రాత్రము నభిలషించువారలకును, నానాజాతిసమితియం దభిమానులకును, శాంతివాదులకును కేవలార్థికశాస్త్రవేత్తలకును లాభకరముగా నుండు ఇంగ్లాండుదేశమువారికిని రుచించునేకాని స్వార్థపరులై విజ్రంభించుచున్న తదితర స్వతంత్రరాజ్యములవారికి నచ్చుబాటుగా తోచును. ఇట్టి విధానమే అమలులోనికి రానున్నయెడల, నానాజాతిసమితివారు చేయుసహాయము చాలకలదు. దాని యాజమాన్యము క్రింద పెద్దపెద్దబ్యాంకుసంస్థల నేర్పాటుచేయవలసియున్నది. దేశములలోనున్న ప్రభుత్వపు బ్యాంకులు చేయుపనులే సర్వదేశక్షేమకరముగా నానాజాతిసమితి క్రింద నెలకొల్పబడు ఇంటర్నేషనల్ సెటిల్మెంట్సు బ్యాంకువంటిదొకటి మిక్కిలి యుపకారి కాగలదు. ఇట్టిసందర్భములలో అన్నిదేశములకు ఒకేకరెన్సీప్రమాణము నెలకొల్పుటయందుగల యుక్తాయుక్తములను చదువరులే గ్రహింతురుగాక!

# నక్షత్రమండలము

(భావసంవత్సరం పుష్యమాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(కవితాసమితి)

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును ఆయాదిక్కులు సరిగానుండునట్లు తలమీదుగా పెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాగులు

జనవరి 8 తేదీని రాత్రి 8-51 గంటలకును, జనవరి 22 తేదీని రాత్రి 7-56 గంటలకును } కనబడును.]
,, 15 ,, ,, 8-24 ,, ,, 31 ,, ,, 7-21 ,,

But, when Earth's silent foot-fall steals
 along the eastern sky,
And one by one to Earth reveals those
 purer fires on high,
And, when one by one each human sound
 dies on the awful ear,
Then Nature's Voice no more is drowned,
She speaks, and we must here.

---

సూర్యుఁడు అస్తమించిన వెనుక భూగోళము తూర్పుదెసను ముందునకు సాగిపోవుచున్నదని గమనింపక మనము ప్రమత్తులమై యున్నపుడు, ఆకాశసీమ నమితప్రభలతో వెలుగొందు పవిత్ర తేజోమూర్తులొక్కొక్కటె (తెరచాటునుండి పాత్రలవలె) బయల్పడుచుండునపుడు, ఈదినవలోకపు మానవుల గొడవలొక్కొక్కటే కడతేరుచుండ రాత్రియగుచుండునపుడు అపుడు ప్రకృతిమాత కంఠస్వర మప్రతిహతముగ మనకు కర్ణగోచరమ్ము కాగలదు. భయభక్తులం బ్రేరేపు నమ్మహనీయ నిశ్శబ్దవ్యాప్తిలో ప్రకృతికావించు గంభీరోపన్యాసము మనము వినితీరవలెను.

౧౯౩౫-వ సంవత్సరం జనవరి ౮-వ తేదీమొదలు ఫిబ్రవరి ౮-వ తేదీవఱకు రాత్రి తొలిజామున నగపడు ఖగోళవిశేషములను పరికింతము.

## పాలవెల్లి (The Milky way)

ఈమాసములో పాలవెల్లి ఆగ్నేయదిగ్భాగము నుండి వాయవ్యదిక్కునకు, కొంచెము వంగిన వింటి యాకారముతో వ్యాపించియున్నది. అయ్యది యాగ్నేయపు మూలనున్న నౌకామండలము (Argo Navis) కడ నారంభించి శ్వానపూర్వశ్వానములకును, వృత్రమిథునములకును, మధ్యనుండి వృషభ, సారథి, భృగుపరశు, అప్సరస, ఇంద్రమద, ఊర్వశి, పురూరవసు మండలములమీదుగా రాజహంస (Cygnus) పైకి వ్యాపించియున్నది.

## తేజోవిషయమున ప్రథమగణ్యములైన నక్షత్రములు (First Magnitude Stars)

తేజోవిషయమున ప్రథమగణ్యములైన ఇరువది నక్షత్రములలో ఇపుడు పది కనబడుచున్నవి. అవి యేవేవి యనగా:—

౧. ఇంద్రద్యుమ్న (Fomalhaut - సోమలో)
౨. శంతనుడు (Acherner)
౩. అగస్త్యుడు (Canopus)
౪. మృగవ్యాధరుద్రుడు (Sirius)
౫. రిగెల్ (Rigel)
౬. ఆర్ద్ర (Betalgeaux)
౭. రోహిణి (Aldebaran)
౮. బ్రహ్మహృదయము (Capella Auriga)
౯. పూర్వశ్వానము (Procyon)
౧౦. మఘ (Regulus)

### పడమర

రాజహంస వాయవ్యమునను, పూర్వాభాద్ర, ఉత్తరభాద్రా నక్షత్రములు (పేష్యపూర్శ్వము అని వేద ప్రసిద్ధమైన పెగసస్ చతురస్రములోనివి) పడమటను, నాళీకజంఘబకము, ప్రావారకర్ణఘూకము, యుగంధర కమఠము, ఇంద్రద్యుమ్నుడును నైరృతిమూలను అస్తమింపనై యున్న చుక్కలు.

### దక్షిణమున

పెక్కువంకలుతిరిగివచ్చిన యమునానదిచివరను శంతనుడు, ప్రక్కనే బకదాల్భ్యుడు, అత్రిక నౌకా మండలములును చక్కగా కానవచ్చును. నౌకకు అమర భాగమున, చుక్కానికడ అగస్త్యుడు మెఱసిపోవుచున్నాడు. గ్రీకుపురాణకథలో ఈ అగస్త్యనక్షత్రము (Canopus) మెనిలాస్ (Menelaus) యోధుని పడవ చుక్కానిచే పట్టియున్నట్లు చెప్పబడినది. మనసూర్యుని కంటె సుమారు ఆరులక్షలరెట్లు తేజోధికమైన యీ

